# కాంచన మృగమ్

## మాలతీ చందూర్



క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి • విజయవాడ 2

# మాలతీ చందూర్ రచనలు

| | |
|---|---|
| వంటలు పిండి వంటలు | 30-00 |
| ప్రశ్నలు జవాబులు | 15-00 |
| జాబులు జవాబులు | 13-00 |
| అందాలు అలంకారాలు | 15-00 |
| మహిళలకు మధురజీవనం | 7-50 |
| కాంచన మృగమ్ | 16-50 |
| వైశాఖి | 16-50 |
| మనసులోని మనసు | 25-00 |
| భూమి పుత్రి | 16-00 |
| మధుర స్మృతులు | 14-00 |
| ఓ మనిషి కథ | 16-00 |
| ఆలోచించు | 9-00 |
| ఏమిటీ జీవితాలు | 12-00 |
| జయలక్ష్మి | 18-00 |
| కృష్ణవేణి | 18-00 |
| మేఘాల మేలి ముసుగు | 16-00 |
| కలల వెలుగు | 18-00 |
| బ్రతక నేర్చిన జాణ | 14-00 |
| రాగ రక్తిమ | 18-00 |

# శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి నవలలు

| | |
|---|---|
| జలపాతం | 25-00 |
| ఒంటరి నక్షత్రం 1, 2 భాగాలు | 40-00 |
| ఈ జీవితం నాది | 20-00 |
| పెళ్ళి పిల్లలు జీవితం | 15-00 |
| జై జవాన్ | 15-00 |
| జ్యోతి | 16-50 |
| సంయుక్త | 15-00 |
| ఆశల శిఖరాలు | 20-00 |
| బంగారు కలలు | 16-50 |
| ఆహుతి | 25-00 |
| ఈ తరం కథ | 25-00 |
| మీనా 1, 2 భాగాలు | 40-00 |
| జీవన తరంగాలు 1, 2 భాగాలు | 50-00 |
| ప్రేమ లేఖలు | 20-00 |
| కీర్తి కిరీటాలు | 30-00 |
| అనురాగ తోరణం | 16-50 |
| దాంపత్య వనం | 15-00 |
| మధుర స్వప్నం | 16-00 |
| ఈ దేశం మాకేమిచ్చింది | 15-00 |
| నీ రాజనం | 16-00 |
| ప్రేమ సింహాసనం | 18-00 |
| సంసార రథం | 10-00 |
| రాధాకృష్ణ | 20-00 |
| ఆగమనం | 20-00 |
| సహజీవనం | 15-00 |
| సీతాపతి | 15-00 |
| పార్థు | 16-50 |
| స్నేహము | 16-00 |
| హృదయగానం | 22-00 |

# కాంచన మృగం

"ఈ పేషంట్ నా తల్లి అయితే ఎంత బాగుం డును" అనుకుంది నర్స్ ఎలిజబెత్. ఇలా పగటి కలలు కంటం, తన నిత్య జీవితం నుంచి పారిపోయి వూహాలోకాల్లో విహరించటం ఎలిజబెత్‌కి అల వాటయి పోయింది.

తెల్లగా దబ్బపండు ఛాయలోవున్న— అరవై ఏళ్ళ స్త్రీని చూస్తే ఎలిజబెత్‌కి పూజ్యభావం—"అమ్మా" అంటూ పక్కన కూచుని సేవలు చెయ్యాలన్న కోర్కె కలుగుతూ వుంది.

గుండ్రంగా యించుమించు పావలా కాసంత బొట్టు, చేతినిండా బంగారం గాజులు, మెళ్లో చంద్రహారం, బరువుగా మొద్దులావున్న పుస్తెలతాడు, చెవులకి ధగధగ మెరుస్తున్న రవ్వల దుద్దులు, కాళ్ళకి మట్టెలు-వున్న యీ సుందరమ్మగారు నిజంగా సుందరే. అరవై ఏళ్ళకే యింత అందంగా వుంటే, వయసులో ఎల్లా వుండేదో! ఎలిజబెత్ సుందరమ్మగారి అరవై ఏళ్ళలోంచి-నలభై ఏళ్ళు తీసేసి, భూతకాలం లోకి వెళ్ళిపోయి, వూహించుకుంటూ వుండేది. బహుశా యిరవై ఏళ్ళకి యీమె సన్నగా లేత తమలపాకులా, పచ్చని బంగారు వర్ణంతో మెరిసిపోతూ వుండేదేమో! ఈవయసులోనే యింత సౌమ్యంగానరదాగా మాట్లాడుతున్న యీమె, యవ్వనంలో ఎంత చమత్కారంగా కబుర్లు చెప్పేదో! ఈమెని 'అమ్మా' అని పిలుస్తే, 'అమ్మా' అని పిలుస్తూనే వుంది-ఆ పిలుపులో గౌరవం తప్ప-తన మనసులోని ప్రేమని, ఆరాధనని బయటపెట్టలేక పోతున్నది.

మంచంమీద పడుకుని కళ్ళు మూసుకుని వున్న-సుందరమ్మగారి వంక చూస్తున్నది ఎలిజబెత్. ఆమె ముఖంలో ముడతలు లేవు, బుగ్గలు-కొంచెంగా జారినట్లు ఉన్నాయి. కళ్ళు లోతుగా వున్నాయి. అయినా ఈ వయసులోకూడా ఆమె అందంగా హుందాగా వుంది. ఎలిజబెత్‌కి తన తల్లి జ్ఞాపకం వచ్చింది. నల్లగా పెంకు జారినట్లు బిగదీసుకుని, ఎముకల చుట్టూ వరుచుకున్న చర్మం, నల్లగా బీటలువారి ముట్టుకుంటే గరుకుగా వుండే తనతల్లి శరీరాన్ని ఈమె పచ్చని శరీరంతో పోల్చిచూసినపుడు ఎలిజబెత్‌కి అకారణంగా తల్లిమీదకోపం వస్తూ వుంటుంది. తనకిప్పుడు పాతికేళ్ళు కాబట్టి-నల్లగావున్నా, వొళ్ళు నునుపుగా వుంది. తన తల్లి వయసు వచ్చేవప్పటికి తన చర్మం కూడా బీటలు వారిపోతుందా? అబ్బ ఈ సుందరమ్మగారు తన తల్లి అయితే ఎంత బాగుండును! ఆ ఆలోచన వచ్చేవప్పటికి ఎలిజబెత్-ఏదో 'గిల్టీ'గా-నేరం చేస్తున్నానన్నట్లు మనసులో-సిగ్గుపడుతుంది. తన తల్లి

తనని ఎంతో కష్టపడి, కడుపు కట్టుకుని పెంచి, చదువు చెప్పిం చింది. అటువంటి తల్లి గురించి తను సిగ్గుపడుతోందా? సిగ్గుకాదు. ఈ పేషంటు ముఖంలోని ప్రశాంతత, కాంతి తనను అయస్కాంతం లాగా ఆకర్షిస్తున్నాయి.

సుందరమ్మగారు కళ్ళు తెరిచారు. మెల్లిగా కళ్ళు తెరుస్తూనే- చిరునవ్వుతో, దయగా నర్సువంక చూశారు. కుర్చీలోంచి లేచి ముందుకు వచ్చి, వంగి, కప్పుకున్న దుప్పటి సవరించి 'మందు వేసు కునే టైము అయింది' అంది ఎలిజబెత్.

ఆమె నర్సువంక చూసి-"మళ్ళీ జన్మంటూ వుంటే నేనుకూడా నీలాగా నర్సునై పుడ్తానమ్మా. నువ్వు చేస్తున్న సేవ, నీకు నా మీద గల శ్రద్ధ...."

"అలా అనకండి. అది మా వృత్తి ధర్మం.' అంది ఎలిజ బెత్ వారిసూ.

"నువ్వు వృత్తిని-వృత్తిలాగా చెయ్యటం లేదమ్మా-నా కన్న బిడ్డకంటే-ఎక్కువగా చేస్తున్నావు." అంటూ ఎలిజబెత్ చేతిని-పచ్చని తన అరచేతిలోకి తీసుకున్నది. నల్లగా - సన్నగా వున్న ఎలిజబెత్ చెయ్యి-బొద్దుగా పచ్చగావున్న ఆమె చేతిలో చిక్కుకుంది.

ఎలిజబెత్ నవ్వింది. కళ్ళతో, -పెదిమలు అరివిచ్చుకుని- సన్నగా వినీవినపడనట్లు నవ్వింది. ఆ నవ్వులో శబ్దతరంగాలు లేక పోయినా-ఒక మాధుర్యం గాలిలో అలలవలె తేలి, సుందరమ్మగారి చెవులలో సోకినట్లయి, "ఈ ముసల్దాని మాటలకు నవ్వుతున్నావా?" అడిగారు.

"కాదమ్మా. మిమ్మల్ని ఆవిధంగా ఎప్పుడూ వూహించలేను. మీ తెల్లని చేతిలో; నా నల్లని చెయ్యిచూసి నవ్వొచ్చింది. మెరుస్తున్న మీ వేళ్ళు...."

సుందరమ్మగారు చిరునవ్వునవ్వి-కళ్ళు మూసుకున్నారు. ఆమె మనసు గతంలోకి-ముప్ఫైఏళ్ళు వెనక్కి జారిపోతూవుంది. భూత కాలంలోకి పరుగులు తీస్తున్న ఆ మనసుని కళ్ళెంవేసి వెనక్కు లాక్కుని.... "టైము ఎంత అయింది?" అని అడిగింది నెమ్మదిగా.

"మూడున్నర" అంది ఎలిజబెత్. గాజు గ్లాసుతో నీళ్ళు తీసు కొచ్చి పక్క స్టూలుమీద పెట్టి. రెండు రకాల మాత్రలు పై కవర్లు విప్పి, పక్క ట్రేలోవుంచి పేషంటు వీపువెనక చేతులువేసి, నెమ్మ దిగా లేవనెత్తి-అరచేతిలో మాత్ర వుంచి. నీళ్ళగ్లాసు పుచ్చుకు రెడీగా వుంది.

సుందరమ్మగారిని పదిహేనురోజులక్రితం-రాత్రి పదకొండింటి వేళ, ఈ హాస్పిటల్‌కి తీసుకొచ్చారు. గుండెల్లో విపరీతమయిన పోటుతో బాధపడుతోందని వొళ్ళంతా చెమటలుపట్టి, కూచోలేకపడుకో లేక బాధపడుతూ వుంది. అప్పటికి ఆరుగంటలుగా ముందు అజీర్తి నెప్పి అనీ, కండరాలు పట్టుకుని వుంటాయనీ, వూపిరిగొట్టు నెప్పేమో నని, ఎవరికీ చెప్పక రాత్రిదాకా గడిపేసింది. ఇంట్లో భర్త, ఇద్దరు కొడుకులు, కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు అంతా వున్నారు. అయినా ఎవరికీ చెప్పక చాలాసేపటిదాకా, తగ్గిపోతుందేమోనని, పడుకుని వున్నారు, అయితే ఆ నెప్పి తగ్గలేదు. గాలి ఆడక, కూచో లేక, పడక కుదరక ఏదో గాభరాగా, వొళ్ళంతా చెమటల్తో తడిసిపోయే ప్పటికి, అది గమనించిన-కోడలు గబగబా మామగారితో చెప్పింది. అప్పుడే క్లబ్‌నుంచి వచ్చిన రావుగారు-'ఏమిటి, ఏమిటి' అంటూ భార్యగదిలోకివచ్చి-పరిస్థితిచూసి ఖంగారుపడి డాక్టర్‌కి. ఫోన్ చెయ్యా టం-ఆయన వచ్చి చూసి 'హార్టుఎటాక్' ఏమోనని సందేహించి, అంబులెన్సు పిలిపించి, నర్సింగ్‌హోమ్‌లో జేర్పించాలని ప్రయత్నం- యివన్నీ క్షణాలమీద జరిగిపోయాయి.

రాత్రి పదకొండు గంటలవేళ 'ఎమర్జెన్సీ' కేసుగా ఎడ్మిట్

అయిన సుందరమ్మగారిని- డ్యూటీ డాక్టరుచూసీ చూడగానే ముందు 'ఇంటెన్సివ్ కేర్' వార్డ్‌లోకి చేర్చి, ఆ తరువాత చీఫ్‌కి ఫోన్ చేశారు. మరో గంట ఆలస్యం అయితే మనిషి దక్కేది కాదని-ఇది తీవ్రంగా వచ్చిన గుండెనెప్పి అని తేల్చారు. ఆ తరువాత-సుందరమ్మగారికి మూడు రోజులకిగాని స్పృహరాలేదు అంతా ఏదోమత్తుగా, అలుక్కుపోతున్నట్లు వుండేది. చుట్టూ కొత్తమనుషులు,డాక్టర్లు, నర్సులు తప్ప తనవాళ్ళు అనే ముఖాలు కనిపించలేదు. ఏడోరోజు కాబోలు-అసలు తను ఏడురోజులపాటు, ఆ గదిలో వున్నట్లు ఆమెకి తెలియలేదు. ఆ రోజున నర్స్‌ని అడిగింది. 'ఏతారీకు' అనీ! మొదట నర్స్ బదులు చెప్పలేదు, వినిపించుకోనట్లు, డ్యూటీ డాక్టరుని అడిగింది, చెప్పలేదు-ఛీఫ్‌ని అడిగింది.

ఆయన నవ్వుతూ చూసి-'పదహారు' అన్నారు. అంటే తను ఆరురోజులపాటు యిక్కడుందా! పేషంటు మనసులో భావాలుగ్రహించినట్లు ఆయన అన్నారు. "మేము పేషంటుకి తెలియకుండా- ఏ విషయాలు దాచిపెట్టము. ఉన్నది వున్నట్లు చెప్పటం మా అలవాటు, మీకు యిప్పుడేం భయంలేదు. యు-ఆర్-రికవరింగ్" అన్నాడాయన. బిపి. చూస్తూ.

"మా వాళ్ళు...?" అడిగింది నెమ్మదిగా.

"రోజూ పొద్దుటా సాయంత్రం వస్తూనేవున్నారు. మీరు నిద్రపోతూండేవారు. లేపవద్దని అన్నాము.అందుకే చూసి వెళ్ళిపోయేవారు"

"ఆరు రోజులు నిద్రపోయానా?"

"మీకు మీరుగా నిద్రపోలేదు. మీకు రెస్ట్ కావాలి. మీ గుండె అలిసిపోయింది. అందుకని మందులిచ్చి మీకు విశ్రాంతి యిచ్చాము" అన్నాడాయన.

భారీగా పొడవుగా తన మంచంపక్కన నుల్చునివున్న డాక్టర్

వంక చూసింది సుందరమ్మగారు. ఆ ముఖంలో ఆత్మస్థయిర్యము, రోగులకి తనలోని ఆత్మశక్తిని పంచియివ్వగల శక్తి, ఆయన తన మనోధైర్యాన్ని రోగుల దేహంలోకి యింజెక్షను ద్వారా ఎక్కిస్తున్నాడా?- అన్నట్లు ఇంజక్షను యిస్తూ-మంద్రస్థాయిలో నవ్వుతూ మాట్లాడుతూ, చకచక పరిశీలన పూర్తి చేసేస్తూవుంటాడు ప్రభాకర మూర్తి.

"వారిని చూడవచ్చా?" అడిగింది సుందరమ్మగారు.

"అదేమిటండీ? తప్పకుండా - మీరు 'ఎక్సయిట్' అవ కూడదు. మీ రావుగార్కి మీరే ధైర్యం చెప్పాలి. చాలా పిరికిపడి పోయారు-" బ్లడ్ తీస్తూ నెమ్మదిగా చెపుతున్నాడు ఆయన.

సీరియస్ కేసులూ,ముఖ్యమైన కేసులూ అయితే తనే స్వయంగా శ్రద్ధగా చూస్తున్న భావం పేషెంట్లుకి కలగాలన్న ద్యేంగా ఈ చిన్న పనులు కూడా స్వయం చేసూంటాడు డాక్టరు మూర్తి. ముఖ్యంగా ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో వున్న పేషంటుకి, చుట్టూ పరిసరాలు గుర్తించగల క్లారిటీ ఏర్పడే సమయానికి, అతను తప్పకుండా యీ పనులు చేస్తూ వుంటాడు. అందుచేతనే ప్రతి పేషంటు పట్లా ప్రత్యేకశ్రద్ధ చూపిస్తాడనీ, స్వయంగా తనే 'ట్రీట్' చేస్తాడని అందరూ అనుకుంటూ వుంటారు. డాక్టర్ మూర్తిగారి నర్సింగ్‌హోమ్‌లో ఎడ్మిషన్ అంటే- దానికి పెద్ద రికమెండేషన్,పర పతీ వగైరాలు వుండాలి.

"నాకేమయింది?" అడిగింది సుందరమ్మగారు నెమ్మదిగా.

"ఏం కాలేదు. మీరు మీ దేహంపట్ల శ్రద్ధ చూపించలేదు. మనుషులకయినా; మరలకైనా కొంత 'రెస్టు' కావాలి. అవి శ్రమకి తట్టుకోలేక పని చెయ్యమని మొరాయిస్తాయి."

"ఇంకా ఎన్నాళ్ళుండాలి?"

"చూశారా? కాస్తోస్తవోపిక వచ్చేప్పటికి, యిల్లూ పిల్లలూ అంటు న్నారు. పంపించేస్తాము. త్వరలోనే పంపుతాము. ఈ రోజునుంచి కొదికొదిగా భోజనం....'

"అన్నీ వేసుకు తినవచ్చా?"

ఫకాలున నవ్వారు మూర్తిగారు."అన్నీ అంటే ఆవకాయలూ–కొరివికారాలు అనా? ఊహు. మీరు కొన్నాళ్ళు డైట్ విషయంలో జాగ్రత్తగా వుండాలి. ముందు బ్రెడ్‌తో ఆరంభిద్దాం...."

"బ్రెడ్డా?" నిరుత్సాహంగా అంది సుందరమ్మగారు.

"ఫరవాలేదు-తినాలి. ఉప్పులేని బ్రెడ్ తినాలి అని మీ మనసులో మీరునిశ్చయించుకోండి.మిగతాదంతా మావాళ్ళుచూసుకుంటారు.నర్స్‌కి 'డైట్ షీట్' యిచ్చాను. ఆ ప్రకారం తిన్నారంటే! రెండు వారాల్లో మీరు మళ్ళీ మామూలు మనిషి అయిపోతారు. సరేనా... ఈ రోజు బాగా నిద్రపోండి. రేపు ఇంకో వార్డుకి మార్చేస్తాం .... నర్స్ ఈ రోజు అయిదు నిముషాలపాటు విజిటర్స్‌నిరానివ్వచ్చు-ఒక్కసారే అందర్నీ రానివ్వకు. ముందు రావుగారు వచ్చాక....ఆపైన....మిగతా వాళ్ళు. వొచ్చిన వాళ్ళని మాట్లాడమను-పేషంటుని మటుకు అలిసిపోనివ్వకు." అంటూ ఇంటెన్సివ్ రూమ్‌లోంచి బయటికి వెళ్ళిపోయాడు ఆయన.

కళ్ళు తెరిచి, మళ్ళీ చుట్టూ చూసింది సుందరమ్మగారు. గదిలో సన్నని వెల్తురు. చల్లగా–అతి ప్రశాంతంగా వుంది. సన్నని గుయ్ మంటున్న శబ్దం. అది ఏమిటి? ఎయిర్ కూలరా? చూసింది తల కొద్దికొద్దిగా తిప్పవచ్చు నన్నట్లు నర్స్, మాట్లాడకుండా చూస్తూ వూరుకుంది, పేషంటు ఆ పరిసరాలని-కళ్ళతో పరిచయం చేసుకుంటూ వుంటే, ఆ గదిలో ఒక మూలగా ఆక్సిజన్ సిలెండర్, తల వైపుగా ఇ.సి.జి. మానేటర్స్, వరుసగా-రెండు మూడు పేర్చివున్నాయి. ఆ గదిలోనే పొడవాటి సోఫా కమ్‌బెడ్, మరో పక్కగా వాలుకుర్చీ. ఆ కాస్త పరిశీలనకే-ఏదో శ్రమగా, అలసటగా వుండి-కళ్ళుమూసుకుంది.

ఆ గదికున్న ఫ్లష్‌డోరు. ఆ డోరుకి మధ్యలో చిన్న గాజుకిటికీ ఆకిటికీని కప్పటానికన్నట్లు-కర్టెను.మళ్ళీ కళ్ళు తెరిచి ఆ కర్టెన్ వంకే చూస్తున్న సుందరమ్మగారి దృష్టిని గ్రహించుతున్న నర్స్. అక్కడి నుంచి చూస్తే-లోపలున్న మీరు కనబడతారు. మీవాళ్ళు రోజూ ఆ గ్లాసులోంచే మిమ్మల్ని చూస్తూ వుండేవారు."

"లోపలికి రానివ్వరా?"

"ఎందుకు రానివ్వం." మీరు నిద్రపోతున్నారని-మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యకూడదని వచ్చేవాళ్ళు కాదు" అంది నర్స్.

ఆ సాయంత్రం-మొట్టమొదట రావుగారు-గది లోపలికి వచ్చారు పొడవుగా-కాస్త బొద్దుగావున్న రావుగార్ని చూస్తే మొదట లావు అనిపించదు. కాని బుష్ షర్ట్ కిందనుంచి ఆయన బొజ్జ నేను వున్నాను సుమా' అన్నట్లు కాస్త ఎత్తుగా కనిపిస్తూనేవుంటుంది. తెల్లగా వొత్తుగా వుండి-పైకి దువ్వుకున్న జుట్టు, అరవై పైబడినా-రావుగారి వయసు పైకి కనపడదు. ఆయన ఎగ్జిక్యూటివ్ యింజనీరుచేసి, అయిదేళ్ళ క్రితం రిటైర్ అయారు.గవర్నమెంటు ఆఫీసర్లకున్న దర్జా-దర్పమూ చేతికిందున్న మనుషులమీద చలాయించిన అధికారమూ యిత్యాదివి ఆయన మాటలో-నడకలో కనిపిస్తాయి. అయితే రిటైర్ అయిన-గవర్నమెంటు వుద్యోగస్తులకి మల్లే-ఆయన మాటల్లో అసంతృప్తీ-తానేదో పనికిరానన్న నైరాశ్యం కనిపించవు. ప్రతిరోజూ వుదయం వేళ-తప్పకుండా వెళ్ళే వాకింగ్, సాయంత్రంపూట ఆడే టెన్నిసూ, రాత్రిళ్ళు పదింటిదాకా ఆడే పేక-యివి ఆయన జీవితానికి క్రమతనీ, ప్రశాంతతనీ యిస్తున్నాయి. రావుగారు తలుపు తోసుకుని-అతి నెమ్మదిగా పిల్లిలా-అడుగులు వేసుకుంటూ భార్య మంచం పక్కకి వచ్చారు.

సుందరమ్మగారు భర్త రాక గమనించి కళ్ళు తెరిచారు. ఆయన మాట్లాడకుండా భార్య చేతిని రెండు చేతుల్లోకి తీసుకున్నారు. సుందరమ్మగారి కళ్ళంట నీళ్ళు గిర్రున తిరిగాయి. రావుగారి కళ్ళు

తడితో తళతళలాడుతున్నాయి. ఎమోషనల్ సీనుని, ఆ భార్యాభర్తల మధ్యనున్న ప్రేమోద్రేక పూరితమైన దృశ్యాన్ని ప్రేక్షకురాలిలా చూస్తూ వుండిపోవటం యిబ్బందిగావుండి పేషంటునిమాట్లాడించకండి మీరు మటుకే కబుర్లు చెప్పండి. అంటూ ఆ గదిలోంచిజారుకుంది.... డే-నర్స్ అయిదు నిముషాలు మటుకే వుండవచ్చు అని ఆంక్షపెడుతూ

"సుందరం" అన్నారు బొంగురుగా రావుగారు,

సుందరమ్మగారు భర్త చేతిని వదలలేనట్లు గట్టిగాపట్టుకుంది— ఆయన దేహంలోని శక్తినంతా తాను పీల్చుకుంటున్నట్లు.

"ఎలావుంది? మేమంతా ఎంత ఖంగారు పడిపోయామో తెలుసా? సుందరం— నన్ను.... నన్ను ఏంచేసిపోదామనుకున్నావ్? నేను-నేను".... మరి చెప్పలేనట్లు రావుగారు ఆమె మీదకివంగి— కుడి బుజంమీద తలపెట్టుకు వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

"ఛీ, ఛీ వూరుకోండి. చిన్నపిల్ల వాడిలాగా.... అదేమిటి? నాకేమయింది? నేను శుభ్రంగా వున్నాను. ఇంకో రెండు వారాల్లోనువొచ్చే నిస్తారుట. ఆ తరువాత యింటికొచ్చేస్తాను."

"అదికాదు, సుందరం— నీకింత జబ్బుగావుంటే మేము ఎవరం కనిపెట్టలేకపోయాం.... నువ్వు ఆరోగ్యంగా లేవని, గుండె బలహీనంగా వుందని...."

"నాకు మటుకు తెలుసా? అల్లాంటి నెప్పి ఎప్పుడూ రాలేదండి—హాయిగా అల్లా— ఆ రోజున మీ చేతుల్లో పోయివుంటే...."

"ఛీ-ఛీ అలా అనకె, నువ్వులేకపోతే నేను ఎలా బతుకుతాననుకున్నావ్? నాకు ఒక్కపని చేసుకోటం తెలుసా? ఆఖరికి బట్టలు దగ్గర నుంచీ, నువ్వు యివ్వాలే.... నువ్వులేకుండా ఒక్కక్షణం వూహించుకోలేను." గాట్టిగా పట్టుకున్నాడు భార్య చేతిని.

సుందరమ్మగార్కి సంతోషంగా తృప్తిగా వుంది. ఈ అరవై

మూడేళ్ళ మనిషే తను లేకపోతే బతకలేడు. పసిపిల్లవాడిలా యీనాటికీ కొంగుపుచ్చుకు తిరుగుతూనే వుంటాడు. భర్త ముఖంపైపు ప్రేమగా పరిశీలనగా చూసింది.

"మీరు చిక్కిపోయారు. భోజనం చెయ్యడంలేదా? మందులు సరిగ్గా వేసుకుంటున్నారా? రోజూ యింజక్షను తీసుకుంటున్నారా?" అడిగింది.

"తీసుకుంటున్నాను. చిన్నబ్బాయి వున్నాడుగా. సుందరం నువ్వులేకుండా ఆ యింట్లో వుండలేకుండా వున్నాను. క్లబ్‌కి వెళ్ళొద్దు అంటే, నీమీద అంతకోపం వచ్చేదా. ఈ వారంరోజులనుంచి క్లబ్‌కి వెళ్ళాలంటే ఇష్టం అవటంలేదు...."

"వెళ్ళటం లేదా?"

"పెద్దకోడలు బలవంతపెట్టి.... రెండు సెట్లు టెన్నిస్ ఆడమని పంపుతోంది— అంతకితప్ప...." ఆగిపోయారు.

"పేక ఆడటం లేదా?"

"లేదు. ఆడబుద్ధికావటంలేదు. వీళ్ళేమో లోపలికి రానివ్వరు— బయటనుంచే చూడమంటారు. ఇంటిదగ్గర వున్నంత సేపూ, యిక్కడికి రావాలన్న తహతహ! తీరావస్తే నన్ను లోపలికి రానివ్వరు—" చిన్న పిల్లవాడిలా కంప్లయింటు చేస్తున్న భర్తని చూసి నవ్వుకుంటున్నది సుందరమ్మగారు.

"వాకింగ్‌కి వెళ్తున్నారా?"

"లేదు– వెళ్ళాలని అనిపించడంలేదు."

"మానకండి. మీరు తప్పకుండా నడవాలని డాక్టర్ చెప్పారుగదా! రేపటినుంచీ వెళ్ళండి."

"అలాగే"— అన్నట్లు తలవూపి "డాక్టరుగారు నిన్ను మాట్లాడించవద్దన్నారు. నువ్వు మాట్లాడకు. బేబీ రోజూ ఫోన్ చేస్తున్నది. శుక్రవారానికి టికెట్టు దొరికిందట—" అన్నారాయన.

బేబీ అని ముద్దుగా పిలువబడే— రావుగారి గారాల పట్టిపంకజం స్టేట్సులో వుంది. ఇద్దరు పిల్లలు, భర్త. పంకజం ఈ దంపతులకిఆడపిల్ల కావాలని కోరుకున్న తరువాత, కలిగిన ఆఖరు పిల్ల.

"అది పసిపిల్లండీ! వచ్చి ఏం చేస్తుంది?" అడిగారు నెమ్మదిగా సుందరమ్మగారు.

"అసలు నీ విషయం ఫోన్ చెయ్యగానే వెంటనే వచ్చేస్తానంది. చిన్నవాడికి జ్వరమట. మమ్మల్నే చూడనివ్వటంలేదు. అని, డాక్టరు మూర్తిగారిచేత, భయంలేదని ఫోనులో చెప్పించాను— అందుకని ఆగింది."

పిచ్చిపిల్ల.... మీరుసరిగ్గా...." ఆ మాటలు పూర్తి చేసేలోపలే నర్సు తలుపు తోసుకు లోపలికొచ్చింది. అయిదు నిముషాలు అయిపోయాయి అన్నదానికి సంకేతంగా!

"అబ్బాయిలు...." నెమ్మదిగా అడిగారు సుందరమ్మగారు.

"అంతాబాగున్నారా. వాళ్ళని రేపు రానిస్తామన్నారు..... రేపు స్పెషల్‌వార్డ్‌కి నిన్ను మార్చాక— సాయంత్రం రానిస్తారట...." అన్నారాయన.

స్పెషల్ వార్డుకి పేషంటుని మార్చాక.... ఒక ఆరు గంటలపాటు పరిశీలించి రక్తప్రసరణా—గుండె కొట్టుకోటం అంతా మామూలుగావుంటే, ఈ వార్డు మార్పు, పేషంటుమీద ఎటువంటి ప్రభావమూ లేక, అంతానార్మల్‌గా వుంటే, విజటర్స్‌ని రానిస్తారు. ఈ విషయాలు డాక్టర్ మూర్తిగారు వివరంగా చెప్పారు రావుగారితో.

"నువ్వు ప్రశాంతంగా హాయిగా పడుకో— ఇంటికి ఎప్పు

డొస్తావా— అని అందరం ఎదురుచూస్తున్నాం....." అంటూ భార్యపై దుప్పటిసర్ది తలమీద చెయ్యేసి, ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు రావు గారు.

ఆయన వెళ్ళిపోయాక.... బి.పి. చూసింది నర్సు. పల్సు చూసింది. మానేట మీదనున్న యి. సి. జి. రీడింగ్ చూసింది. అంతా నార్మల్‌గానే వుంది. పేషంటు 'ఎగ్జయిట్' అవలేదు, అమ్మయ్యా అనుకొని రిపోర్టు రాయటానికి ఆరంభించింది.

ఆ మరునాడు సుందరమ్మగారిని స్పెషల్ వార్డుకి మార్చారు. ఈవార్డుకి వచ్చాక కూడా మూడు రోజులపాటు స్పెషల్ నర్సు-పగలూ రాత్రి- విడవకుండా ప్రక్కన వుండేది- తలమటుకు కదలనిచ్చేవారు. ఆ తరువాత నెమ్మది నెమ్మదిగా - కాళ్ళ చేతులు కదలనిచ్చి - చివరికి - మందు తాగటానికి - పక్కమీదనున్న మనిషి నెమ్మదిగా లేచి కూచో వచ్చు నర్సు సాయంతో—అన్నారు. సరిగ్గా పదిహేను రోజులకి యీ స్థితికివచ్చాక- ఎలిజబెత్‌ని- నర్సుగా వేశారు. ఎలిజబెత్ - నర్సింగ్ గ్రాడ్యుయేట్ కాదు. స్కూలు ఆఫ్ నర్సింగ్‌లో చదివింది. సీరియస్ కేసులకి-ఎలిజబెత్‌ని పోస్టుచెయ్యరుగాని నిదానమూ రోగులమీద శ్రద్ధా, ఎప్పుడూ చిరునవ్వుతో వుండే ఆ అమ్మాయి స్వభావమూ చూసి-రికవరీరూమ్‌కి పోస్టు చేస్తూవుంటారు అప్పటికి మూడు రోజులుగా- ఎలిజబెత్ సుందరమ్మగారి - బెడ్ దగ్గర స్పెషల్ నర్సుగా- సేవచేస్తున్నది.

ఈ పేషంటు సంపన్నురాలు - చక్కగా వుంటుంది. దయగా వుంటుంది. చీటికిమాటికి విసిగించదు. వీటన్నిటితో పాటు ఆమె చుట్టూ వున్న బంధువులు - కొడుకులూ - కోడళ్ళూ ఫారిన్ నుంచి వచ్చిన కూతుర్ని చూసేప్పటికి ఎలిజబెత్‌కి - మనసులో అప్పుడప్పుడు వెలితిగా వుండేది.

పెద్దకోడలు పిల్లల్ని యిద్దర్నీ తీసుకొచ్చినా, ఒక్క క్షణంపాటు మామ్మకి చూపించి-వెంటనే బయటికిపంపెయ్యటం చూసి-ఎలిజబెత్‌కి ఆశ్చర్యంగా అనిపించింది. పెద్దకోడలు రేవతి. అత్తగారికి శ్రమగా వుండకూడదు-ఆమె అలిసిపోకూడదని-పిల్లల్ని పంపేసి, ఒక్క అయిదు నిముషాలు కూచుని క్షేమం విచారించి వెళ్ళిపోతుంటే-వింతగా వుండేది ఎలిజబెత్‌కి. రెండో కోడలు వుద్యోగం చేస్తున్నదిట- ఆమె ఆ వూరులోని ఆడ పిల్లల కాలేజీలో లెక్చరరు. ఒక్కత్తే ఆడపిల్ల. ఆరేళ్ళ పిల్లా-రబ్బరు బొమ్మలా బొద్దుగా తెల్లగావుండి చిలకలా "గ్రానీ" అంటూ, మామ్మని అచ్చు దొరసాని పిల్లలా, బుగ్గమీద ముద్దు పెట్టుకుంటుంటే, ఎలిజబెత్‌కి తమాషాగా అనిపించేది. మాధవి-అది రెండో కోడలు పేరు, అని సుందరమ్మగారే తరువాత చెప్పింది ఎలిజబెత్‌కి. ఈ మాధవి బాగా గంజిపెట్టిన ఆర్గండీ చీరెలు కట్టుకుని, సగం కత్తిరించిన జుట్టుని రబ్బర్‌బాండ్‌తో ముడి వేసుకుని, ముట్టుకుంటే చీరె నలుగుతుందేమోనన్నట్లు, అత్తగారి పక్కన కుర్చీ లాక్కుని కూర్చునేది. మాధవి కుర్చీలో కూచుంటే-చీరె కుచ్చెళ్ళు-ముందు అడుగు దూరందాకా నేలమీద పర్చుకుని వుండేవి. ఆ కుచ్చెళ్ళు చూస్తుంటే-ఎలిజబెత్‌కి తను చిన్నప్పుడు, మిషన్ స్కూల్లో చూసిన దొరసాని బొమ్మల గౌనులు జ్ఞాపకం వచ్చేది. లేతరంగులో వున్న మాధవి జాకెట్‌లోంచి "నైలాన్‌లేసు-బ్రా" లీలగా కనిపిస్తూ వున్న ప్రతిసారీ, ఎలిజబెత్‌కి ఎలాగోవుండేది. మందంగా వుండి, బాగా గంజిపెట్టి వేసుకున్న, తన యూనిఫారమ్‌లోంచి- ఇలా బాడీలు కనిపించవు. జాకెట్ లోపల వేసుకున్న "లేసు-బ్రా" యింత ఆకర్షణీయంగా వుంటుందా? ఒక్క క్షణంపాటు తను కూడా ఈ మాధవి లాగా అందంగా స్మార్టుగా వుంటే ఎంత బాగుండును అనిపించేది ఎలిజబెత్‌కి. మాధవి-చుట్టూ పరిసరాలని గమనించనట్లు ప్రవర్తించేది.

ఒక్క అత్తగారు తప్ప-గదిలోని మిగతా అంతా ప్రాణంలేని వస్తువు లన్నట్లుగా వుండేది ఆమె మాటతీరు. మాధవి యిలా తనని-నిర్లక్ష్యంగా చూడటం. కనీసం పలకరించక పోవటం-ఎలిజబెత్‌కి కాస్త కష్టంగా వుండేది.

సాధారణంగా ఆమె నర్స్ చేస్తున్న పేషంట్ల బంధువులూ, దగ్గరవారూ-ఎలిజబెత్‌తో మర్యాదగా, మామూలుగా మంచి శ్రద్ధగా మాట్లాడుతుంటారు. నర్స్‌తో బాగా మాట్లాడితే, పేషంటుని- యింకా శ్రద్ధగాచూస్తుందన్న భావంతో! అయితే మాధవి తనని లక్ష్యపెట్టకుండా వుండటం ఎలిజబెత్‌కి- వుడుకుమోత్తనంగానే వుండేది. ఆ అమ్మాయి వచ్చిన రెండు నిముషాల్లోనే- "పేషెంటుకి-రెస్ట్ కావాలి. శ్రమపెట్టకండి-అలిసిపోయారు-" అంటూ తన "అథారిటీ" చూపిస్తూవుండేది. అయితే-మాధవి మరికాస్సేపు వుంటానని- అడిగేదికాదు టక్కున లేచి వెళ్ళిపోయేది-పిల్లని ఎత్తుకుని.

ఎలిజబెత్‌కి సుందరమ్మగారి సంతానం అందరిలోకి - పంకజం చాలా నచ్చింది. ఆ అమ్మాయికి ముప్పై అయిదేళ్లు వుంటాయి - సన్నగా పొడవుగా వుంటుంది. పెద్దపెద్దకళ్లు పదేళ్ళుగాఅమెరికాలో ఉన్నా,.వేష భాషల్లోగాని మాటలోగాని కాస్త కూడా మార్పులేదు. మామూలు మధ్య తరగతి గృహిణి లాగా అతి నిరాడంబరంగా వుండి - చనువుగా కబుర్లు - చెపుతొండేది. పంకజం వచ్చిందీ అంటే - అమెరికా కబుర్లు - తమయింట్లో సామాను, అక్కడి సౌకర్యాలు గబ గబ చెపుతూ వుండేది. తల్లి అనిగాని ఎలిజబెత్ పరాయి మనిషి అని గాని భేదం చూపించేదికాదు. అందర్నీ సమానంగా చూసేది. పంకజం ఎలిజబెత్‌ కని - చిన్న ప్రెజంటుకూడా తీసుకొచ్చింది అమెరికానుంచి.

మరో రెండు వారాలు - యీ స్పెషల్ వార్డులో వుంటే - ఆపైన యింటికి పంపిచేస్తాం అన్నారు డాక్టరుగారు. పగటి పూట నర్సు వుండక్కర్లేదు - యింట్లో వారు ఎవరైనా దగ్గర వుంటే చాలు అన్నారు డాక్టర్ ప్రభాకరమూర్తి. అయినా రావుగారు ఒప్పుకోలేదు. సుందరమ్మగారుకూడా - ఎలిజబెత్ వుండాలన్నారు. ఈ స్పెషల్ వార్డులో గది విశాలంగా - వుంటంచేత పేషంటుకు సాయంగా వుండే మనిషి సోఫాకమ్‌బెడ్ మీద పడుకోవచ్చు. తమ పిల్లలని శ్రమ పెట్టటం యిష్టం లేదని - వాళ్లకి పేషంటుని చుసుకోటం చేతగాదని సుందరమ్మగారు ఎలిజబెత్ - తనతోపాటే వుండాలన్నారు. ఆమె యిలా ప్రత్యేకం తననే నర్సుగా వుండాలని కోరుంకోవటం ఎలిజబెత్‌కి గర్వంగావుంది.

ఒక విధంగా యీ పదిరోజులనుంచీ ఎలిజబెత్‌కి కూడా రెస్టుగానే వుంది. మొదట్లోలాగా-సుందరమ్మగారికి ఏ క్షణంలో ఏమైపోతుందోనన్న ఆదుర్దా వుంటంలేదు. ఇప్పుడిప్పుడు, అరకప్పుఅన్నం, చప్పిడి కూరలు తినమంటున్నారు. ఆమె లేచికూచుంటే-ఎలిజబెత్ నెమ్మదిగా తలదువ్వి జడవేస్తున్నది. మూడు రోజుల క్రితం స్పాంజి బాత్ యివ్వమన్నారు. రెండు మూడు రోజుల్లో మామూలుగా వేడి నీళ్ళుకూడా పోసుకోవచ్చు-అన్నారు. సుందరమ్మగారు కబుర్లు చెప్తూంటే ఎలిజబెత్ తన్మయతతో వింటూండేది.

రావుగారు రోజూ సాయంత్రం వేళ వచ్చి, అరగంట సేపు కూచునేవారు. ఆయన పొద్దుటినుంచీ ఎలా కాలక్షేపం చేసేదీ-భార్యకి చెపుతూంటే, ఎలిజబెత్‌కి తమాషాగా ఉండేది.

"పొద్దుట వాకింగ్‌కి వెళ్ళారా?" అడిగేది సుందరమ్మగారు భర్తని-

"వెళ్ళాను."

"కాఫీ ఎన్నిసార్లు తాగారు-"

"రెండుసార్లు-"

"క్లబ్‌లో...."

ఆయన జవాబు చెప్పకుండా-తప్పుచేసి, పట్టుబడిన పిల్లవాడిలా యిటూ-అటూ చూస్తూండేవారు.

"డ్రింక్-తీసుకున్నారా...." రెట్టించి అడిగేది. ఆయన మెదల కుండా వూరుకునేవారు.

"బీరా? విస్కీయా....చెప్పండి. మీ వంటికి పడదని తెలుసు కదా.... ఎన్ని గ్లాసులు తీసుకున్నారు?"

"రెండు," అనేవారు అబద్ధం చెప్పటం చేతకానట్లు.

"అంటే-రెండు సీసాలన్నమాట. నాకేం. మీకే బొజ్జ వచ్చే స్తుంది. ఆ తరువాత కొత్త పాంట్లు కుట్టించమంటే వూరుకోను.... కాఫీలో పంచదార బాగా వేసేసుకుంటున్నారు కదూ?" నవ్వుతూ అడి గేది ఆవిడ.

ఆయన దొంగ పిల్లవాడిలా తల వూపేవారు. ఈ దంపతుల సంభాషణ వింటుంటే, ఎలిజబెత్‌కి చాలా సరదాగా వుండేది. వారి మాటలు అదేదో ఒక ఎమోషనల్- ఎక్సయిట్‌మెంటు కలుగజేస్తూ వుండేవి. కిటికీలోంచి బయటకి చూస్తూ ఈ మాటలన్నీ వింటూండేది అంత పెద్ద వుద్యోగం చేసిన రావుగారు, భయం భయంగా భార్య దగ్గర తన తప్పులు వొప్పుకోడం, ఆమె మెత్త మెత్తగా మందలిం చటం-యిదంతా ఒక సుందర స్వప్నంవలె అనిపించేది ఎలిజబెత్‌కి. పెళ్ళి చేసుకుంటే, దంపతులు యిలా వుండాలి, దాంపత్య జీవితం యింత మధురంగా వుండాలి-ఈ యిద్దరూ ఎంత అదృష్టవంతులో- అనుకునేది ప్రతిసారీ!

"ఎలీజా-" అని పిలుస్తూండేవారు రావుగారు ఎలిజబెత్‌ని-మొదట్లో ఆ పేరుకి సిగ్గుపడింది. వుక్కిరి బిక్కిరి అయింది.

"నీపేరు 'ఎలిజబెత్' అని చెప్పింది మా ఆవిడ. అంత పొడవుగా పిలవలేను. 'ఎలీజా' అంటాను" అని ఆయన అనేప్పటికిపొంగిపోయింది.

"ఎలీజా నీపేషంటు- రాత్రిళ్ళు సరిగ్గా నిద్రపోతున్నదా? యింకా కాంపోజ్ యిస్తున్నారా?" అడిగారు. ఆయన తమ సంభాషణలోకి ఎలిజబెత్‌నికూడా లాక్కొస్తుండేవారు. రెండో కోడలు మాధవి లాగా ఎలిజబెత్‌ని దూరంగా వుంచే వారుకాదు. ఈ దంపతుల సంభాషణలో ఎలిజబెత్ కాసేపు సుందరమ్మగారి పక్షం-కాసేపు రావుగారి పక్షం చేరి మాట్లాడుతూండేది. ఆయన కూచున్నంతసేపూ-ఆ గదిలో వాతావరణం నవ్వుల్తో-హాస్యోక్తులతో చైతన్యవంతంగా వుండేది.

సుందరమ్మగారి కుటుంబంలో-మొగవారు భార్యా విధేయులు-అన్నది ఎలిజబెత్‌కి స్పష్టమైపోయింది. ఆమె కొడుకులు యిద్దరూ 'అమ్మా' ఎలా వుంది అని పలకరించి-ఒక క్షణం మంచం పక్కనుల్చుని వెళ్ళిపోయేవారు. పెద్ద కోడలు రేవతి మటుకు అత్తగారి పక్కన కూచుని, యింటి వ్యవహారాలు, పాలవాడికి డబ్బు, పనివాళ్ళ జీతాలు అంటూ లెక్కలూ డొక్కలూ చెప్పేది. ఆ యింటి నిర్వహణ పెద్దకోడలి బాధ్యత అన్నది-ఎలిజబెత్‌కి అర్థం అయింది.

"వంటావిడ రెండు రోజులుగా రావటంలేదు' అంది ఒక రోజున పెద్దకోడలు రేవతి.

"అవే. ఆ విషయం మాధవి చెప్పలేదే-ఎందుచేతట?" అడిగారు సుందరమ్మగారు.

"వంట్లో బాగాలేదట. పంకజం వుంది కాబట్టి-ఎలాగో లాక్కొ

స్తున్నాను. మామగారు టిఫినులు హోటల్నించి తెప్పిస్తున్నారు. అంది రేవతి.

ఎలిజబెత్ కి ఈ మాటలు-కాస్త తృప్తిని సంతోషాన్నిఇచ్చాయి ఈ చిన్న కోడలు మాధవి, యింటి పనుల్లో కల్పించుకోదన్నమాట. చక్కగా డ్రెస్ చేసుకుని-చీర నలక్కుండా కూచుంటుంది కాబోలు. ఆ విషయం అక్కడితో ఆపేసి-సుందరమ్మగారి సంభాషణ మరో వైపుకి తిప్పటం గమనించింది ఎలిజబెత్.

ఎలిజబెత్ అప్పటికి అయిదేళ్ళుగా నర్సుగా వుంది ఈ ప్రయివేట్ హాస్పటల్లో. ఆమె రకరకాల పేషంట్లని చూసింది. ఆడా మగా, ఆపరేషన్లవారు, మామూలు జబ్బులువాళ్ళు అందర్నీ చూసింది. కొందరు పేషంట్లు వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ ప్రజంట్లు యిచ్చేవారు ఆమె సేవకి సంతోషించి. కొందరు ఆఫీసులో డబ్బు కట్టేవారు-ఆమె డ్యూటీకి చెందవలసిన ఫీజు! ఏ పేషంటు నుంచీ-ఎలిజబెత్-బహుమతులని ఆశించేదిలేదు. తన వృత్తిలో ప్రతిఫలం ఆశించకూడదు అన్న తొలి పాఠం ఆమె మొదట్లోనే నేర్చుకుంది. అంచేతనే అయిదేళ్ళుగా ఈ ఆస్పత్రిలో వుంటున్న ఎలిజబెత్ పట్ల ఛీఫ్ కి చాలా నమ్మకం. ఆమె పేషంటుని-పేషంటుగా చూడగలదు-రోగితో ఎమోషనల్ యిన్వాల్వ్ మెంటు లేకుండా వుండగలదు-అన్నది లోగడ చాలాసార్లు గమనించారు ఆయన. వయసులోవున్న మొగ పేషంట్లపట్ల-వయసులో వున్న నర్సులు ఎలా ప్రవర్తించగలరో-ఆయన తన స్టూడెంట్ డేస్ లో గమనించటంచేత-నర్సులు కేవలం నర్సులుగానే వుండాలన్న మొదటి నిబంధనని, చాలా కఠినంగా అమలు పరుస్తాడు డాక్టర్ ప్రభాకరమూర్తి.

సుందరమ్మగారు స్పెషల్ వార్డుకి వచ్చి,మూడు వారాలు దాటి పోయింది. మంచం పక్కన కుర్చీవేసి, నెమ్మదిగా-మంచం మీంచి కుర్చీలోకి జారి-వరండాలో యిటూ అటూ ఆ చక్రాల కుర్చీలో కూచో పెట్టి, తిప్పవచ్చు అన్నారు. కప్పు అన్నం-కూరలూ-పళ్లూకూడా తిన వచ్చునన్నారు. ఆహారంలో ఎక్కువ నూనెలూ, పుష్పాకారాలు వుండ కూడదన్న కఠిన నిబంధన. ఎలిజబెత్‌కి-జీవితంలో ఎప్పుడూ లేనంత సంతోషంగా, విశ్రాంతిగా వుంది. రోజూ భోజనం చేశాక-సుందరమ్మ గారు గంటసేపు నిద్రపోతూండేవారు. ఆ గంటా-ఎలిజబెత్ తెలుగు పత్రికలు చదువుతూ కూచునేది! ఈపాటి తీరిక, ఆమెకి ఎన్నడూ లభించలేదు యింతవరకూ.

"నాతోపాటు-కొన్నాళ్ళు నిన్నుకూడా పంపమని డాక్టరుగారిని అడుగుతాను-" అంది సుందరమ్మగారు ఒకరోజున.

"ఎందుకమ్మా? నా అవసరం మీకు వుండదు?"

"ఉంటుంది. రాత్రిళ్లు లేచినప్పుడు, నువ్వు దగ్గిర వుంటం అలవాటయిపోయింది."

"ఇంట్లో కోడళ్ళు-అమ్మాయి-బాబుగారు అందరున్నారు. ఎవ రన్నా మీ పక్కన మంచం వేసుకు పడుకుంటే, సరిపోతుంది-నన్ను పెట్టుకోటం అంటే-రాత్రికి యాభై రూపాయలు దండగమ్మా-నాకు డబ్బు తీసుకోవటం యిష్టం లేకపోయినా-మా వృత్తిరీత్యా-వూరికే సేవ చెయ్యటం వీలవదు."

"డబ్బుదేముంది? యాభై గాదు వంద యిస్తేమటుకు నీలాగా

శ్రద్ధగా సేవచేసే అమ్మాయిలు దొరుకుతారా? మా కోడళ్ళూ-కొడుకులూ పిల్లలూ వాళ్ళ గొడవలు వాళ్ళవి పంకజం....దానికి చిన్నతనం వదలలేదు. పడుకుంటే-భూకంపం వచ్చినా మెలకువరాదు."

"బాబుగారున్నారుగా?" కాస్త అల్లరిగానే అడిగింది ఎలిజబెత్.

"ఉన్నారు. ఆయనా పెద్దవారై పోయారు. రాత్రిళ్ళు చీటికి మాటికి లేపి-శ్రమ పెట్టటం యిష్టంలేదు. ఈ వయసులో ఆయన నాకు సేవ చేయటం ఏమిటి? అందుకనే ఒక నెల్లాళ్ళపాటు-నైట్ డ్యూటీకి నిన్ను పంపమని డాక్టరుగార్ని అడగాలనుకుంటున్నాను-"

"ఒక్క నెల్లాళ్ళేనా? ఆపైన నన్ను మర్చిపోతారా? నా అవసరం లేదా?" అడిగింది ఎలిజబెత్.

"నాకే గనక నీమీద అధికారం వుంటే-జీవితాంతం నిన్ను నా దగ్గరే అట్టే పెట్టుకుని వుండేదాన్ని. నిజం చెప్పనా? నిన్నుచూస్తుంటే మా అమ్మాయికంటే దగ్గరదానివి, ఆత్మీయురాలివి అనిపిస్తోంది." అన్నారు సుందరమ్మగారు. తలదువ్వుతూ వున్న ఎలిజబెత్ చేతిని-తన కుడిచేతో గటిగా పటుకుని.

ఎలిజబెత్‌కి కళ్ళు చెమర్చాయి. ఇది ఏనాటిబంధం? సంపన్నురాలయిన ఈ గృహిణికీ-తనకీ మధ్య అనురాగ బంధం ఎందుకేర్పడింది? ఈమె తనకి ఏమవుతుంది? తన కులం గాదు-తన మతంగాదు-తన జాతికాదు. ఈ రోగిపట్ల తనకెందుకీ మమకారం?

"ఎలిజబెత్, నినోకమాట అడగనా?" అన్నారు సుందరమ్మ.

"అడగండి"

"నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు? హాయిగా పిల్లా పాపా...."

"మా వృత్తిలో పెళ్ళి పనికిరాదమ్మా-?"

"అవి పూర్వపు రోజులు. చాలా మంది నర్సులు పెళ్ళి చేసుకుంటున్నారు."

"కాని, నా కుటుంబ పరిస్థితులు...."

"నువ్వెప్పుడూ- నీ గురించి చెప్పవేం? మా వాళ్ళనంతా చూశావు. పేరు పేరునా-నా మనుమలు-మనుమరాళ్ళ గురించి నీకు తెలుసు-నీ గురించి నాకేం తెలియదు-" అడిగారు సుందరమ్మగారు.

ఎలిజబెత్ హృదయం ఆనందంతో వుప్పొంగిపోతున్నది. తనని కేవలం నర్సుగా గాక, మనిషిగా గుర్తించి అడుగుతోంది. తనకి మనసుంది-కోరికలున్నాయని యీమె గ్రహించుకుంది.

"నాకు వోపిక వచ్చాక మీ అమ్మగార్ని పిలిపించి మాట్లాడుతాను. చక్కటి కుర్రాణ్ణిచూసి నీకు పెళ్ళి చేస్తాను" అంది సుందరమ్మగారు ఎలిజబెత్ జవాబు చెప్పేలోపలే.

"నాకు చాలా బాధ్యత లున్నాయమ్మా. మా నాన్న నా చిన్నప్పుడే చచ్చిపోయాడు. నాకు తమ్ముడున్నాడు. వాడో వెర్రిబాగులవాడు. మా అమ్మనీ తమ్ముడినీ వదిలి నేను ఎక్కడికీ వెళ్ళను- వెళ్ళలేనమ్మా" అంది ఎలిజబెత్.

"అందుకని- సహజమైన జీవితం చంపుకుంటావా?"

"అంతే! కొందరు అట్లాగే బతకాల్సి వుంటుంది నాలాంటి వాళ్ళు...."

"మీ అమ్మనీ తమ్ముడినీ చూసేటువంటి మొగవాడు దొరకవచ్చుగా."

"ఏమో- నేను అలాంటి ఆశలేం పెట్టుకోలేదు."

"మీ అమ్మ నీకు సంబంధాలు చూడలేదా?" అడిగింది సుందరమ్మగారు.

ఎలిజబెత్ ఫక్కున నవ్వింది. "దేనికి నవ్వుతున్నావ్?" అన్నట్లు ప్రశ్నార్థకంగా చూశారు సుందరమ్మగారు.

"మీకు మా కుటుంబాల గురించి తెలియక అడుగుతున్నారమ్మా నాకు రోజూ యాభై రూపాయలు దొరుకుతాయనుకుంటున్నారు కదూ! ఉహూ. మీలా స్పెషల్ నర్సుని పెట్టుకునే పేషంట్లు- తక్కువ మంది వుంటారమ్మా. అందులో చాలా సీరియస్ అయినపుడు- నన్ను డ్యూటీకి వెయ్యరు. నేను గ్రాడ్యుయేట్ నర్స్‌ని కాదు కాబట్టి, కాస్త నయము యాక- నన్ను డ్యూటీకి వేస్తే ఒకటి రెండురోజులకంటే వుంచుకోరు. ఆ యిచ్చేదాంట్లో కొంత నర్సింగ్ హోమ్‌కి పోతుంది. ఈ అదనపు సంపాదన నెలనెలా వుండదు. ఎప్పుడోతప్ప. ఇక జీతం అంటారా- అది పెట్టుకు ముగ్గురం తినాలి. సంబంధాలు వెతకటంలేదా? అని అడిగారు మీరు అందుకు నవ్వొచ్చింది. మా అమ్మకి బజారు వెళ్ళి రేషన్ తేవటం మటుకే తెలుసు. పెళ్ళికొడుకుల్ని వెతకటం చేత కాదు."

"నిన్నెవరూ చేసుకుంటామని- అడగలేదా?"

"అడిగారు. నా జీతం డబ్బుల కోసం పెళ్ళి చేసుకుందామని అనుకున్న వాళ్ళు—— ఒకరిద్దరు అడిగారు."

"మీ తమ్ముడు ఆ పిల్లాడేం చదువుకోలేదా?"

"లేదండి వాడుత్త అమాయకుడు వెర్రిబాగులవాడు."

"ఏదన్నా వుద్యోగంలో పెట్టక పోయినావా?"

"లాభం లేదండి. వాడుత్త పసి పిల్లవాడి కంటే అన్యాయం. నేనూ అమ్మా లేకపోతే వాడు బతకలేడు"

"అలా అనే- మొగ పిల్లల్ని చెడగొట్టేస్తున్నారు. ఆడపిల్లల సంపాదనమీద! బ్రతికే మొగపిల్లలు ఎప్పటికీ బాగుపడరు. ముందు మీ తమ్ముడిని ఎక్కడో ఒక చోట వుద్యోగంలోపెట్టు, నేను బాబు

గారికి చెప్పి మీ తమ్ముడికి వుద్యోగం యిప్పిస్తాను." అంది సుంద రమ్మగారు.

ఎలిజబెత్ మాట్లాడలేదు.

"ఏం చదువుకున్నాడు?" రెట్టించారు సుందరమ్మగారు. ఎలిజ బెత్ - సోపుతో నూనెచేతులు కడుక్కొని- పక్కలాకర్‌లోంచి చీరె జాకెట్టూ తీసింది. ఆ మాట వినిపించుకోనట్లు. బట్టలు మార్పించేం దుకు. పౌడరూ_వగైరా సిద్ధం చేసుకుని ఆ పనిలో నిమగ్నమయి పోయింది.

సుందరమ్మగారి పరిస్థితి- మామూలుకి వచ్చేసింది. గదిలో యిటూ అటూ నెమ్మదిగా తిరగవచ్చు అన్నారు. మందుల సంఖ్య ఎనిమిది రకాలనుండి మూడురకాల దాకా తగ్గించారు. రాత్రిళ్ళ 'కాంపోజ్' పూర్తిగా మాన్పించారు. ఇక నాలుగురోజులలో యింటికి పంపుతామని చెప్పారు డాక్టర్ మూర్తిగారు. అందరికీ చాలా వుత్సా హంగావుంది. ముఖ్యంగా రావుగారు-ఎప్పుడెప్పుడా అని తహ తహ లాడిపోతున్నారు. తమ బెడ్‌రూమ్‌లో- చెత్తసామానంతా తీసేశారుట! రూము యిప్పుడు హాలులాగా విశాలంగా వుందిట. ఒక పక్కన ఎలిజ బెత్ మంచంకూడా వెయ్యవచ్చు అని సలహా చెప్పారు భార్యకి.

"ఇదిగో_ మీరా గదిలో పడుకోవాలనుకుంటున్నారేమో, అదేం కుదరదు. మీరు పక్కగదికి మారిపోండి" అంది సుందరమ్మగారు.

"ఏం? నువ్వు లేకుండా నేను వంటరిగా ఎన్నడైనా పడు కున్నానా?"

ఆ మాటలు విని ఎలిజబెత్ పక్కకి తిరిగి నవ్వుకుంటున్నది.

"మీరు బొత్తిగా సిగ్గులేని వారై పోతున్నారు. మీ వయ సెంత? యీ వయసులో మాట్లాడాల్సిన మాటలేనా?"

"ఏం? ఏ వయసయితే ఏం? నువ్వు నాకు పెళ్ళానివి కాదా? నేను నీకు మొగుణ్ణికానా?"

"అందుకని- వంటరిగా పడుకోనని యిప్పుడు మనుమలు పుట్టాకకూడా అంటారా."

"ఎందుకనకూడదు? పెళ్ళాం దగ్గర లేందే నాకు నిద్దర పట్ట దన్నాను. ఇందులో తప్పు పట్టాల్సింది ఏముంది? అసలు గర్వపడాలి నా మొగుడు నన్నింత ప్రేమిస్తున్నాడని."

"ఏడిసినట్లే వుంది. అరవై ఏళ్ళు వచ్చి యిట్లా మాట్లాడటానికి మీకు సిగ్గులేదా అని.... మీ నోటికి హద్దూ పద్దూ లేదు. ముందు నా గదిలో ఎలిజబెత్‌కి మంచం ఏర్పాటు చెయ్యండి. మీరు పక్కగది లోకి మారిపోండి- వింటున్నారా?"

"అట్లాఅయితే,నేను యిల్లు వదిలిపెట్టి పారిపోతాను-సన్యాసుల్లో కలిసిపోతాను."

"వెళ్ళండి? బాగా లడ్డూలు- కోవాబిళ్ళలు తినొచ్చు అడ్డుపెట్టే వాళ్ళు ఎవరూవుండరు." అంది నవ్వుతూ సుందరమ్మగారు.రావుగారూ నవ్వారు మనసారా.

ఎలిజబెత్‌కి యీ దంపతులని చూసినపుడల్లా గుల్‌మహర్ చెట్టు జ్ఞాపకం వస్తుంది. విరగబూసిన ఆ చెట్టు సౌరభం వెదజల్లుతూ-చుట్టూ వారికి ఆహ్లాదం కలిగిస్తూ వుంటుంది. ఈ దంపతులు కూడా పసి పిల్లల్లాగా- చిన్న చిన్న ప్రణయ కలహాలు కలిపించుకు వాదించు కోవటం చూస్తున్నపుడు సంతోషంగా హాయిగా వుంటుంది.

ఆ మర్నాడు తొమ్మిదింటి వేళ మళ్ళీ అన్ని పరీక్షలూ చేసి, సుందరమ్మగార్ని యింటికి పంపుతామన్నారు. మధ్యాహ్నం- పది

పదకొండింటి వేళ మంచిదని- వర్జ్యంలేదనీ నిశ్చయించి. రావుగారు ఆవేళకి భార్యని యింటికి తీసుకెళ్ళేట్లు ఏర్పాట్లు చేసుకున్నారు.

ఆ రోజు బుధవారం- మామూలుగా ఆరింటికి నిద్రలేచారు సుందరమ్మగారు.రాత్రిపూట కాచిన పాలు, ఫ్రిజ్‌లో వుంచి-వుదయం టీ తయారు చేసి యివ్వడం ఎలిజబెత్‌కి అలవాటు, నర్సింగ్‌హోమ్‌లో రెండు పెద్ద ఫ్రిజ్‌లు వున్నాయి. స్పెషల్‌వార్డు పేషంట్లు- పాలు, యింజక్షన్సూ మందులు పెట్టుకోటానికి యివి వాడుతు-టారు. ఎలిజబెత్, సుందరమ్మగారికి పళ్ళు తోమించి టీ తయారు చేసి యిచ్చింది. ఆమెతోపాటు తనూ తాగడం ఎలిజబెత్‌కి అలవాటయింది. టీ తాగిన సుందరమ్మగారు అలా కాసేపు వరండాలో యిటు అటూ తిరిగి మంచం మీద కొచ్చి కూచున్నారు. ఎలిజబెత్ ఆమె స్నానానికై ఏర్పాట్లుచేస్తున్నది. రోజూ ఆ టైములో ఎలిజబెత్‌కి-యింటి దగ్గర నుంచి టిఫిన్ కాఫీ వస్తుంది. పక్కింటి కుర్రవాడు పొట్లం తీసుకొచ్చి కిటికీలో పెట్టి వెళ్ళిపోతుంటాడు రోజూ.

మంచం మీద కూచుని సుందరమ్మగారు ఆనాటి తెలుగుపేపరు చూస్తున్నారు. తలుపు తోసుకుని- 'అక్కా' అని నత్తి నత్తిగా పిలుస్తూ యిరవై ఏళ్ళ కుర్రా డొచ్చాడు.

ఓ కాలు యీడుస్తూ- పైపెదిమ తొర్రిగా వున్న వాడిమొఖంలో- ఒక రకమైన అమాయకత! పేపర్లోంచి తల ఎత్తి చూసిన సుందరమ్మగారు, ఆ పిల్లవాడిని తేరిపార చూస్తున్నారు. రెప్పవెయ్యకుండా చూసి- 'దగ్గరకురా' అన్నట్లు సౌంజ్ఞచేశారు. వాడు కాలు యీడుస్తూ మెలిక పడిన కుడి పాదాన్ని నేల మీదకి లాక్కుంటూ, మంచం దగ్గర కొచ్చాడు. ఆవిడ ఆ పిల్లవాడి చేతుల్ని గట్టిగా పట్టుకున్నారు.... ఆ కుర్రవాడు భయంతో 'అక్కా' అని పిలుస్తుంటే బాత్‌రూమ్‌లోని ఎలిజబెత్ ఖంగారుగా పరుగెత్తుకొచ్చింది.

"నువ్వెందు కొచ్చావురా?" అడుగుతోంది గదమాయిస్తున్నట్లు.

"అమ్మ-అమ్మ" అంటూ వాడేదో చెప్ప బోతుండగా-ఎలిజబెత్ గభాలున తన దృష్టి సుందరమ్మగారి వైపుకి తిప్పింది. ఆవిడ ఏదో అనబోతున్నది - రాబీ రెండు చేతుల్ని పట్టుకొని. కళ్ళు భయంకరంగా, కనుగుడ్లు పై పైకి పోతున్నాయి. ఎలిజబెత్ గభాలున పక్కనున్న మంచినీళ్ళ గ్లాసు ఆమె నోటికి అందించింది-తమ్ముడిని పక్కకి తోసి! ఆవిడ నీళ్ళు గుటక వెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు! "పల్సు" గబగబా-విపరీతమైన వేగంతో కొట్టుకొంటున్నది-ఎలిజబెత్‌కి ఖంగారుగా వుంది.

"ఒరేయ్, అమ్మగార్ని పట్టుకో-డ్యూటీ డాక్టర్ని పిల్చుకొస్తాను...." ఎలిజబెత్ గదిలోవున్న ఎమర్జన్సీ బజర్ నొక్కడం మర్చిపోయింది-ముందుకు అడుగు వెయ్యబోతున్న ఎలిజబెత్‌ని ఆగమన్నట్లు సౌంజ్ఞచేసి-వెనక్కి జారబడిపోయారు సుందరమ్మగారు. ఎలిజబెత్ ఆక్సిజన్ సిలండర్-కనెక్ట్ చేద్దామని ప్రయత్నిస్తోంది-రోగి మాటలాడటానికి ప్రయత్నిస్తున్నారు. ఆ పిల్లవాడిని దగ్గరకు రా-అన్నట్లు పిలుస్తున్నారు. వాడి చేతుల్ని అందుకోవాలన్నట్లు చెయ్యి జాచారు. ఎలిజబెత్, తమ్ముడిని ముందుకు తోసింది-ఆమె, వాడి రెండు చేతులూ పట్టుకుని, కాస్త నిలదొక్కుకున్నట్లుగా వున్నారు....యీలోగా ఎలిజబెత్ బజర్ నొక్కి-వరండాలోకి పరుగు పరుగున నడిచింది. డ్యూటీ డాక్టరు బాత్‌రూమ్‌లో ఉన్నాడుట, తలుపు దబదబ బాది అతన్ని బయటకి తీసుకొచ్చి-రూమ్‌లోకి పరుగెత్తుకొచ్చారు-నర్సులూ-డాక్టరూ కలిసి! అప్పటికే-సుందరమ్మగారు తల తిరగేసి ఉన్నారు. అందరూ ఖంగారుగా-ఆమె గుండెని, "రివైవ్" చెయ్యటానికి ప్రయత్నించారు. లాభం లేకపోయింది-ఇంజక్షన్లూ-గుండెమీద మర్దనా ఏమీ పని చెయ్యలేదు-ఒక్క రెండు నిముషాల వ్యవధిలో-ఆమె గుండె ఆగిపోయింది. "కార్డియాక్ అరెస్ట్-ఏం చేసీ లాభం లేదు" అన్నాడు డ్యూటీ డాక్టరు-అప్పటిదాకా గుండెలమీద రాసి-అలిసిపోయిన అతను.

ఎలిజబెత్‌కి పాతాళంలోకి కుంగిపోతున్నట్లుగా ఉంది-ఏమ యింది? తన కళ్ళ ఎదుట-క్షణం క్రితం దాకా మాట్లాడుతున్న యీ మె, ఏమైపోయింది? ఎలా వెళ్ళిపోయింది. ఛీఫ్‌కి ఫోన్ వెళ్ళింది-సుంద రమ్మ గారింటికి ఫోన్ వెళ్ళింది-అంతా గుంపులు గుంపులుగా వస్తు న్నారు. ఎలిజబెత్ వరండాలో నుల్చుని ఉంది.

"అక్కా-" అన్నాడు నత్తి నత్తిగా మాట్లాడుతూ-కాలు ఈడు స్తున్న ఎలిజబెత్ తమ్ముడు.

ఎలిజబెత్ అప్పటిదాకా వాడి వునికినే మర్చిపోయింది-వాడు అసలే పిరికివాడు, భయస్థుడు. "నువ్వు యింటికి వెళ్ళిపోరా?" అంది ఎలిజబెత్ వాడిని అనునయిస్తూ.

వాడు తన మెడవైపు చూపిస్తూ...."ఆ అమ్మగారు యిది నా మెళ్ళో వేశారు." అన్నాడు తడుముకుంటూ.

ఎలిజబెత్ నిర్ఘాంతపోయింది. ఏం జరుగుతోందో-చుట్టూ ఏం జరుగుతోందో బోధపడనట్లుగా ఉంది-కళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. కింద పడిపోకుండా-వెనక వరండా కిటికీవూచలు పట్టుకుంది ఆసరాగా.

"ఎందుకిచ్చారు?" అడిగింది నూతిలోంచి లాగా.

"తె-తెలియదు-దగ్గరకు, నా తలకాయ లాగి, వడేశారు-"

"ఏమన్నా చెప్పారా?"

"లేదు.... చె చెయ్యి వణికిపోతుంటే-న నన్ను వేసుకో మన్నారు."

"నువ్వే వేసుకున్నావా?"

"ఆ...."

"తరువాత?"

"దగ్గరకు రమ్మని చేత్తో పిల్చారు"

"వెళ్ళావా?"

"వెళ్ళాను-"

"ఏం చేశారు?"

"రెండు అరిచేతుల్ని-పట్టుకుని వేళ్ళు లెక్కపెట్టారు అక్కా.... నా తలని రెండు చేతుల్తో కావిలించుకుని, నువ్వు ముద్దు పెట్టుకుంటావే, అలా ముద్దు పెట్టుకున్నారు అక్కా. నావేళ్లు-పట్టుకు పట్టుకు చూశారు-"

ఎలిజబెత్, నుల్చోలేనట్లు నేలమీద కూచుండిపోయింది.... ఆవిడ ఎందుకిలా చేసింది?

"వారేయ్, నువ్వు తీసుకున్నావా? ఆవిడ యిచ్చారా?" అడిగింది ఎలిజబెత్-వాడి కళ్ళల్లోకి చూస్తూ.

ఆ కళ్ళు-తెల్లగా, నిర్మలంగా వున్నాయి. అక్క ప్రశ్నలోని తీక్షణత కూడా అర్థం చేసుకోలేని వాడి కళ్ళని, వాటిలోని నిజాయితీని చూసి-ఎలిజబెత్ కే సిగ్గు వేసింది-"ముందు ఆ మెళ్లోది తీసి యిల్లా యివ్వు." అంది చెయ్యిజాపి! వాడు మారు మాటాడకుండా తీసి యిచ్చేశాడు. ఎలిజబెత్ ఒక్క లిప్తపాటు అరి చేతులోకి చూసింది-ఏం చెయ్యాలో నిశ్చయించుకోలేక-యిటూ అటూ చూసి, జాకెట్ లోపలున్న పర్సు తెరిచి, అందులో పడేసి-మళ్ళీ పర్సుని జాకెట్ లోపల పెట్టేసింది.

"నువ్వు యింటి కెళ్ళిపో, అమ్మతో ఏమీ చెప్పకు, అన్నం తినేసి పడుకో. అన్ని పనులూ అయితే తప్ప, నేను సాయింత్రం దాకా ఇంటికి రానని చెప్పు," అంది ఎలిజబెత్, తమ్ముడిని పంపేస్తూ.

ఎలిజబెత్ కి గదిలోపలి కెళ్ళాలంటే ఏదో అదురుదురుగా వుంది. షుమారు, నాలుగు వారాలుగా-తనకి ఆ నిర్జీవ శరీరంతో పరిచయం

ఉంది. ఆ దేహస్పర్శ-ఆమె నాడి, ఆమె గుండెలు, ఆమె రక్త ప్రసరణ, ఆమె తలకట్టు, కాళ్లూ, చేతులూ అన్నీ తనకి పరిచితం. నవ్వుగా ఆమె దేహంలోని ప్రతి భాగం తాను స్పృశించింది. ఆమె హృదయంలో కొద్దిచోటు సంపాయించుకుంది, ఆమె గుండెల్లోని మాధుర్యం చవి చూసింది. ఇంత చైతన్యంతో-కొద్ది క్షణాల క్రితందాకా హాయిగా మామూలుగా వున్న యీ శరీరంలో ఇప్పుడు ఏమీ లేదా? మాట్లాడ లేదా? తనని పల్కరించదా? తన సాయం అక్కర్లేదా?

చుట్టూ బంధువులు-రావుగారు! దూరంగా గోడకి ఆనుకుని నుల్చుని శూన్యంలోకి చూస్తున్నారు. ఆయన కళ్ళు-ఎండి పోయినట్లు-కాంతిహీనంగా ఉన్నాయి.

"బాబుగారూ! నన్ను క్షమించండి" అని ఆయన కాళ్ళుపట్టుకు ఏడ్చింది ఎలిజబెత్.

"నువ్వేం చేస్తావ్? టైము వచ్చింది-వెళ్ళిపోయింది. మీ అమ్మగారు నన్ను వంటరి వాణ్ని చేసి వెళ్ళిపోయింది చూశావా?" చిన్న పిల్లవాడిలా ఆయన ఎలిజబెత్‌ని పట్టుకుని బావురుమన్నాడు. ఎలిజబెత్‌కి ఎలా సముదాయించాలో తెలియటం లేదు.

"ఎలిజబెత్-అమ్మ ఏమన్నా చెప్పిందా? మమ్మల్ని అడిగిందా? అమ్మా-అమ్మా-" అంటూ ఏడుస్తున్నది పంకజం. మెడదాకా ఎర్రని శాలువ కప్పుకుని ప్రశాంతంగా కళ్ళు మూసుకుని ఉన్నారు సుందరమ్మగారు. పైన తిరుగుతున్న ఫాను గాలివల్ల-ఆమెకి వూపిరివున్నట్లే-గాలి పీలుస్తున్నట్లే అనిపిస్తోంది-ఇంకా ప్రతికేవుందా అన్న భ్రమతో నుదురు పట్టుకుని మాటి మాటికి చూస్తున్నారు చుట్టూ వారు.

గంటలో ఆ మంచం, ఆ గది ఖాళీ అయిపోయినాయి. అంబులెన్స్ తీసుకొచ్చి సుందరమ్మగారి దేహాన్ని స్వగృహానికి తీసుకెళ్ళిపోయారు భర్తా పిల్లలూ కలిసి. ఆమె దేహాన్ని గేటు బయటదాకా

సాగనంపి! ,అలా నిల్చుండిపోయింది దిమ్మదిరిగి పోయినట్లుగా ఎలిజబెత్.

ఆమె వెనక్కి తిరిగి, హాస్పటల్ లోపలి కొచ్చేటప్పటికి-వార్డు బాయస్, తోటి వాళ్ళు కలిపి రూము క్లీన్ చేస్తున్నారు. ఎలిజబెత్ ఛీఫ్ గదిలోకి వెళ్ళింది-వోడిపోయిన మనిషిలా టేబుల్‌మీద చేతులు ఆనించుకుని-ఎదుటి గోడమీదకి చూస్తున్నారు. ఆయన కళ్ళలో బాధ-పరాజయం, నిస్సహాయత.

"సార్-అయామ్ సారీ" అంది ఎలిజబెత్ కన్నీళ్ళు ఆపుకుంటూ.

"ఇది మన వృత్తిలో ఒక భాగం. పేషంటు ఇలా వెళ్ళిపోయిన ప్రతిసారీ, నాకేమిటో నిస్పృహగా అనిపిస్తుంది-మృత్యువుని జయించలేము కాని, యింత దగ్గరలోవుండి కూడా తెలుసుకోలేకపోయాము. మా చదువు-మా వైద్యశాస్త్రం యివన్నీ నిరర్థకమనిపిస్తూ వుంటుంది...."

"సారీ-మన చేతిలో ఏమీలేదు."

"రాత్రికూడా అంతా నాచేతిలో వుందనుకున్నాను. అంత ప్రమాద పరిస్థితిలో ఆమెని తీసుకొచ్చారు. అప్పుడే పోయివుంటే యింత బాధగా వుండేదికాదు. పాపం, ఆ రావుగారు నా మీద ఎంతో నమ్మకం...." ఆగిపోయారు డాక్టర్ ప్రభాకరమూర్తి.

ఎలిజబెత్‌కి ఏం చెప్పాలో-ఛీఫ్‌తో ఎలా మాట్లాడాలో అర్థం కావటంలేదు. సుందరమ్మగారి స్వభావం-అందరినీ ఆకర్షించింది. ఆమె నవ్వుతూ సంతోషంగా వుంటం, ఏ విషయంలోనూ వాదించకుండా డాక్టరు చెప్పినట్లు చెయ్యటం-ఇవి ఆమెని మోడలీ పేషంటుగా చేశాయి! ఆమె ప్రభావం ఛీఫ్‌మీద కూడా యింత గాఢంగా వుందా? ఎలిజబెత్‌కి కన్నీళ్ళు ఆగటం లేదు బలవంతాన ఆపుకుంటున్నది-

కడుపులోంచి తన్నుకొస్తున్న దుఃఖాన్ని దుఃఖంకంటే ఒక విధమైన భయం ఆమెని వుక్కిరి బిక్కిరి చేస్తోంది.

"సార్," అంది నెమ్మదిగా. ఎలిజబెత్ ఛీఫ్‌ని డాక్టరుగారూ అని పిలవదు. డాక్టర్ అంటే-తనతో ఏదో సమాన స్థాయిలో వున్నట్లుగా అనిపిస్తూ వుంటుంది. ఛీఫ్ తనకంటే వెయ్యిరెట్లు పైన వున్నారు.

"నువ్వు యింటి కెళ్ళిపో. బాడీని తీసేప్పుడు ఖబురు పెడ్తారు. అప్పుడు వెళ్లి చూద్దువుగాని. యు నీడ్ రెస్ట్....వాళ్ళ బంధువులూ, వాళ్లూ రావాలిట–"

"సార్-నాదో మనవి–"

"ఏమిటి? వాళ్ళింటికి యిప్పుడే వెళ్తావా? వొద్దు. నువ్వు తట్టుకోవటం కష్టం."

"అది కాదండి. సుందరమ్మగారు యిది నా కిచ్చారు." అంటూ పర్సు బోర్లించింది ఎలిజబెత్. బల్లమీదకు చిల్లర డబ్బుల్తోపాటు తళ తళ మెరుస్తున్న చంద్రహారం వుండ చుట్టుకునివున్న పచ్చని తాచు పాములా పడివుంది టేబుల్ మీద.

"డాక్టర్ మూర్తి నోటమాట రానట్లుగా నిశ్శబ్దంగా వుండిపోయాడు. ఎలిజబెత్ వంక చూడటంకూడా మర్చిపోయి–టేబుల్ మీద నున్న చంద్రహారం వంక రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు.

"సార్" అతి నెమ్మదిగా పిలిచింది ఎలిజబెత్.

"నా నిజాయితీమీద మీకు నమ్మకం వుంది కదా. అయిదేళ్లు బట్టి నన్ను చూస్తున్నారు."

"ఉంది."

"ఈ పొద్దుట-నా తమ్ముడు టిఫిన్ తీసుకొచ్చాడండి-వాడిని చూసి, ఆవిడ దగ్గరకు పిల్చి, యీ గొలుసు మెళ్లో వేశారు."

డాక్టర్ ప్రభాకరమూర్తి మూఢునిలాగా బుర్ర యిటూ అటూ వూగిస్తున్నాడు! ఎలిజబెత్ మాటలు నమ్మశక్యంగా కనిపించటం లేదు.

"అసలు ఏం జరిగింది? నువ్వు ఒక్క విషయం విడవకుండా చెప్పు." ఆజ్ఞాపిస్తున్నట్లు అడిగాడు.

"పొద్దుట మామూలుగా టీ తాగారండి. వరండాలో కాసేపు పచార్లు చేశారు. మంచంమీద కూచుని పత్రిక చదువుతున్నారు. ఈలోగా నేను స్నానానికి నీళ్ళు సిద్ధం చెయ్యటానికి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాను" ఆగింది ఎలిజబెత్..

"అప్పుడేం జరిగింది?"

"మా తమ్ముడు 'రాబీ' వచ్చాడు....మీకు తెలుసుగా వాడు వెర్రిబాగులవాడని? అమ్మ రాబీ చేతికిచ్చి టిఫిన్ పంపింది రోజూ వచ్చే పిల్లవాడు రాలేదుట-వాడు 'అక్కా'అని పిలుస్తూ లోపలి కొచ్చాడు...."

"నువ్వు ఆ గదిలో లేనన్నావుగా?"

"బాత్‌రూమ్‌లోకి వినిపించింది వాడి మాట వాడు భయభయంగా మళ్ళీ "అక్కా" అని పిలిచేటప్పటికి నేను బాత్‌రూమ్‌లోంచి గదిలోకి వచ్చాను. మంచంమీద వున్న సుందరమ్మగారు వాడి చేతులని పట్టు కున్నారు వాడు భయంతో వొణికి పోతున్నాడు. అప్పుడు చూశాను- ఆవిడ ముఖంపంక నల్లగుడ్లు పైకి పోతున్నాయి, ముఖం తెల్లగా పాలి పోతుంది. మా తొర్రి వెధవని చూసి భయపడ్డారేమోనని వాడిని వెనక్కి తోసి-మంచినీళ్ళు యిచ్చాను. గుటక వె న్నారు...."

"తరువాత?" ఆదుర్దాతో ముందుకు వొంగి అడిగాడు ఛీఫ్.

"డ్యూటీ డాక్టర్‌ను పిలవటానికి పరుగెత్తాను. ఆక్సిజన్ కనక్ట్ చెయ్యబోయాను. ఆమె 'వద్దు' అన్నట్లు చెయ్యి వూపి వాడిని దగ్గరకు రమ్మని సౌంజ్ఞ చేశారు....యీలోగా నేను బజర్ నొక్కి - డ్యూటీ డాక్టర్ కోసం పరుగెత్తాను. మేము వచ్చేటప్పటికి ఆవిడ తల వెనక్కి జారిపోయింది."

"మీ తమ్ముడు?"

"వాడు అల్లాగే మంచం దగ్గర నుల్చుని వున్నట్లు జ్ఞాపకం. ఆ తరువాత నేనేమీ గమనించలేకపోయాను. అంతా అలుక్కుపోయి నట్లు-ఖంగారు. ఆమెని బ్రతికించాలని, గుండె రివైవ్ చెయ్యాలని ఆదుర్దా....మీకు ఫోన్ చేసింది అప్పుడే...."

"ఇది - ఎలా నీ చేతికి వచ్చింది?" టేబుల్ మీదకి వేలుతో చూపించి అడిగాడు డాక్టర్ ప్రభాకరమూర్తి

"అంతా అయిపోయింది - మీరంతా వచ్చారు. వాళ్ళు వాళ్ళంతా ఏడుస్తున్నారు. వెనక వరండాలో నుల్చుని వున్నాను - అప్పుడు మా తమ్ముడుకూడా నా పక్కన నిలబడివున్నాడుభయపడుతూ! ఆ సమయంలో వాడు తన చొక్కా కింద వున్న మెడమీదకి వేలుతో చూపించాడు. ఇది ఆవిడ యిచ్చింది అంటూ-"

"తరువాత?"

"నాకు భయం వేసింది. ఎందుకిస్తుంది? మా తొర్రి వెధవకి? ఆవిడ యిది యివ్వడం ఏమిటి? నమ్మలేక పోయాను.వాడి కళ్ళలోకి చూసి అడిగాను నిజం చెప్పమని?"

"చెప్పాడా?"

"చెప్పాడండి. మా వాడి గురించి మీకు తెలుసుగా. అబద్ధానికి-నిజానికి భేదం తెలియని వెర్రిబాగుల వాడని....నేను డ్యూటీ డాక్టరు

కోసం పరుగెత్తినపుడు ఆవిడ వీడిని దగ్గరకు రమ్మని సౌంజ్ఞ చేశారుట! అన్నట్లు చెప్పటం మర్చిపోయాను.ఆక్సిజన్ సిలండర్ మంచం దగ్గరకు తీసుకు రాబోతుంటే వద్దని-సౌంజ్ఞ చేశారు-బజర్ కూడా 'నొక్కొద్దు' అన్నట్లు చేత్తో చూపించారు. నేను వినిపించుకోక వాడిని అక్కడే ఉండమని పరుగెత్తాను."

"ఆ లోపల ఇచ్చారుటా?" ఆయన కంఠం కాస్త వ్యంగ్యంగానే ఉంది.

"మీరు నమ్మినా నమ్మకపోయినా-ఒకటి మటుకు నిజమండీ! నా తమ్ముడు అబద్ధం ఆడడు-వాడు భయస్తుడు-పిరికివాడు. అమ్మ చెంగూ, నేను తప్ప వాడికి ప్రపంచం తెలీదు." విసురుగా ఉంది ఎలిజబెత్ కంఠం.

"ముందు, జరిగింది జరిగినట్లు చెప్పు."

"ఆవిడ వాడిని దగ్గరకు పిల్చారుట.వాడి రెండు అరిచేతులూ పట్టుకు చూశారుట-తలవంచుకుని సౌంజ్ఞ చేశారుట-వాడి తలను కావిలించుకుని ముద్దుపెట్టుకున్నారుట-"అక్కా-నువ్వు ముద్దు పెట్టుకుంటావే అల్లా నాతల ముద్దు పెట్టుకున్నారు-" అన్నాడు వాడు.మా అమ్మకూడా వాడిని నా అంత ముద్దు చెయ్యదండి. వాడి కళ్ళు అమాయకంగా, నోరులేని జంతువు కళ్ళలా వుంటాయి."

"ఇది ఎలా యిచ్చారుట?" అడిగాడు ఛీఫ్.

"బలవంతాన-ఆయాసపడుతూ, చేతితో మెడలోంచి తీసి వాడి తలమీద వేశారుట-అది వాడే మెడలో వేసుకున్నాడుట. ఆవిడ చేత్తో "వేసుకో" అన్నట్లు చూపించారుట- అదీ జరిగింది."

"నీ కెప్పుడు తెలిసిందీ విషయం-"

"డ్యూటీ డాక్టర్లూ-నర్సులూ పరుగెత్తుకుంటూ వచ్చారు.... నేనూ వచ్చాను. అప్పటికే ఈమె తల వరిగిపోయి ఉంది. మా ప్రయ

త్నాలు మేము చేశాము. గుండె "మాసాజ్" చేశారు. ఇంజక్షను యిచ్చారు-ఆక్సిజన్ ప్రయత్నించాము-ఆ టైములో నాకు ఏమీ కనపడ లేదు-అసలు వాడున్నాడనే విషయమే మర్చిపోయాను. అంతా అయి పోయి, మీరంతా వచ్చాక, వెనక వరండాలో నిల్చున్నప్పుడు, వాడు నా పక్కకివచ్చి నుల్చున్నాడు-ఇంటికి వెళ్ళిపోరా అంటే-దీన్ని చూపించాడండి."

"అప్పుడేం చేశావ్?"

"ఏం చెయ్యాలో తోచలేదు నాకేదో భయం వేసింది. గదినిండా జనం. ఆ టైములో వెనక్కి తీసుకెళ్ళి ఆవిడ మెళ్లో ఎలా వెయ్యను? వేస్తే, ఏమంటారు? అసలు నీ చేతికి ఎలా వచ్చిందని అడగరా? అందుకని వాడి మెళ్లోంచి తీసేసి పర్సులో వేసుకుని, ఎవరికీ-ఆఖరికి మా అమ్మకు కూడా చెప్పొద్దని యింటికి పంపేశాను_"

"ఎవరికీ చెప్పడా?"

"చెప్పడు. నా మాట జవదాటండండీ!"

"ఎంచేత?" అడిగాడు.

"మీకు జ్ఞాపకంవుందా? నేను యీ ఆస్పత్రికి వచ్చిన కొత్తలో వాడి - ఆ మెలికపడినపాదం సరిచెయ్యాలని, వైద్యం చేయించమని అడిగాను."

తలవూపాడు డాక్టర్ ప్రభాకరమూర్తి.

"మేము బీదవాళ్ళం - వాడు వెర్రిబాగులవాడు- అందుకని మాకు నెప్పి, బాధ వుండవనుకున్నారు- నేను నేరంగా చెప్పటం లేదండి. వాడికి - 'లోకల్ ఎనెస్తీషియా' యివ్వకుండా పాదం సరి చెయ్యాలని చూశారండి-"

"మైగాడ్" అన్నాడు డాక్టర్....

"మా తమ్ముడు-జంతువులాగా అరిచాడండి. బాధతో గిల గిల్లాడిపోయాడు. పాదం వాచిపోయింది.- రెండోరోజున నేను అక్కడివాళ్ళతో తగాదావేసుకుని వాడికి కాలువద్దు-చెయ్యీ వద్దని రిక్షాలో యింటికి తీసుకెళ్ళిపోయాను. పదిరోజులపాటు రోజూ గంట గంటకీ-'కోల్డుకమ్‌ప్రెషన్' యిచ్చేదాన్నండి. అప్పటినుంచీ వాడికి నేనంటే ప్రాణం. వాడి కళ్ళలోనిబాధ-భయం నేను ఎప్పటికీ మర్చిపోలేనండి. వాడు నాతో అబద్ధం చెప్పడు-చెప్పలేడు."

"ఇదంతా నాతో ఎందుకు చెప్పలేదు. ఎవరా స్టాఫ్ మెంబర్సు-?" అడిగాడు కోపంతో, ప్రస్తుత సమస్య మర్చిపోయి డాక్టరు ప్రభాకర్ మూర్తి.

"అయిపోయిందికదండి. వాళ్ళుకూడా చాలా మారిపోయారు. పీడంటే వాళ్ళకి జాలేనండి యిప్పుడు. నీ తమ్ముడు అబద్ధం చెప్పడని ఎందుకంత నమ్మకం అని అడిగారు కదండీ-అందుకని యీ కారణం అంతా చెప్పుకొచ్చాను."

"నువ్వేం చేశావ్?"

"వాడి మెడలోంచి తీసేసి-నా పర్సులో వేసుకున్నానండి."

"నీ చేతిలో పర్సు ఎక్కడిది?" అడిగాడు క్రాస్ ఎగ్జామ్ చేస్తున్న లాయర్‌లా.

ఎలిజబెత్ తలవంచుకుంది. మళ్ళీ చివాలున తలఎత్తి "సార్ మీరు మగవారు. మీకు యిలాంటి విషయాలు చెప్పకూడదు. ఆస్పత్రిలో పేషెంట్లందరూ నిజాయితీవారు అనుకోకండి. అప్పుడప్పుడు మా చిల్లరా మాయమైపోతుంది. అందుకని మానర్సులం-డ్యూటీలో వున్నాసరే హాండ్‌బాగ్‌లో డబ్బులు వుంచుకోను."

"ఎక్కడుంచుకుంటారు?"

"చిన్న పర్సులో డబ్బుపెట్టి-అది యూనిఫారమ్‌కి లోపలున్న

జాకెట్‌లో దాచుకుంటాం. దీన్ని కూడా అలానే దాచాను. ధాచి-మావాడిని బయటకి పంపి బాడీ వెళ్ళిపోయాక మీదగ్గరకు సరాసరి వచ్చాను. దీన్ని ఏం చెయ్యమన్నారో మీరే చెప్పండి?" అంది ఎలిజబెత్-తన బాధ్యత వదిలించుకున్నాను అన్నట్లుగా! ఆమెకి తలమీంచి పెద్ద బరువు దించుకున్నట్లుగావుంది.

"మెళ్ళో యీ వస్తువు లేనట్లు వాళ్ళ వాళ్ళెవరూ గుర్తించ లేదా?" అడిగాడు టేబుల్ మీదనున్న వస్తువుని చేతిలోకి తీసుకుంటూ! అది మూడు పేటలున్న చంద్రహారం. బరువుగా తళతళ మెరుస్తూవుంది సుమారు యిరవై కాసులుండవచ్చు. ప్రస్తుత పరిస్థితులద్వారా చూస్తే సుమారుముప్పై వేలదాకా ఖరీదు చెయ్యొచ్చు. ఇంతవిలువైనవస్తువుని-సుందరమ్మగారు యీ వెర్రిబాగులవాడికి ఎందుకిచ్చింది? ఎలాయివ్వగలిగింది? ఎలిజబెత్ నిజం చెపుతున్నదా? ఒకవేళ ఎలిజబెత్ కావాలని యీ కథ అల్లిందా? అల్లివుంటే, యీ నగ తన దగ్గర కెందుకు తీసుకువస్తుంది? తను రక్షించి యీ నగయిప్పిస్తానన్న నమ్మకంతో యిక్కడికొచ్చిందా? ఎలా రక్షిస్తాడు? దుఃఖంలో, ఆమె అకస్మాత్తుగా మరణించిందన్న బాధలో, అందరూ ఆ నగ గురించి మర్చిపోయినా, మృతశరీరానికి స్నానం చేయిస్తున్నపుడు యిది బయటపడదా? అప్పుడు తన దగ్గరకు పరుగెత్తుకురారా? దుఃఖం దుఃఖమే- డబ్బు డబ్బే-స్మశాన వైరాగ్యం మనిషిని ఒకగంటకూడా పట్టి ఆపదు. బంగారం- ఎవరు వదులుకుంటారు? రావుగారి కుటుంబ సభ్యులు-తమ ఆస్పత్రిమీదకి వచ్చి పడరా? దొంగతనం అంటగట్టరా? ఏం చెయ్యాలి?

"నన్ను చిక్కుల్లో పెట్టావ్?" అన్నాడు ఛీఫ్.

"అవును, సార్- ఇది నేను కావాలని చెయ్యలేదు. మన ఆస్పత్రికి ఎందరో రోగులు వచ్చారు_నయంఅయి వెళ్ళిన వారు వున్నారు; చనిపోయిన వాళ్ళు వున్నారు. కాని యిలా విచిత్రంగా ప్రవర్తించినవాళ్ళు ఎవరూ లేరండి. నాకేదో భయంగా వుందండి. ఏంచెయ్యాలో తోచక, మీకు అప్పగించాను."

"నన్నేం చెయ్యమంటావ్?"

"మీ యిష్టం-ఆ నిర్ణయం మీకే వదుల్తున్నాను."

"వాళ్ళకి తిరిగి యిచ్చెయ్యనా?"

"ఇవ్వండి. కాని మన ఆస్పత్రిలో దొంగతనం జరిగింది-స్టాఫ్ దొంగవాళ్ళు అంటేమటుకు నేనుభరించలేను. ఇంత వరకూ మన హాస్పటల్ కి అటువంటి చెడ్డపేరు రాలేదు. ఆ మాటంటే మటుకు వూరుకోకండి."

"ఏం చెయ్యమన్నావు?" కుతూహలంగా అడిగారు.

"ఏం చెయ్యాలో నాకు తెలియదండి. నిజం నిజమే. నేను ఏసుప్రభువు సాక్షిగా చెపుతున్నాను. ఆ అమ్మగారు-మా వెర్రిబాగుల వాడికి చంద్రహారం కావాలని యిచ్చారు. ఆమె చేతులారాయిస్తే, వీడు పుచ్చుకున్నాడు. వాడు దొంగిలించలేదు."

"ఎందుకిచ్చారంటావ్-కారణం?"

"నాకు తెలియదండి-"

"మరి వాళ్ళు కారణం లేకుండా వొప్పుకుంటారా? వూరికే యిచ్చారంటే నమ్ముతారా?"

"నమ్మరు."

"మరి?"

"ఉన్న నిజం అదండి. జరిగింది జరిగినట్లు చెప్పాను. మా తమ్ముడు-వెర్రిబాగులవాడండి. వాడు అమాయకుడు ఆకలేస్తే కూడా చెప్పలేనంత పిచ్చివాడు. వాడు దొంగతనం చేశాడు-ఆ గొలుసు తీసుకున్నాడూ అంటే,-నేను నమ్మను. నా ప్రాణం అన్నా వదుల్తాను గాని వాడు అబద్ధం ఆడతాడంటే వొప్పుకోను."

"మరి ఆవిడ ఎందుకిచ్చారంటావ్?"

"నాకోసం యిచ్చారేమో!"

"అయితే నిన్నే దగ్గిరకు రమ్మని సౌంజ్ఞచేసివుండాలే? మీ తమ్ముడి తలని కావలించుకున్నారన్నావ్-ఆ పిల్లవాడు నిజమే చెపుతాడంటున్నావ్? అల్లాంటిది యిది నిజం కాదని ఎలా అంటావ్?"

"అవునండి. మీరన్నదీ నిజమే? వాడికే ఇచ్చివుంటారు."

"ఎందుకని?"

"బహుశా వాడి తొ్ర్రి,ఆరేసి వేళ్ళున్న ఆ చేతులు,వాడి కుంటి కాలు చూసి, జాలిపడ్డారేమో-" అంది ఎలిజబెత్

"జాలి పడితే- దగ్గరకు పిల్చి తల ముద్దుపెట్టుకుంటారా?"- ప్రశ్నించాడు డాక్టర్.

"నాకేమిటో భయంగా వుందండీ. ఈ నగ మీకు అప్ప చెప్పాను. మీరేం చేసినా సరే...."

"నీకు దీనిమీద ఆశ లేదా?"

"లేదండి. మీ దయవల్ల మాకు తిండికి లోపంలేదు.మా అమ్మ-తమ్ముడూ యిద్దరూ సుఖంగా వుంటే చాలు."

"నీకు యింకే కోరికలూ లేవా?" అడిగాడు డాక్టరుగారు.

"లేవండి. మా తమ్ముడు వొట్టి అమాయకుడండి-వాడిని వదిలి పెట్టి నేను ఎక్కడికీ వెళ్ళను. ఇదే విషయం సుందరమ్మగారు అడిగారు." అంది ఎలిజబెత్.

డాక్టర్ ప్రభాకర్‌మూర్తికి అంతా గందరగోళంగావుంది. అలాగే ఎటూ నిర్ణయించలేకుండా వున్నారు.

"ఒకవేళ పోలీసులొచ్చి-నిన్ను ప్రశ్నలు వేస్తే-భయపడకు వున్నది వున్నట్లు చెప్పు." అన్నారాయన.

"పోలీసులా?"- ఎలిజబెత్ కంఠంలో భయం-ఏడుపు.

"చంద్రహారం పోయిందని వాళ్ళు కేసు పెట్టవచ్చు. ఆఖరున వున్నది నువ్వే కాబట్టి నీమీద రిపోర్టు యిచ్చే అవకాశం వుంది-"

"మా తమ్ముడి మీదకి రాదంటే చాలు. సార్ వాడి పేరు బయటికి చెప్పకండి-నా మీద కేసు పెట్టినా ఫరవాలేదు. ఆవిడ యిచ్చారు-పుచ్చుకున్నానంటాను. అసలు మాకీ గొలుసు వద్దండి-మీరే యిచ్చేయండి."

"ఎలా యిమ్మన్నావ్-? నా చేతికి ఎలా వచ్చిందని చెప్పమన్నావ్?"

"తలకింద దొరికిందని చెప్పండి."

"అది అబద్ధం కాదా? ఈపాటికి వార్డ్ బాయిస్ పరుపు మార్చి వుంటారు. వాళ్ళకి దొరకని వస్తువు-దొరికిందని ఎలా చెప్పించమంటావ్?"

"సార్, నేనేం చెయ్యను? ఆవిడ యిలా ఎందుకు చేశారు? మా తమ్ముడిని ఏం చేస్తారు? మాకెందుకండి ఈ వస్తువులు....?" అంత దాకా వున్న ధైర్యం పటాపంచలై పోయింది. ఎలిజబెత్ గుండెలు అవిసేలా ఏడుస్తున్నది. భయంతో, బాధతో, తన తమ్ముడిమీద ప్రేమతో ఏడుస్తున్నది. డాక్టర్ ప్రభాకరమూర్తికి ఆఅమ్మాయిని ఎలా వోదార్చాలో తెలియటంలేదు.

# 3

ఎలిజబెత్ వెళ్ళిపోయిన అరగంటదాకా డాక్టర్ మూర్తి అలా కదలకుండా కూర్చుండిపోయాడు. ఆ రోజు సర్జరీ కేసులు మూడు పోస్టయి వున్నాయి. ఆ మూడూ అతని పార్టనర్, మరో సర్జన్ చూసు కుంటాడు. అంచేత డాక్టర్ మూర్తికి వెంటనే అటెండ్ అవాల్సిన కేసులు లేవు. మరీ ఎమర్జన్సీ అయితేగాని-అతనిదాకా రారు అసి స్టెంట్లు.

పాములా పడుకునివున్న-మెలికలు తిరిగి పరుచుకున్న చంద్ర హారం వంక చూశాడు-డాక్టర్ మూర్తి. ప్రాణం లేని ఈ వస్తువు ఎన్ని సమస్యలు తీసుకొచ్చింది? ఇంకా ఎన్ని కొత్త సమస్యలు తీసు కొస్తుందో!

రావుగార్ని పిల్చి, చంద్రహారం సంగతి చెపితే? టెలిఫోన్ దాకా వెళ్ళిన చెయ్యి అక్కడే ఆగిపోయింది. ఈ విషయంలో ఎవరి నేనా సలహా అడగాలి. ఇది రోగమూ, జబ్బూ కాదు-తనకి తాను నిర్ణయించుకోటానికి! ఈ వస్తువులో తన హాస్పటల్ పేరు, ప్రతిష్టలు 'యిన్‌వాల్వ్' అయివున్నాయి. ఒక ఆడపిల్ల జీవితంకూడా యిమిడి వుంది. పదిహేనేళ్ళుగా తను ఈ హాస్పటల్ నడుపుతున్నాడు. పేషంట్లనుంచి డబ్బు పోయిందనికాని, వస్తువు కనిపించలేదనిగాని- ఒక్కరోజున కూడా ఫిర్యాదు రాలేదు. ఇప్పుడు యిలా ఎందుకు జరి గింది? చనిపోయిన సుందరమ్మగారు కావాలనే ఆ పిచ్చివాడికి నగ యిచ్చిందా? ఎందుకిచ్చింది? లేక ఎలిజబెత్ అక్కడ లేకపోవటం చేత-ఆ వెర్రివాడి మెళ్ళో వేసిందా? అయితే, వాడి ముఖం ముద్దు పెట్టు కుంది అంటోంది?

డాక్టర్ మూర్తి-రాబీ ముఖం ఎలా వుంటుందో జ్ఞాపకం చేసు

కుంటున్నాడు. ఎలిజబెత్-నర్సుగా జాయిన్ అయిన కొత్తలో ఈ పిల్లవాడిని తీసుకొచ్చింది. ఎర్రగా-పై పెదవిమీద తొర్రె. ఒక కాలు పొడవు-కుడికాలు పాదం మెలిక తిరిగి, ఆ కాలు కాస్తపొట్టిగా వుండి యీడుస్తూ అష్టావక్రుడిలాగా నడుస్తూ వుండే-ఈ పిల్లవాడు ముద్దు పెట్టుకునేంత అందగాడు కాదే! పైగా యిరవై ఏళ్ళు పైబడ్డ ఈపెర్రి వెధవని ముద్దుపెట్టుకోవడం ఏమిటి?

మానవ దేహంలోని ప్రతి భాగాన్ని నిశితంగా పరిశీలించి, రోగం కనిపెట్టగల డాక్టర్ మూర్తి సూక్ష్మగ్రాహ్య శక్తి సుందరమ్మ గారు మరణించేముందు చేసిన పనిని-ఎలా అర్థం చేసుకోవాలో-ఏమని నిర్ణయించుకోవాలో, తెమల్చ లేకుండా వుంది. ఏ క్షణంలోనైనా రావు గారింటినుంచి-గొలుసు కనపడలేదని ఫోన్ రావచ్చు. తనేంచెయ్యాలి? ఎలిజబెత్ దొంగతనం చేసిందని చెప్పి వెనక్కి యిచ్చెయ్యాలా? ఇచ్చేస్తే ఆ పిల్ల జీవితం, ఇక్కడ వుద్యోగం పోతుంది మరోచోట దొరకదు. తల్లీ-తమ్ముడు నల్లగా వూచలాగావున్న ఎలిజబెత్, ఆమె కళ్ళలోని తమ్ముడిమీద ప్రేమ-పదే పదే బాధపెడుతున్నాయి. అసలు ఎలిజబెత్‌కి దొంగతనం చెయ్యాలనే వుద్దేశ్యం వుంటే-యీ గొలుసు తన చేతికెందుకిస్తుంది? ఇవ్వదు. అంటే సుందరమ్మగారు కావాలనే, ఈ గొలుసు యిచ్చిందన్నమాట. ఎందుకిచ్చింది? మళ్ళీ ప్రశ్న. డాక్టర్ మూర్తి బుర్ర ప్రశ్నలతో గిరగిర తిరిగి పోతున్నది. టేబుల్ మీద వున్న ఈ బంగారు గొలుసుని ఎలా వదిలించుకోటం? దీని ద్వారా వుత్పన్న మవబోతున్న సమస్యల్ని ఎలా ఎదుర్కోవటం? బుర్ర బద్దలు కొట్టుకున్నా-యిందులోంచి దారి కనబడటంలేదు ఆ గొలుసు బాత్‌రూమ్‌లో పడిపోయిందని-తీసుకెళ్ళి యిస్తే! అది కుంటి కారణం అవుతుంది. ఎందుకంటే వార్డు బాయిస్-బాత్‌రూమ్, లెట్రిన్ గది మూల మూలలా డెట్టాల్తో కడిగి వుంటారీపాటికి. అది నిజం కాదని వాళ్ళకి తెల్సిపోతుంది. పదిహేనేళ్ళుగా మచ్చలేకుండా-పేరు ప్రఖ్యాతులు పొందిన తన నర్సింగ్ హోమ్ ఈనాడు పోలీసు కేసుల్లో-చచ్చు దొంగతనంలో యిరుక్కుంటుందా? గప్‌చిప్‌గా-

ఎవరూ చూడకుండా రావుగార్కి ఈ చంద్రహారం యిచ్చేస్తే ఆపని కొంతలో కొంత సాధ్యంగా అనిపించింది డాక్టర్ మూర్తికి. కుర్చీ మీంచి లేవబోయాడు. గొలుసు జేబులో వేసుకుందామని-అనుకుంటూ! ఈ లోపల ఫోన్ మ్రోగింది.

టెలిఫోన్ ఆపరేటర్ స్విచ్ బోర్డునుంచి రావుగారింట్లోంచికాల్ కనెక్ట్ చెయ్యనా?-అని అడుగుతూఉంది. డాక్టర్ మూర్తి గుండె దబ్ మంది ఒక్కసారి. ఏం చెయ్యాలి? ఎలా జవాబు చెప్పాలి? గొలుసు గురించివాళ్లు అడుగుతారు. అది తన బల్లమీదవుంది. ఆ చంద్రహారం తన దగ్గిరకి ఎలా వచ్చిందో-ఏ విధంగా సంజాయిషీ చెప్పాలి? అది వారు నమ్మేరీతిలో చెప్పగలడా!

"పేషంటుని-పరీక్ష చేస్తున్నాను. అరగంట ఆగి ఫోన్ చెయ్య మను." అన్నాడు, తాత్కాలికంగా తప్పించుకునేందుకు.

సమస్య మళ్ళీ ఆరంభమైన చోటకే వచ్చింది. ఎవరినైనా సలహా అడగాలి. ఎవరు? ఎవరు? బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాడు-సరి అయిన వ్యక్తికోసం. అప్పుడు డాక్టర్ మూర్తి బుర్రలో, ఆపత్ బాంధవుడిలా సాయిప్రసాద్ ప్రత్యక్షమయాడు.

సాయిప్రసాద్‌కి మస్తుగా డబ్బుంది. అతను బి. ఎ.బియల్ పాసయ్యాడుగాని-బోర్డు కట్టలేదు. బాగా పేకాడుతాడు. డబ్బులు పెట్టి మరీ ఆడి-గెల్చుకుంటాడు. చదరంగంలో పెద్ద బుర్ర. ప్రతిరోజూ రమ్మీ టేబుల్ దగ్గిర-విధిగా క్లబ్‌లో దర్శనం యిచ్చే వ్యక్తుల్లో సాయిప్రసాద్ ముఖ్యుడు. బాగా యింగ్లీషు పుస్తకాలు చదువుతాడు. ముఖ్యంగా మానవ స్వభావానికి సంబంధించిన-పుస్తకాలు సోమర్ సెట్ మామ్ పుస్తకాలు అతని ఫేవరెట్ బుక్స్. అతనికి అగాధాక్రిస్టి నవల్సంటే ఇష్టం-"వెర్రీమాజిక్‌లో-క్రైము సెన్స్ తప్ప మెలికలుం డవు-మానవ హృదయంలోని అగాధాలని అతను చూడలేదు" అంటూ ఎర్లీస్టాన్లీ గార్డెనర్ గురించి-లెక్చర్లు యిస్తూంటాడు. డాక్టర్ మూర్తికి

పుస్తకాలూ-నవల్సూ చదివే తీరికలేదు....సోమర్ సెట్ మామ్, ఎ.జె. క్రానిన్ అంటే అతనికి కాస్త బలహీనత వుంది. ఆ యిద్దరూ-ముందు డాక్టర్లయి, ఆ పైన రచనా రంగంలో ప్రఖ్యాతి పొందారు కాబట్టి ఆ యిద్దరికీ తనకీ, అవినాభావసంబంధం వుంది-అనుకుంటూ ప్రసాద్ పరిచయంతో-మామ్ పుస్తకాలన్నీ యించు మించు చదివాడు తన ప్రస్తుత సమస్య గురించి ఈ సాయిప్రసాద్ ఏం చెబుతాడు? అతనిని సలహా అడిగితే బాగుంటుందని, వెంటనే బయలుదేరాడు డాక్టర్ మూర్తి.

అప్పుడు పదకొండు దాటింది. బయట బాగా వేడిగానే వుంది. సుందరమ్మగారు ఈ లోకం వదిలి వెళ్ళిపోతూ, సమస్య కల్పించి మూడున్నర గంటలయింది. ఒక వ్యక్తి ఈ లోకంనించి వెళ్ళిపోతూ యింత కలవరం కలిగించగలదా?-తనలో తను అనుకున్నాడు డాక్టర్ మూర్తి.

అతను వెళ్ళేప్పటికి అప్పుడే నిద్ర లేచినట్లున్నాడు సాయి ప్రసాద్. క్రితం రాత్రి చాలాసేపు పేక ఆడి, మధ్య మధ్య విస్కీ పట్టించాడుట.అంచేత తల బరువుగావుండి_ఆలస్యంగా నిద్ర లేచానని సంజాయిషీ యిచ్చుకుంటూ!

"అదేమిటి-డాక్టర్లింటికి మేము వెళ్ళాలిసింది-మీరు నా కోసం వచ్చారు. ఏమిటికథ?" అడిగాడు సాయిప్రసాద్ తమాషాగా.

డాక్టర్ మూర్తికి యిలా ఛలోక్తిగా-నవ్వుతూ మాట్లాడటం చేత కాదు. అతను స్వతహాగా మితభాషి.... పేషంట్ల దగ్గర తప్పనవ్వుతూ యితరుల్తో మాట్లాడడు. గంభీరంగా వుంటం అతని వృత్తిలో, జీవితంలో ఒక భాగం అయింది.

"మీతో పనుండి వచ్చాను. మీ సలహా కోసం:-"

"నాతోనా? ఏమిటి పేకాటలో సలహా కావాలా? లేక...."ఆగి పోయాడు సాయిప్రసాద్.

సాయిప్రసాద్ బొద్దుగా పొట్టిగా వుంటాడు. మనిషి పసిమి ఛాయ అనే చెప్పొచ్చు-కళ్ళు పూద్దుల్లా ఉంటాయి. నవ్వుతూవున్నా అవి ఎదుటివారిని నిశితంగా పరిశీలిస్తూ ఉంటాయి. చికాగ్గావున్న క్రాపు, గళ్ళలుంగీ, నలిగిపోయిన గ్లాస్కో-లాల్చీ-అతను యింకా స్నానం చెయ్యలేదని-చెపుతూ ఉన్నాయి.

"మీకు టైము ఉందా? లేదా అని అడిగే వ్యవధి లేదు. ఒక్క అరగంటసేపు నేను చెప్పేది శ్రద్ధగా విని-నాకు సలహా యివ్వాలి-సోమర్‌సెట్ మామ్ కథలని మీరు కాచి వడపోశారు గదా! ఇక్కడ మానవ స్వభావానికి సంబంధించిన-సంఘటన చెప్పబోతున్నాను-"

"అందులో మీకు సంబంధం ఉందా?" అడిగాడు ప్రసాద్ గంభీరంగా.

"ఉంది-లేదు-"

"అదెట్లా?"

"నా నర్సింగ్‌హోమ్, నా ప్రెస్టేజి - ప్రొఫెషనల్ యింటిగ్రిటీ అన్నీ 'యిన్‌వాల్వ్' అయివున్నాయి."

అప్పటిదాకా కేర్‌లెస్‌గా - సోఫాలో వెనక్కి జారగిలపడి కూచున్న ప్రసాద్-ఒక్కసారి ముందుకు వంగాడు.

"ఎబార్షన్ కేసా?"

"కాదు-మీరు గెస్‌చేసి, టైము వృధా చెయ్యకండి. నేను జరిగింది, జరిగినట్లు చెపుతాను-వినండి, ఇక్కడికి ఎవరూ రారుగా-"

"రారు."

అరగంటలో డాక్టర్ మూర్తి ాన గుచ్చినట్లు ఆ ఉదయం జరిగిన సంఘటనలన్నీ-విశదంగా, వివరంగా చెప్పాడు. సాయిప్రసాద్-రెప్పవాల్చకుండా అన్నీ విని, ఒక్కమాట అడిగాడు.

"ఆ అమ్మాయి-అంటే మీనర్స్-నిజం చెపుతోందని మీకు నమ్మకం ఉందా?"

"ఉంది-"

"ఎందుకని?"

"చంద్రహారం ఎత్తుకెళ్ళదలచుకుంటే - సరాసరి యింటికెళ్ళి పోయి దాచవచ్చుగా?"

"ఆ క్షణంలో ప్రలోభపడి-మరుక్షణంలో భయపడిందేమో!"

"అయిఉండచ్చు. కాని ఆ అమ్మాయి తమ్ముడికి ఆవిడ ఇచ్చా రని-చాలా క్లియర్‌గా చెపుతోంది-"

"కథ అల్లవచ్చుగా?"

"అది అల్లే పరిస్థితి కాదు. సుందరమ్మగారు దీర్ఘవ్యాధితో తీసు కోటం లేదు. కార్డియాక్ అరెస్ట్. క్షణాలమీద ప్రాణం పోతుంది- అంచేత కథ అల్లే వ్యవధి ఉండదు-"

"అదీ నిజమే! మీ నర్స్ చెప్పింది అక్షరాలా నిజం అయి నప్పుడు, చనిపోయిన సుందరమ్మగారు కావాలనే ఆ పిల్లవాడికి చంద్ర హారం యిచ్చిఉండాలి-"

"అయేఉండాలి."

"అయితే ఆ పిల్లవాడిని ఆమె గుర్తించి ఉండాలి. లేక ఆ పిల్ల వాడికి ఆవిడకూ సంబంధం ఉండి ఉండాలి. మీరు ఎలిజబెత్‌ని అడి గారా?"

"ఏమిటి?"

"ఆ పిల్లవాడు స్వంత తమ్ముడవునో కాదో? అని"

డాక్టర్ మూర్తి సాయిప్రసాద్ వంక గౌరవంతో-అభిమానంతో చూసి, "నాకా విషయం స్ఫురించలేదు సుమండి" అన్నాడు.

"సుందరమ్మగారు అంటే-ఎక్సిక్యూటివ్ యింజనీరు రావుగారి భార్య కదూ? నిద్ర లేవగానే మా ఆవిడ అంది-మీరు చెప్పినావిడా-యీవిడా ఒకరే-అనుకుంటా."

"అవును. రావుగారిని చూస్తే చాలా బాధగా ఉంది. అసలు ఆల్మోస్టు-మామూలు మనిషి అయింది. బి.పి. కంట్రోల్ చేశాము. ఇ.సి జి. నార్మల్‌గా ఉంది. మళ్ళీ "యటాక్" వస్తే తప్ప-ధోకా లేదనుకున్నాను."

"ఎప్పుడు పోయారు?"

"ఈ రోజు డిశ్చార్జి చెయ్యబోతున్నాము. పొద్దుటే-యీ వార్త వినేటప్పటికి నాకే దిమ్మ తిరిగిపోయింది. కార్డియాక్ అరెస్ట్...."

"ఆ పిల్లవాడిని చూడటంతో-గుండె ఆగిపోయిందేమో!"

డాక్టర్ మూర్తి క్షణకాలం బదులు చెప్పలేదు. "మెడికల్‌గా చూస్తే కార్డియాక్ అరెస్ట్ ఇందువల్ల వస్తుంది అని చెప్పటానికి అవదు. అకస్మాత్తుగా ఒక మనిషిని చూసి-గుండె ఆగిపోవటం అన్నది....అతిశయోక్తి. అందులో నిజం ఉందని నేను వొప్పుకోను."

"అంటే, సుందరమ్మగారి ఆకస్మిక మరణానికి, ఆమె గుండె ఆగిపోవటానికి, మానసికమైన సంభ్రమంగాని, వొత్తిడిగాని కారణం కాదు అంటారు?"

"అది అక్షరాల నిజం. ఇవన్నీ కథల్లో, సినిమాల్లో నిజం కావచ్చు.ఆ క్షణంలో ఆమెకి బి.పి. పెరిగి ఉండొచ్చు, మనిషి ఉద్రేక పడి ఉండవచ్చు. అంత మాత్రాన గుండె ఆగదు" అన్నాడు డాక్టర్ మూర్తి.

"అయామ్ గ్లాడ్-" అన్నాడు ప్రసాద్ నెమ్మదిగా. "సుందరమ్మ గారికీ యీ రాబీతో పరిచయం ఉంది అనుకుందాం. అది ఎలా? ఈ

రాబి ఎలిజబెత్‌కి సొంత తమ్ముడు అవునా కాదా? ఈ విషయాలు తెలుసుకుంటే, ఈ చిక్కుముడి విప్పవచ్చు."

"ఈ లోపల రావుగారూ వాళ్లు పోలీసు కంప్లయింట్ యివ్వరని గ్యారంటీ ఏమిటి? నా నర్సింగ్‌హోమ్‌లో ఒక పేషంటు చంద్రహారం పోయిందంటే, నాకెంత అవమానమో-అప్రతిష్టో ఆలోచించారా?"

"ఏం చెయ్యాలనుకుంటున్నారు?"

"అందుకే మీ సలహా కొచ్చాను-" అన్నాడు డాక్టర్.

"ఎలిజబెత్ నిజం చెప్తున్నది అంటున్నారు. ఆ నమ్మకం మీకు దృఢంగా ఉంది. అవునా?" అవునన్నట్లు తలవూపాడు డాక్టర్ మూర్తి-"అటువంటప్పుడు ఆ చంద్రహారం వాళ్ళకి వెనక్కి యివ్వటం న్యాయం కాదు. చనిపోయిన స్త్రీ కోర్కెని మనం మన్నించాలి."

"అంతదాకా?"

"ఎలిజబెత్‌నీ వాళ్ళనీ ఈ ఊరు నుంచి పంపించేసెయ్యండి-"

"దేనికి?"

"మీకు చంద్రహారం విషయం తెలీదు. మీ నర్సు పరారి అయిపోయింది. వాళ్ళతోపాటు మీరూ ఆ అమ్మాయికోసం గాలిస్తున్నారు. ఈ లోపల రావుగారింట్లో ఆడవాళ్ళ మాటలు పట్టి, మనకి కొన్ని విషయాలు తేల్తాయి."

"ఎట్లా?"

"మీరే చూస్తారుగా. నాకు డిటెక్టివ్ కథలు చదవటం సరదా. ఇప్పుడు జీవితంలో నిజంగానే ఒక పరిశోధనకి, సత్యశోధనకి అవకాశం దొరికింది. ముందు మనం ఎలిజబెత్ వాళ్ళని ఇక్కడినుంచి-"సేఫ్ ప్లేస్"కి తప్పించాలి."

"ఎట్లా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"ఉండండి. మా బావమరిది-కాఫీ ప్లాంటేషన్సులో మేనేజరుగా వున్నాడు. ఈ రాత్రి బండికి ఆ ముగ్గుర్నీ రైలు ఎక్కించి, అతనికి ట్రంక్‌కాల్ చేస్తాను. అక్కడ వీళ్ళు ఉంటానికి సమస్య ఉండదు. స్టాఫ్ కని చాలా క్వార్టర్సు ఖాళీ ఉంటాయి. ఒకదాంట్లో వీళ్ళు ఉండ వచ్చు."

"మనం చెపుతే వింటారంటారా?"

"లేకపోతే పోలీసులు బేడీలువేసి పట్టుకెడతారని చెప్పండి—" అన్నాడు ప్రసాద్.

డాక్టర్ మూర్తి విభ్రాంతపోయి చూస్తున్నాడు ప్రసాద్ వంక. ఈ మాదిరి-గదమాయింపు-బెదిరింపూ అతనికి కొత్తగా ఉన్నాయి.

"మీరు భోంచేశారా?" అడిగాడు ప్రసాద్.

"లేదు."

"అయితే నాతో కలిసి భోంచెయ్యండి. ఒక్క పది నిముషాల్లో నా పనులు ముగించుకొస్తాను." అంటూ ఒకరోజు వయసున్న గడ్డాన్ని చేత్తో నిముడుకున్నాడు ప్రసాద్. డాక్టర్ మూర్తి చిరునవ్వు నవ్వాడు. అతనికి అంతా ఖంగారుగా- గందరగోళంగా వుంది. ఎలాగైనా తన ఆస్పత్రి ప్రతిష్ట-అమాయకురాలైన ఆ ఎలిజబెత్ గౌరవం కాపాడు కుంటే చాలు. ప్రసాద్ తనకంటే తెలివైన వాడిలా ఉన్నాడు. రాబీ, ఎలిజబెత్‌కి స్వంత తమ్ముడు, అయి ఉంటాడా-కాదా-అన్న ఆలోచన తన కెందుకు రాలేదు....?"

ఒకవేళ రాబీ ఎలిజబెత్ తమ్ముడు కాకపోయివుంటే? ఈ రాబీకి, సుందరమ్మగారికి-ఎటువంటి సంబంధం ఉండి ఉంటుంది? ఒకవేళ ఈ రాబీ, రావుగారి కొడుకై ఉంటాడా? ఆ విషయం సుంద

రమ్మగారికి తెలిసి-ఆ పిల్లవాడు కనిపించేటప్పటికి-ఖంగారుపడి, గొలుసు ఇచ్చి ఉంటుందా? భర్తకి మరోస్త్రీకి కలిగిన బిడ్డని ఏస్త్రీ కూడా ప్రేమించదు. ఇది అసహజం. ఈ పిల్లవాడు సుందరమ్మగారి కొడుకై ఉంటాడా? ఛా-ఛా అలాంటిది సంభవం కాదు. ఈ హిందూ సంప్రదాయంలో, భర్త నీడలోవున్న ఒక స్త్రీ. గర్భవతి అయి, అదికూడా రహస్యంగా ఉంచటం సాధ్యం కాదు. ఈ రాబీ ఆవిడకు తమ్ముడో .... మేనల్లుడో అవకూడదా? అయితే! మెళ్ళో గొలుసు ఇస్తారా? ఉహు, యివ్వరు.

ప్రసాద్ స్నానంచేసి వచ్చేదాకా డాక్టర్‌మూర్తి, క్రాస్‌వర్డ్ పజిల్‌లాగా-సుందరమ్మగారిక్కి యీరాబీ ఎట్లా బంధువుకాగలడో రకరకాల కోణాలనుంచి ఆలోచిస్తూకూచుని వున్నాడు. డాక్టర్ మూర్తికి యింటికెళ్ళాలని, నర్శింగ్‌హోమ్‌లో ఏ మవుతుందో కనుక్కోవాలని అనిపించలేదు. ఆ రెండు చోట్లకి రావుగారి యింటినుంచి ఫోన్ వచ్చే వుంటుందని అతను గట్టిగా నమ్ముతున్నాడు. ఆ ఫోన్‌లో ఎటువంటి వార్త వచ్చిందో? అవతల వారు ఎటువంటి మాటలు అంటారో వూహించలేకుండా వున్నాడు. వాటికి తట్టుకుని జవాబు చెప్పగల శక్తి అతనికిలేదు.

ఒంటి గంటన్నర ప్రాంతాల డాక్టర్‌మూర్తి కార్లో ప్రసాద్ కూడా ఎక్కాడు. కారు ఎక్కుతున్నపుడే చెప్పాడు ప్రసాద్.

"మీరు ప్రేక్షకుడిలా వినండి. నేను అడిగే ప్రతి ప్రశ్నకూ మీ నర్సు ఎలా జవాబు చెపుతుందో పరిశీలించండి" అని.

డాక్టర్‌మూర్తి నర్శింగ్‌హోమ్‌కి ఫోన్ చేశాడు రావుగారింటి నుంచి మళ్ళీ ఫోన్ రాలేదు. ఇది అతనికి ఆశ్చర్యం కలిగించింది. ఆఫీస్‌స్టాఫ్ ఎలిజబెత్ ఇంటి అడ్రసు యిచ్చారు.

అతి సామాన్యంగా- బీద సంసారులు వుండే వీధి అది. సన్

అని అనలేముగాని, వీధిలో యిళ్ళన్నీ యించుమించు పడిపోతున్న స్థితిలో వున్నాయి- అన్నీ పెంకుటిళ్ళే. రెండేసి గదులు- కొట్లులాగా వున్నాయి. ఆ యింటిముందు కారు ఆపాడు డాక్టర్ మూర్తి. వీధి తలుపు లోపల వేసి వుంది- సందేహంగా తలుపు తట్టాడు.

తలుపులు తెరుచుకున్నాయి. గుమ్మంలో ఎలిజబెత్ సాదా వాయిల్ చీరకట్టుకుని వుంది. గుమ్మంలోకారు. తన ఛీఫ్‌ని చూసేప్పటికి భయంతో ఎండుటాకులాగా వణికిపోతున్నది.

"భయంలేదు-నేనే! నీ కోసం వాళ్ళెవరైనా వచ్చారా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"లేదండి!" లోపలికి పిలవాలన్న ధ్యాసకూడా లేకుండా బదులు చెప్పింది.

"లోపల మీ అమ్మవుందా?"

"వుందండి- మా రాబీ కూడా యింట్లోనే వున్నాడు- బయటకి వెళ్ళనివ్వలేదు. లోపలికిరండి." అప్పటికి వంటిమీద తెలివి వచ్చినట్లు వెనక్కి అడుగేసింది ఎలిజబెత్.

"ఈయన నా ఫ్రెండు-ప్రసాద్.... నిన్నుకొన్ని ప్రశ్నలడుగుతారు...."

"పోలీసా?"

"లేదు- నీకు సాయం చేద్దామని వచ్చారు. ఆయనకి నీ నిజాయితీ మీద నమ్మకంవుంది." అన్నాడు మూర్తి.

ఎలిజబెత్ కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి. లోపల చిన్న నవారు మంచం- ఆ యింట్లో బీదరికం మూలమూలల నుంచి తొంగి చూస్తున్నది. కుక్కిగావున్న మంచంమీద పాతబొంత. ఎలిజబెత్ ఆ బొంత తీసేసి కూచోమంది యిద్దరినీను.

"మీ అమ్మగారు లోపలున్నారా?" అడిగాడు ప్రసాద్, రంగం లోకి దిగుతూ.

"అమ్మా" అని పిల్చింది ఎలిజబెత్.

వంటింట్లోంచి నల్లగా గడకర్రలా వున్న ఆకారం గుమ్మం దగ్గర కొచ్చింది. ఆ మనిషి శరీరంలో ఎక్కడా కండలేదు. ఎముకల చుట్టూ చర్మం మటుకువుంది. తెల్లరెవిక-తెల్లచీరె ఆమె వెనుకనుంచి-బుజంకిందనుంచి- ఒక ఎర్రని మొహం! బెదిరేకళ్ళు తొంగి చూస్తు న్నాయి. బహుశా, రాబీ అయివుంటాడు అనుకున్నాడు ప్రసాద్.

"మీరు ఎలిజబెత్‌కి అమ్మగారా?" అడిగాడు ప్రసాద్.

"అవునండి."

"మీకెందరు పిల్లలు?" అడిగాడు ప్రసాద్. ఈ ప్రశ్న సిల్లీగా అనిపించింది మూర్తికి.

గుమ్మంలో నుంచున్న స్త్రీ వులిక్కిపడినట్లు కళ్ళెత్తి చూసింది. ఎందుకు అలా అడుగుతున్నారని మూగగా ప్రశ్నిస్తున్నాయి ఆ కళ్ళు.

"రాబీ మీ స్వంతకొడుకా? భయంలేదు. వున్నది వున్నట్లు చెప్పండి." అడిగాడు ప్రసాద్.

ఆమె మాట్లాడలేదు. తెల్లగా పండి పోయివున్న తలకట్టుని ఒక చేత్తో సవరించుకుంటున్నది. ఎలిజబెత్ ఆశ్చర్యంగా తల్లివంక చూస్తు న్నది. రాబీకి యీ ప్రశ్నలేం పట్టినట్లులేవు- కొత్తవ్యక్తుల వంక ఆశ్చర్యంగా, భయంతో చూస్తున్నాడు.

"రాబీ-మీ కన్న కొడుకు కాదుగదూ?" అడిగాడు ప్రసాద్.... అతని కంఠం జాలిగా మృదువుగా వుంది.

"కాదు" అంది, ఎక్కడో దూరాన్నించి- పాతాళం నుంచి చెపుతున్నట్లు.

"ఎవరి పిల్లాడు?"

"తెలియదు?"

"మీకు పెంచుకునేందుకు ఎవరిచ్చారు?" అడిగాడు ప్రసాద్.

"నేను పెంచుకోలేదండి- వాడిని కొనుక్కున్నాను." వత్తి వత్తి పలుకుతూవుంది కూడదీసుకుని చెపుతోంది. ఈసారి ఆశ్చర్య పోవటం మిగతావారి వంతయింది.

"కొనుక్కోటమా? ఈ కాలంలో కూడా పిల్లల్ని అమ్మే వాళ్ళున్నారా?" ప్రసాద్ కిచ్చినమాట మర్చిపోయి గభాలున అన్నాడు డాక్టర్ మూర్తి

"ఎంతకి కొన్నారు? ఎవరి దగ్గర నుంచి కొన్నారు? తల్లి తండ్రులు అమ్మారా?" గబగబ అడుగుతున్నాడు ప్రసాద్.

ఆ వృద్ధురాలు మాట్లాడలేదు. ఒక్కసారి రాబీని గుండెలకి హత్తుకుని- హృదయ విదారకంగా ఏడుస్తోంది. రాబీ తలని గట్టిగా పట్టుకు ఏడుస్తోంది.

"అమ్మా- నువ్వు నిజం చెపుతున్నావా? రాబీ నీ కొడుకు కాదా నిజంగా కాదా?" ఎలిజబెత్ యీ నిజాన్ని భరించలేనట్లుగా అడుగు తోంది.

రాబీ "అక్కా" అన్నాడు-కాలు యీడుస్తూ అక్కదగ్గరకొచ్చి. ఎలిజబెత్ 'రాబీ'అంటూ వాడితలని రెండు చేతుల్లోకి తీసుకుని మొఖం మంతా ముద్దుల్తో నింపుతోంది-పసిపిల్లవాడిని సముదాయించి... అప్పుడు చూశాడు ప్రసాద్- యీ సమస్యలకన్నీ [illegible] రాబీని. వాడు ఎర్రగా- ఎర్రతేలులాగావున్నాడు. పైపెదవికి తొర్రె అమాయకంగా చూసేకళ్ళు. మెలికపడి-పొట్టిగావున్న కుడికాలు-రెండు చేతులకి ఆరేసి వేళ్ళు.

"రా? మీరు నిజంగానే కొనుక్కున్నారా?" రెట్టించాడు ప్రసాద్.

"ఈ శిలువ సాక్షిగా చెపుతున్నానండి. రెండొందల రూపాయి లిచ్చి కొనుక్కున్నానండి. యిచ్చినట్లే యిచ్చి-మా పిల్లవాడని వాళ్ళు లాక్కుపోకుండా కాయితంకూడా రాయించి తీసుకున్నానండి. నా మాట మీద నమ్మకం లేకపోతే కాయితాలు తెస్తావుండండి-" గబగబా ముందు గదిలోకి వచ్చి, మూలగా వున్న ఒక ట్రంకు పెట్టెదించింది. మెళ్ళో వున్న చెవితో పెట్టెతాళంతీసి, అడుగునుంచి దస్తావేదులాంటికాయితం తీసి-డాక్టర్ మూర్తి చేతికి అందించింది. ఆ కాయితం ప్రసాద్ తీసుకుని చదివాడు.

రూపాయిన్నర స్టాంపుకాయితం మీద, మరియమ్మ అనే- ఆస్పత్రి ఆయా, అక్కడ పురుడు పోసుకున్న ఒక తల్లి కన్నబిడ్డను తనకి పెంచుకునేందుకు యిచ్చినట్లూ, ఆ బిడ్డని మరియమ్మ సర్వ హక్కుల్తో ఎలిజబెత్ తల్లి అయిన ఎస్తేరమ్మకి ఇచ్చేస్తున్నట్లూ ఎస్తేరమ్మ-మరియమ్మకి రెండొందలు ఖర్చుల కిస్తున్నట్లు రాసిన పత్రం, దాని మీద కరణం మరో వ్యక్తి నోటరీ సంతకం రెండూ వున్నాయి. అధికార చిహ్నమైన నోటరీ సీలుకూడా వుంది కింద. అది చదివేప్పటికి సాయిప్రసాద్‌కి మతిపోయినట్లయింది చట్టం ఎంత గుడ్డిదో కూడా అర్థం అయింది. తనదిగాని పిల్లవాడిని ఒకస్త్రీ, మరోస్త్రీకి అమ్మితే, ఆ అమ్మకాన్ని న్యాయం పరిరక్షించ వలసిన- న్యాయవాదే ఆమోదించాడు. పైగా రూపాయిన్నర పేపరు మీద రాసుకున్న క్రయపత్రం.

"ఏం చేద్దాండి" అడిగాడు డాక్టర్ మూర్తి.

"ఒకటి మటుకు నిజం. సుందరమ్మగారు ఏదో బలవత్తరమైన కారణం వల్లనే గొలుసు రాబీ కిచ్చారు. అందులో సందేహంలేదు."

అంటూ ప్రసాద్ చేతిలో కాయితం వంక మరోసారి చూశాడు. అది పంధొమ్మిది వందల అరవై నాలుగులో రాసుకున్న పత్రం.

"మీరు రాబీని కొనుక్కునే నాటికి-పిల్లవాడికి ఎన్నేళ్ళమ్మా?" అడిగాడు ప్రసాద్.

"మూడు నెలల- పసి గుడ్డండీ."

"అప్పటికి కాలు....?" ఆగిపోయాడు ప్రసాద్ మరి అడగ లేక.

"పిల్లవాడు ఎర్రగా దొరబాబులా వున్నాడండి. పై పెదిమమీద మచ్చ అనుకున్నానండి కాలు వంకర అని అప్పుడే తెలుసు. అయితే ఏం అండీ-ఎర్రగా పండులా వున్నాడండి చేతులకి ఆరువేళ్ళుంటే అదృష్టం అన్నారండి యిప్పుడు మటుకేం అమాయకుడు కానీండి— ఒకరి జోలికి పోడు. అక్క, అమ్మా అంటే ప్రాణం పెడతాడు బాబూ నా పిల్లాడిని నాకు కాకుండా చేస్తారా? చచ్చినా వాడిని ఎవ్వరికీ యివ్వం."అంది ఎస్తేరమ్మ దృఢంగా.

రాబీ అక్క వెనకే దాక్కున్నాడు. నన్ను కాపాడమన్నట్లు! ఎలిజబెత్ వాడినడుం చుట్టూ చెయ్యేసి- తన బుజం మీద వాడి తల పెట్టుకుని బుజ్జగిస్తోంది భయం లేదన్నట్లు.

ప్రసాద్ తన జేబులోంచి డైరీ తీసుకుని, ఆకాయితంలో రాసుకున్న-తారీకు నోట్ చేసుకున్నాడు. అమ్మినావిడ పేరూ వూరూ రాసుకున్నాడు-కాయితం వెనక్కి యిస్తూ.

"ఏ వూర్లో కొన్నారమ్మా?" అడిగాడు అమాయకంగా.

"ఆ కాయితంలో వుంది కదండి. అక్కడ మిషనాస్పత్రిలో నేనూ మరియమ్మా ఆయాలుగా వుండేవాళ్ళం. అప్పుడు దీనికి నాలు గేళ్ళండి-వాళ్ళ నాయన పోయారు. నాకు మొగపిల్లవాడులేడు. నా కడు

పున కాయకపోయినా, వీడు నా పిల్లవాడండి-నాబిడ్డ...." కొడుకుని దగ్గరకు తీసుకుంది.

బీదరికంలో-లేమిలో ప్రేమలు వుండవంటారు. ఈ యిల్లు, ఈ మనుషుల్నీ చూస్తే ఆ మాట ఎంత అబద్ధమో పడుతుంది-బోధ అనుకున్నాడు డాక్టర్ మూర్తి.

"ఎలిజబెత్, నేను అన్ని ఏర్పాట్లూ చేశాను. ఈ రాత్రికి బయలుదేరి మీరు ముగ్గురూ-నా ఫ్రెండు దగ్గరకెళ్ళి వుండండి."

"ఎన్నిరోజులు, సార్?" అడిగింది భయంగా.

"ఈ గొడవలు సద్దుమణిగేదాకా, మీరు యిక్కడ వుంటం మంచిదికాదు. పోలీసులూ గొడవలూ లేకుండా మీరు కొన్నాళ్ళు వెళ్ళండి. అక్కడ వుంటానికి యిల్లూ అన్నీ వుంటాయి. మీకేం భయంలేదు. మీరెక్కడున్నదీ ఎవరికీ తెలియపరచము" అన్నాడు ప్రసాద్.

"దేనికి?"

"వాళ్ళు పోలీసుల్ని పంపి నీ తమ్ముడిని అరెస్టు చెయ్యకుండా వుంటానికి." అన్నాడు సూటిగా ప్రసాద్.

"ఇప్పుడేం చెయ్యాలి?" గమ్యం తెలియని బాటసారిలా అడిగాడు డాక్టర్ మూర్తి.

"హోటల్‌కెళ్ళి టీ తాగాలి." అన్నాడు ప్రసాద్. తన సహజమైన అల్లరితో. ప్రసాద్‌కి ఈ కేసు చాలా వుత్సాహంగా వుంది. కుతూహలంగానూ వుంది. సుందరమ్మగారు-ఏ కారణాలవల్ల గొలుసు-రాబీకి యిచ్చారో ఆ వెనకగల కారణం ఏమిటో తెలుసుకుంటేగాని నిద్రపట్టేటు లేదు. ప్రసాద్ అంత తేలిగ్గా 'హోటల్‌కి వెళ్ళి టీ తాగాలి-' అనేటప్పటికి డాక్టర్ మూర్తికి కష్టంగా వుంది. ఈ రాబీ-ఎస్తేరమ్మ కన్న కొడుకుకాదు-బాగానే వుంది. అందువల్ల ఈ చంద్ర

హారపు సమస్య తేలదు. ఇది దొంగతనం కాదు—ఆమె యిస్తే పుచ్చుకున్నది. కాని ఎందుకిచ్చినట్లు? ఇది ఎవరికి చెప్పాలి? ఏమనిచెప్పాలి రావుగారు ఏ క్షణంలోనైనా సెర్చి వారంటు తీసుకురావచ్చు. పది హేనేళ్ళుగా కష్టబడి సంపాయించిన ప్రతిష్ట-గౌరవం ఏంగాను? ఆస్పత్రిలో దొంగతనం-డ్యూటీ నర్సు చనిపోయిన వ్యక్తి శరీరం మీంచి నగలు వలుచుకుంది-అంటే-అంతకంటే చెడ్డపేరు యింకోటి వుంటుందా?

"ఈ ఎలిజబెత్ మీకు ఎన్నాళ్లుగా తెలుసు?" సిగరెట్ అంటిస్తూ అడిగాడు ప్రసాద్.

"అయిదేళ్ళబట్టి తెలుసు. స్కూల్ ఆఫ్ నర్సింగ్ చేసింది-చాలా డివోటెడ్! మా స్టాఫ్‌లో అంత అప్‌రైట్, సిన్సియర్...."

"అందుకే పేషంట్లు నగలుకూడా తియ్యరన్నమాట. గవర్నమెంటు హాస్పటల్స్‌లో నగలు వుంచుకోనివ్వరు గదా!" అడిగాడు ప్రసాద్.

"ఉంచుకోనివ్వరు. పేషంట్ల 'వోన్ రిస్క్' మీద వూరుకుంటారు, మా నర్సింగ్ హోమ్‌లో అలాకాదు. ఆఖరికి ఆపరేషన్ అప్పుడు కూడా పక్క టేబుల్ మీద వుంచుతారు తప్ప నగలు తియ్యరు."

"అంత నమ్మకం ఉంటం మంచిదే అనుకోండి. ఇప్పుడేమయిందో చూడండి."

"ఏమైంది? మానర్సులు అల్లాంటి వాళ్ళుకారు' మూడు రోజులు సెడిటివ్స్‌మీద వుంచాం సుందరమ్మగార్ని అప్పుడుకూడాఆవిడ యిన్ని నగలతోనూ వున్నారు, మేము తియ్యమనలేదు, వాళ్ళు తియ్యలేదు.

"ఎక్సరే అయితే?"

"నర్సులు మెళ్లోంచి తీసి-మళ్ళీ వెంటనే వేస్తారు" అన్నాడు డాకర్ మూర్తి.

"మనం రావుగారింటికి వెళ్దామా?"

"దేనికి?" జంకుగా వుంది-డాక్టర్ మూర్తి కంఠం.

"పొద్దుట ఫోన్ చేశారుగా-వెళ్ళి చూసి వద్దాం. వాళ్ళు కని పెట్టారో లేదో? కనిపెడితే రియాక్షన్ ఎలా వుందో?"

"ఒకవేళ మనల్ని తిట్టిపోస్తే-"

"నేను వున్నాగా-మానేజ్ చేస్తాను,మీరు చూస్తూ వూరుకోండి".

ఈలోగా మళ్ళీ ఫోన్ చేసి కనుక్కున్నాడు-డాక్టర్ మూర్తి నర్సింగ్ హోమ్‌కి.అంతకి అరగంట క్రితమే రావుగారి యింటినుంచి ఫోన్ వచ్చిందట. అర్జంటుగా మాట్లాడాలని-ఎక్కడున్నారని అడుగు తున్నారుట.

"ఎవరు?" అడిగాడు డాకర్ మూ ర్తి.

"రావుగారి రెండో కోడలట - పేరు మాధవి అని చెప్ప మన్నారు." అని ఆపరేటర్ చెప్పింది.

డాక్టర్ మూ ర్తి గుండె గుభేలు మంది. ఈ మాధవి గురించి ఆయన కొద్ది కొద్దిగా విని వున్నారు. ఆవిడకు అతిశయం ఎక్కువ అని-చాలా గర్వంగా వుంటుందనీను.

"వెడదామా?" అడిగాడు ప్రసాద్.

ఉరికంబం ఎక్కబోతున్న-నేరస్తుడిలా తప్పదన్నట్లు తన వూపారు డాక్టర్ మూ ర్తి.

"అక్కడి పరిస్థితినిబట్టి-నేను వాళ్ళనివాదనలో వుక్కిరి బిక్కిరి చేసి యిబ్బంది పెడ్తాను. మీరు ఆక్వర్డుగా అవకండి. ఎలిజబెత్ మీద గాని-మీ నర్సింగ్‌హోమ్ మీదగాని యీ నేరం రుద్దకండా తాత్కాలి కంగా ఆపుతాను-"

"చంద్రహారం నా దగ్గర వుందిగా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"ఉందిగాని, మీరుగాని, మీ నర్సుగాని దొంగిలించలేదుగా?"

"మా దగ్గర లేదని అబద్ధం చెపుతారా?"

"ఊహు-మేమేకాదు చాలామంది ఆ చంద్రహారాన్ని ఎత్తుకు పోవచ్చు-అని డబాయిస్తాను...." అన్నాడు ప్రసాద్.

# 4

రావుగారి యింటిముందున్న విశాలమైన ఆవరణలో చెట్లు దట్టంగా వున్నాయ్. ఆ చెట్లకింద ఫోల్డింగ్ ఛైర్సు— నీడ వున్న ప్రతిచోటా పరచబడివున్నాయి. సాయంకాలం అయిదు అవుతోంది. సాయంకాలపు నీరెండ ఏటవాలుగా .... చెట్ల ఆకులమధ్య నుంచి— ఆ కుర్చీలమీద పడుతూవుంది. కుర్చీలమీద అక్కడా అక్కడా మనుషులు కూచుని వున్నారు. చాలా మటుకు కుర్చీలు ఖాళీగానేవున్నాయి కుడివైపునవున్న— ఖాళీస్థలంలో ఏడెనిమిది కార్లు. ఆ యిల్లూ.... వాతావరణం విషాధంతో నిండివుంది. అక్కడున్న మనుషుల మొఖాల్లో విచారం పరుచుకునివుంది. అందరూ నెమ్మదిగా పైకి వినిపించనంత సన్నని స్థాయిలో మాట్లాడుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు గుంపు గుంపుగా కూచుని.... గొంతులు తగ్గించి మాట్లాడుకుంటున్నారు. మృత్యుఛాయల్లోని మృతకళేబరం వున్నటువంటి గుర్తులు అక్కడ స్పష్టంగా కనిపిస్తున్నాయి కారు పక్కనపెట్టి, డాక్టర్ మూర్తి సాయిప్రసాద్ దిగారు. డాక్టర్ మూర్తికి దిగులుగా, కాస్త పిరికిగా వుంది. చనిపోయిన సుందరమ్మగారి ఆకృతి సరళంగా నవ్వే ఆమె ముఖం, అతనికి పదే పదే జ్ఞాపకం వస్తున్నాయి. తన నిస్సహాయత, వైద్య విజ్ఞాన సంపద పరాజయం అతనిని పదేపదే గుచ్చి బాధిస్తున్నాయి. అన్నిటికీ మించి యీ చనిపోయిన వ్యక్తి ఒక సమస్యని

ఒక రకమైన మిస్టరీని "క్రియేట్" చేసి వెళ్ళింది. తమని అందరినీ చిక్కుల్లోకి తోసి వెళ్ళింది. దాని పరిణామం ఏదారి తీసుకుంటుందో! నన్న ఆదుర్దా! అయిష్టంగానే అడుగుముందుకు వేశాడు డాక్టర్.

సాయీప్రసాద్‌కి మాత్రం చాలా వుత్సాహంగా వుంది. చనిపోయిన సుందరమ్మగారితో అతనికి పెద్దపరిచయంలేదు.... రావుగారితో పరిచయంవుంది. అదికూడా క్లబ్‌లో పేకాటలో యిద్దరూ భాగస్థులు— ప్రత్యర్థులుకూడాను. ఆమెని ఒకటి రెండు సార్లు దూరంనుంచి చూశాడు వచ్చగా— నిండుగా వున్న మామూలు హిందూ కుటుంబములోని గృహిణి అని తప్ప అతనికి వేరే అభిప్రాయం లేదు. కాని చనిపోయే ముందు ఆమె రాబీకిచ్చిన చంద్రహారం, రాబీ ఎస్తేరమ్మ స్వంత కొడుకు కాకపోవటం.... వీటి వెనక తామెవరికీ తెలియని ఒక మిస్టరీ వుండి వుండాలి. ఆ మిస్టరీ బహుశా రావుగార్కి కూడా తెలిసివుండదు. పైకి అంత సంప్రదాయబద్ధంగా కనిపించే ఈమె, భర్త కళ్ళు కప్పి ప్రేమ వ్యవహారాల్లో పడివుంటుందా? రాబీ ఈమె కొడుకై వుంటాడా? ఏ సంబంధం లేకపోతే— చంద్రహారం ఎందు కిస్తుంది? కన్నకొడుకుని— ఏపరిస్థితులవల్ల వదిలేసుకుంది? ప్రసాద్‌కి క్లబ్ మీదకి మనసు పోవడంలేదు. ఫారెన్ లిక్కర్ కూడా యింత నిషాయివ్వదు. మెదడు ఇంత పదునుగా ఎప్పుడూలేదు. దీని వెనకున్న అసలు కథ పట్టుకోవాలి.... తనలోని ఆసక్తినీ వుత్సాహాన్ని ఆపుకుంటూ, డాక్టర్ మూర్తి వెనకగా తాపీగా నడవటానికి ప్రయత్నిస్తున్నాడు సాయీ ప్రసాద్.

హాల్లో మంచు దిమ్మెలమీద.... సుందరమ్మగారి దేహం పడుకోబెట్టివుంది. మంచుదిమ్మలు ఎత్తుగా.... మంచంలాగావున్నాయి. వాటిమీద నుంచి రబ్బరు షీటు నేలమీదకి వేలాడుతున్నది— దుప్పటి

లాగా! షీటు చివరనుంచి నీరు, బొట్లు బొట్లుగా నేలమీదపడి.... చిన్న కాలువగా పక్కకి ప్రవహిస్తోంది. అక్కడ తాత్కాలికంగా పెట్టిన కన్నం ద్వారా బయటకెళుతోంది నీరు. ఆ హాలు నిండా అగ రొత్తుల పరిమళం.... సుందరమ్మగారి దేహంనిండా పూలమాలలు— అన్నీ గులాబీమాలలే. వాటిమధ్య తెల్లని పూలమాల బహుశా మల్లె పూలు అయివుంటాయి. అగరువత్తులమధ్య నుంచి మల్లెపువ్వుల సౌర భం కూడా గాలిలో— సన్నగా ప్రయాణిస్తూ వుంది—అప్పుడప్పుడు.

విశాలంగా నలుచదరంగా వున్న హాలు ఆ హాల్లో సోఫాలూ.... కుర్చీలు వొక పక్కకి నెట్టబడి వున్నాయి. ఆ హాలులో ఒక పక్కగా సుందరమ్మగారి భౌతికకాయం పూలహారాల్తో — దీర్ఘనిద్రలో మునిగివుంది. పైన తిరుగుతున్న ఫాన్‌గాలికి ఆమె తెల్లని ముంగు రులు అల్లల్లాడి, ఆ వ్యక్తి ప్రాణంతో వున్నదేమోనన్న భ్రమకలి గిస్తూవుంది. ఆమె ముఖంమీద . ఎర్రనిబొట్టు. చనిపోయినా ఆ ముఖంలో మృత్యుఛాయలులేవు. నిద్రపోతున్నట్లు ప్రశాంతంగా.... మామూలుగా, కనురెప్పలు మూసుకుని వున్నాయి.

ఆ పక్కనే నేలమీద— కొందరు స్త్రీలు కూచుని వున్నారు. ఆ హాల్లో వున్న కుర్చీల్లో మొగవాళ్ళు కొన్ని కుర్చీల్లో కూచుని వున్నారు. సుందరమ్మగారి దేహానికి పక్కగా— కర్రకుర్చీ.... ఆ కుర్చీలో రావుగారు కూచునివుండి భార్య ముఖంలోకి.... తదేకంగా చూస్తున్నారు.

ఆయన మనసులో ఏ భావాలు కదుల్తుతున్నాయి? ఏ జ్ఞాపకాల గొంతర్లు నేలమీదకి దొర్లుతున్నాయి? ప్రసాద్‌కి ఒక్కసారి ఆయన బుర్రలోకి వెళ్ళి చూడాలని అనిపించింది. ఎలా? వెళ్ళలేడు ఒక

మనిషి.... మరో మనిషి కాలేడు. ఒక మనిషి ఆలోచనలు మరోమనిషి వూహించుకోగలడేతప్ప, అతని బుర్రలోకి ప్రవేశించటం సాధ్యం కాదు. రావుగార్కి భార్య — ఎవరో పరాయి పిల్లవాడికిచంద్రహారం ఇచ్చిన విషయం తెలుసా? ఆ ఆలోచన వచ్చినందుకు ప్రసాద్ తన తెలివి హీనతకు తానే తిట్టుకున్నాడు. రావుగార్కి చంద్రహారం కని పించలేదని తెలిసినా..... అది భార్య ఎవరో అబ్బాయికి యిచ్చి వుంటుందని ఎలా తెలుస్తుంది! ఆ చంద్రహారం గురించి ఈ మృత్యు ముఖంలో ఆయన పట్టించుకోరేమో! అంతకంటే విలువైన తన జీవిత సహచరిణి పోయింది.... చంద్రహారం ఎంత.... దాని విలువెంత! బహుశా ఆయన ఆలోచనా విధానం ఈ తీరున వుంటుందా? ప్రసాద్ తనని రావుగారి స్థానంలో వుంచకు, ఆయన మనోభావాలని తన స్వంతం చేసుకోవాలని ప్రయత్నిస్తూవున్నాడు.

డాక్టర్ మూర్తి .... నెమ్మదిగా ఆయన పక్కకెళ్ళి బుజంమీద చెయ్యి వేశాడు.రావుగారు డాక్టర్ మూర్తి చేతినిఅందుకుని నిశ్శబ్దంగా ఆయన నడుంలో తల దాచుకున్నారు.

"అయామ్ సారీ" అన్నాడు డాక్టర్ మూర్తి.... ఇంక మాట్లా డేది లేదన్నట్లు.

నేలమీద కూచున్నస్త్రీలు—కళ్ళెత్తి డాక్టర్ మూర్తి వంక చూస్తు న్నారు. అందులో ఒక స్త్రీ నిప్పులు కురిపించే కళ్ళతో.... డాక్టర్ వంక చూడటం గమనించాడు ప్రసాద్. ఎవరయి వుంటుంది? కూతురా? కోడలా? ఎవరు? ఆమె కళ్ళలో అంత కోపందేనికి? కుతూ హలంగా చూస్తున్న ప్రసాద్ దృష్టిని గమనించినట్లు, ఆమె ప్రసాదు వైపు ఒక్కసారి చూసి— తలవంచుకుంది.

ఆమెకు ముఫైఏళ్ళవయసు వుండవచ్చు? ఆర్గండీ వాయిల్ చీర కట్టుకుని, మాచ్ అయ్యేరంగు జాకెట్ వేసుకుని ఈ దుఃఖ సమయంలో కూడా స్మార్టుగా కనిపిస్తున్న ఈమె.... రావుగారి కోడలు మాధవి అయి వుంటుందా?.... అన్న ఆలోచన కలిగింది ప్రసాద్‌కి. ఆ పక్కన ఇంచుమించు అదే వయసులో వున్న మరో స్త్రీ. చాలా సింపుల్‌గా.... జుట్టురేగి, కళ్ళువుబ్బి, ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లిపోయి నట్లుంది. బహుశా కూతురయివుంటుంది.... అనుకున్నాడు ప్రసాదు. వీళ్ళిద్దరికంటే వయసులో కాస్త పెద్దగా, హుందాగావున్న ఒకామె.... లేచి భౌతికకాయానికి తల దగ్గర వున్న ప్రమిదలో నూనెపోసి, వొత్తి సరిచేసింది.... పెద్దకోడలయి వుంటుంది అనుకున్నాడు ప్రసాదు, ఒక అయిదు నిముషాలు నిశ్శబ్దంగా గడిచిపోయింది. అగరువత్తుల సువ సన చిక్కగా.... నిశ్శబ్దంతో పోటీ పడుతోంది. ఆ వాతావరణంలోని బరువుకి.... వుక్కిరి బిక్కిరిగా వుంది ప్రసాద్‌కి.

అలా అయిదు నిముషాలు గడిచాక.... రావుగారి చిన్నకోడలు మాధవి.... డాక్టర్ మూర్తి వంకచూసి "ఒకసారి యిలాపైకి వస్తారా.... డాక్టర్" అంది నెమ్మదిగా.

డాక్టర్ మూర్తి కదిలాడు.... వెంట ప్రసాద్ కూడా బయలు దేరాడు యుద్ధానికి సన్నద్ధ మౌతున్నట్లు! ముగ్గురూ మెట్లెక్కి మేడ మీద వరండాలోకి వచ్చారు. అక్కడున్న కుర్చీలు చూపిస్తూ.... తాను మరో కుర్చీలో కూచుంది మాధవి.

ఆవిడని చూస్తే ప్రసాదుకి కాస్త ఆశ్చర్యంగానే వుంది. ముఫై ఏళ్ళ వయసున్న ఒక యువతి ఆరోజునే అత్తగారు గతించి....భౌతిక కాయం ఇంకా అక్కడే వుండగా, అందరిమధ్యా "పైకి, రండి"అని,

అటువంటి సమయంలో పిల్చింది అంటే— ఈమెకి మంచి గుండె ధైర్యం— తెగువా వున్నాయన్నది స్పష్టం అయింది.

"పొద్దుట మీ యింట్లోంచి ఫోన్ చేశారుట" అడిగాడు డాక్టర్ మూర్తి.

"అయిస్‌బ్లాక్స్ అరేంజి చెయ్యటానికి నర్సుని పంపుతారేమో నని— మామగారు ఫోన్ చెయ్యమన్నారు."

"ఎవరైనా వచ్చారా?"

"ఆ....మీ వాళ్ళెవరినో పంపారు," అంది ఆమె తాపీగా. మళ్ళీ నిశ్శబ్దం.

"డాక్టరుగారూ,మీరు అన్యథా అనుకోకండి-మా అత్తగారి మెళ్లో చంద్రహారం-ఆ ఎలిజబెత్ లేదూ-నర్స్ కొట్టేసింది."

డాక్టర్ మూర్తి వులిక్కిపడ్డాడు-ఖంగారు పడ్డాడు. ఈమె యింత సూటిగా అడిగేస్తుందనుకోలేదు.

"మీరు తొందరపడి, నిర్ణయాలకి రాకండి-అనవసరంగా ఒక మనిషిని 'దొంగ' అనకూడదు" అన్నాడు ప్రసాద్ కలిపించుకుని.

మాధవి అతనివంక తీక్షణంగా చూసింది-మీరిందులో కల్పించుకోకండి-అన్నట్లు.

"ఈ విషయం నలుగురి నోళ్ళలో పడకుండా ఆహారం వెనక్కి యిచ్చే ఏర్పాట్లు చెయ్యండి. అసలు మేము అప్పుడే చూడాల్సింది

"ఎప్పుడు?"

"బాడీని తీసుకొచ్చేటప్పుడు-ఇలాంటి వెధవ పని జరుగుతుందని వూహించుకోలేక పోయాము. వాళ్ళు పూర్తిగా చల్లబడకుండానే-మెళ్లో గొలుసు లాక్కునే నిర్భాగ్యులు-వుంటారనుకోలేదు—"

"మీరు తొందరపడుతున్నారు." అన్నాడు డాక్టర్ మూర్తి.

"తొందర పడివుంటే యీ పాటికి పోలీసు రిపోర్ట్ యిచ్చేసి వుందుము. మేము పుట్టెడు దుఃఖంలో వుంటే, ఆమె మెళ్ళోంచి గొలుసు లాక్కుంటుందా? అసలు మొదటినుంచీ ఆ నవ్వుని చూస్తే నాకేమిటో సందేహంగానే ఉండేది. దాని నక్క వినయాలు అదీను. గొప్పగా ప్రేమ వొలకపోసి....మా మామగార్ని అత్తగార్ని వెర్రి బాగులవాళ్ళని చేసింది. దాన్ని జుట్టు పట్టుకు లాక్కురమ్మంటాను.... వెధవ పనులూ యిదీను—" ఆమె ముఖంలో క్రోధం! సంస్కారపు ముసుగు తొలిగిపోయి కసిగా తిడుతోంది.

ప్రసాద్‌కి మానవ నైజం గురించి మళ్ళీ అనుమానాలొస్తు న్నాయి. ఈవిడకు చంద్రహారం పోయిందన్న బాధకంటే, ఎలిజ బెత్‌ని అవమానించాలన్న కోర్కె ప్రబలంగా వున్నట్లుంది.

"కళ్ళతో చూడకుండా-ఎవరికీ దొంగతనం అంటగట్టకూడదు" అన్నాడు ప్రసాద్ నెమ్మదిగా.

"ప్రాణం పోయిన మనిషి కళ్ళతో ఎలా చూస్తుందండి? అసలు ఆ ముండ యిల్లాంటి అదనుకోసమే చూస్తోంది. మూడుపేట్ల చంద్రహారం. ఈ రోజుల్లో దాని విలువ ఎంతో తెలుసా? ఎంత చచ్చుగా చూసినా మూడువేలుంటుంది. మా అత్తగారు మా ముగ్గురికి మూడు పేటలు యిస్తాననంటూండేవారు-అది మా సొత్తు."

అమ్మయ్య-అసలు కారణం ఇప్పుడు బోధపడింది-అనుకున్నాడు ప్రసాద్. అతను డాక్టర్ మూర్తివైపు చూడకుండా, అతని కళ్ళతో తన కళ్ళు కలవకుండా జాగ్రత్త పడుతున్నాడు-తమ కళ్ళలోని రహ స్యాన్ని యీవిడ ఎక్కడ పసికడుతుందోనని!

"మా మామగారి ముఖం చూసి వూరుకున్నాను. యీపాటికి పోలీసు కంప్లయింట్ యిచ్చి వుండేదాన్ని."

"ఇవ్వండి. ప్రాణం పోయినదగ్గరనుంచీ, మీరు ఆ గొలుసు పోయిందని కనుక్కున్న క్షణం దాకా, యీ మధ్యకాలంలో ఎవరెవరు వచ్చారో, ఎవరు బాడీని ముట్టుకున్నారో, ఆ అందరిని పరీక్ష చెయ్యమంటాము, ఏం.... మా హాస్పటల్ నర్సుని మటుకెందుకు సందేహించాలి? పనివాళ్ళు, వచ్చేపోయేవాళ్ళు, యింట్లోవాళ్ళు— ఎందుకు లేరు...." అన్నాడు ప్రసాదు విసురుగానే.

"మా సొమ్ము మేము— ఈ సమయంలో అపహరిస్తామా?"

"ప్రాణం పోయాక వంటిమీద నగలు వల్చుకున్న వుదంతాలు కోకొల్లలు. అందులో కూతుళ్లూ— కోడళ్ళూ అందరూ వున్నారు— మిమ్మల్ని అంటున్నానని కాదు. అటువంటి వుదంతాలు లక్షచూపించగలను." అన్నాడు ప్రసాదు ఆమెని రెచ్చగొడుతూ....

"మీరేమంటున్నారో తెలుసా?"

"తెలుసు. మీ అత్తగారి దేహం ఇంకా ఈ ఇంట్లోనే వుంది. ఆవిడమీద గౌరవంతోనైనా ఇతరులకి దొంగతనాలు అంటగట్టకండి. పోలీసుకేసులు బనాయించటానికి ఇది సమయంకాదు...."

"మరి మానగ వదులుకోమన్నారా?"

"వదులుకోమని అనటంలేదు. హాస్పటల్ స్టాఫ్‌మీద అపనింద మోపవద్దు అంటున్నాము—".

మెట్లమీద అడుగులశబ్దం— సంభాషణ ఆగిపోయింది.... రావుగారు భారంగా అడుగు వేసుకుంటూ వచ్చారు పైకి. ఆయన మొఖంలో సర్వస్వమూ కోల్పోయిన బాధ.... ప్రతిఫలిస్తూవుంది.

"డాక్టరుగారూ, ఆడవాళ్ళ మాటలు పట్టించుకోకండి. నా భార్య నాకు ఎలానూలేదు. అదే పోయాక దాని నగలు పోతేఏం? వుంటేఏం?

పాపం, ఆ ఎలిజబెత్‌ని అనవసరంగా బాధించకండి. ఆ పిల్ల మా ఆవిడకు కన్నతల్లికి చేసినట్లు సేవచేసింది." అన్నారు. అలానే తలుపుకి ఆనుకుని నుల్చుని.

"చంద్రహారం పోయినట్లు మీకెప్పుడు తెలిసింది?" అడిగాడు ప్రసాదు నిప్పులు కక్కుతున్న.... మాధవి కళ్ళవంక చూస్తూ.

"అయిస్ బ్లాక్స్‌మీద పడుకో బెడ్తున్నప్పుడు, మిగతా అన్ని నగలూ వున్నాయి. చంద్రహారంమటుకే లేదు." అంది తీక్షణంగా.

"దొంగతనం చెయ్యదల్చుకున్న మనిషి మిగతావి మటుకు ఎందుకు వొదుల్తుంది?" ఎదురు సవాల్ చేస్తూ అడిగాడు ప్రసాదు.

"మెళ్ళోంచి తియ్యటం తేలిక."

"అంత అమానుషంగా ప్రవర్తించే మనిషి.... చేతిగాజులు లాక్కోలేదా? పుస్తెలతాడు తియ్యలేదా? మాధవిగారు మీరు చదువుకున్నారు.... లెక్చరర్‌గా వున్నారని విన్నాను. సాటి స్త్రీని గురించి అంత అన్యాయంగా అంచనా వెయ్యకండి" అన్నాడు ప్రసాదు వచ్చిన అవకాశం వదలకుండా.

"రేపు పన్నెండింటిదాకా— ఎవ్వరం ఈ విషయం ఎత్తం. పన్నెండింటికి దహనకాండలు అయిపోతాయి.... ఆ తర్వాత మా మామగారు వూరుకున్నా, నేను వూరుకోను. ఇంట్లో బాడీ వుండగా గొడవలు జరిగితే, బాగుండదని వూరుకుంటున్నాను. మీ నర్స్‌కి చెప్పండి.... రేపు పన్నెండింటి లోపల నగ మా ఇంటికి వచ్చితీరాలవి లేకపోతే, పోలీసుల్ని పంపుతా. పోతేపోయిందని వూరుకునేంత అమాయకురాల్నిగాదు.... అందులో మా ముగ్గురికీ భాగం వుంది...." అంటూ కుర్చీమీంచి లేచింది మాధవి విసురుగా.

ప్రసాదు 'అమ్మయ్య' అనుకున్నాడు లోలోపల.... రేపు మధ్యాహ్నానికి ఎలిజబెత్ ఈ పరిసరాల్లో వుండదు. దాటి వెళ్ళిపోతుంది.

"సెర్చ్‌వారంట్" ఎవరిమీదకి తీసుకొస్తారు? కోడలు ఇంత ధాటీగా మాట్లాడుతుంటే.... రావుగారు నిస్సహాయంగా చూస్తూవుండిపోయారు ఆ అమ్మాయి కిందకి వెళ్ళిపోయాక ఆయన నెమ్మదిగా అన్నారు.

"ఎలిజబెత్‌కి నేనే.... నా భార్య జ్ఞాపకార్థం ఏదైనా యిచ్చి వుండేవాడిని.... ఆ పిల్ల యిటువంటి పొరబాటు చేస్తుందనుకోలేదు. ఇలా ఎందుకు చేసిందో?" తనలో తాను ప్రశ్నించుకున్నట్లు అన్నారు

"మా నర్స్ దొంగతనం చేసిందని మీరు నిజంగా అనుకుంటు న్నారా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"నేనైతే నమ్మలేకుండా వున్నాను. మరి ఆ చంద్రహారంఏమై వుంటుంది? ఎవరికీ తీసే అవకాశంలేదే?" అడిగారు రావుగారు నెమ్మదిగా.

"ఎలా పోయిందో.... ఎవరు తీశారో మేమూ చెప్పలేకుండా వున్నాము. ఒక విషయం.... ఎలిజబెత్ అలాంటిదికాదు. నిప్పులాంటిది.... అదిమటుకు నేను గ్యారంటి యివ్వగలను—" అన్నాడు డాక్టర్ మూర్తి.

"అయితే వార్డుబాయిస్ గాని తీసి వుండవచ్చునేమో— రాత్రి పూట నిద్రలోవుండగా ఎవరన్నా గదిలోకివచ్చే అవకాశం వుందేమో" అడిగారు ఆయన సాలోచనగా.

"వుండివుండచ్చు కాని మా నర్సింగ్ హోమ్‌లో యింతవరకూ ఒక్క పైసాకూడా పోలేదు రాత్రిళ్ళు స్పెషల్‌వార్డులో గది తలుపులు లోపల వేసుకుంటారు."

"మరి?"

"మాకూ అదే బోధపడటంలేదు. మీరు ఈ విషయం బయటకి పొక్కకుండా చూడండి. ఆడవాళ్ళు తొందరపడ్డా వారిని కాస్త ఆపండి ఈ పన్నెండు రోజులూ— యిలా ప్రశాంతంగా వెళ్ళిపోనివ్వటం మంచిది. ముఖ్యంగా ఆమె ఆత్మకి—" ఆగిపోయాడు డాక్టర్ మూర్తి

"చెప్పిచూస్తాను—"

"చూడటంకాదు. మీరు గట్టిగా చెప్పండి. రేపే సెర్చివారంటూ పోలీసులు అంటున్నారు మీ కోడలు. అసహ్యంగా వుంటుంది. ఒక వేళ చంద్రహారం మా ఆవరణలోనే పోయివుంటే మీరు అనుకున్నట్లు ఆ అమ్మాయే దొంగతనం చేసివుంటే.... మేము ఎలాగో అలాగా పట్టుకుని—మీ నగ మీకు అప్పచెపుతాం." అన్నాడు ప్రసాదు.

"అలాగే" అన్నట్లు తలవూపారు రావుగారు.

"ఈ పన్నెండురోజులూ ఎటువంటి యాక్షన్ తీసుకోమనిమాట యివ్వండి" అన్నాడు ప్రసాదు.

రావుగారు, ప్రసాదు కళ్ళలోకి సూటిగా చూసి "మీ కిందులో యింటరెస్ట్ దేనికి?" అని అడిగారు.

"నాకు అనికాదు. చనిపోయిన ఆమె ఆత్మగురించి ఆలోచించి చెపుతున్నాను. ఆమెకి ఆ నర్స్‌మీద అభిమానం అని మీరే అంటు న్నారు.... ఆ అమ్మాయిని యిబ్బందిపెడితే "ఆత్మ" అంటూ వుంటే అది క్షోభపడుతుందేమోనని...."

"ఈ దేహంపోయాక.... ఆత్మవుంటుందంటారా?"

"వుండవచ్చు.... రేషనల్‌గా చూస్తే లేకపోనూవచ్చు! కాని ఆమె జ్ఞాపకాన్నయినా, మనం గౌరవించాలిగా! మృతదేహం యింట్లో వుండగానే ఆస్తికోసం దెబ్బలాడుకునే— దాయాదుల్లా అవకూడదు. అటువంటిది జరగకుండా చూడటం మీ చేతుల్లో వుంది. ఆడవాళ్ళు నగల ప్రలోభంలో తొందరపడచ్చు.... అందుకు చెపుతున్నాను." అన్నాడు ప్రసాదు.

"మీరు చెప్పిన పాయింట్ అర్థంఅయింది. పన్నెండురోజుల్లూ ఆ అమ్మాయి జోలికి రాకుండా చూస్తాను. ఆపైన నేను చెయ్యగలి

గేది ఏమీ వుండదనుకుంటా. మిగతా అందరూ ఒకటైతే- నేను నిస్సహాయుడిని కావచ్చు" అన్నారాయన సూటిగా.

"అయ్ అండర్‌స్టాండ్ యిట్" అన్నాడు అనిర్వచనీయమైన జాలితో ప్రసాద్. మళ్ళీ తనే అందుకుని "నాకు పాపపుణ్యాల్లో నమ్మకంలేదు. కాని, ఒకటిమటుకు నిజం. మీరుండగా.... అతిసునాయాసంగా ఆమె వెళ్ళిపోయారు. మరణం అన్నది ప్రతివాళ్ళకీ వస్తుంది. ఆమె సెంటుమెంట్సుని యింత పదిలంగా కాపాడే మీరు వుండగా వెళ్ళిపోటం మహాపుణ్యం.... అనే వొప్పుకోవాలి. వారితో నాకు పెద్ద పరిచయం లేదుగాని.... డాక్టర్ మూర్తిగారు చెప్పారు— చాలా మంచివారని.... ఎప్పుడూ చిరునవ్వుతో వుండేవారని! ఇవన్నీ ఆలోచించి చూస్తే— మీరు దురదృష్టవంతులు— ఆమె అదృష్టవంతురాలు అని అనుకోవాల్సి వస్తోంది" అన్నాడు ప్రసాదు. అతను మనస్ఫూర్తిగానే ఈ మాటలు అన్నాడు. అప్పటిదాకా తలుపుని ఆనుకుని నిల్చుని వున్న రావుగారు.... ఈ సానుభూతి వాక్యాల్తో— నుల్చునే వోపిక లేనట్లు, అలా నేలమీదకి జారిపోయి, రెండు మోకాళ్ళలో తలదాచుకున్నాడు. ఆయన భుజాలు.... కంపిస్తూవున్నాయి. పైకి వినిపించని రోదనతో ఆయన లోలోన కుమిలిపోతున్నారు. ప్రసాదుకి ఈ మనిషిని చూస్తే, విపరీతమైన సానుభూతి కలిగింది. భార్యలేని ఈ వ్యక్తి జీవితం రేపటినుంచి ఎలా వుంటుంది? ఈయన గురించి ఎవరు కనుక్కుంటారు? పసుపుతాడుతో ముడిపడిన ఈ దాంపత్య బంధం తెంచుకుని ఆమె వెళ్ళిపోయారు. ఈ మనిషి వంటరిగా— ఏకాకిగా మిగిలిపోయారు. ప్రసాదు ఆయన పక్కకెళ్ళి, నేలమీద చతికిలపడి, గట్టిగా పసిపిల్లవాడిలా ఆయనని కావలించుకున్నాడు. రావుగారి దుఃఖం గట్లు తెంచుకుంది....

"ఇప్పుడేం చేద్దాం?" అడిగాడు డాక్టర్ మూర్తి. సాయింత్రం ఆరు దాటింది. చుట్టూ చీకట్లు పరుచుకోటానికి సమయమయింది. పక్షులు-కొద్ది కొద్దిగా అరుస్తూ వున్నాయి. ప్రసాద్ వెంటనే బదులు చెప్పలేదు. అతనికి మనసంతా కలవరంగా వుంది. రావుగార్ని చూస్తే జాలిగావుంది. వృద్ధాప్యంలో భార్య వియోగం ఎంత భయంకరమైన శిక్షో అతనికి బోధపడుతూంది. ఇన్నాళ్ళ బట్టి అతను భర్త గతించిన వితంతువుల జీవితం నరకప్రాయం అనుకుంటూవుండేవాడు. కాని ఈ రావుగార్ని చూశాక మొగవాడు ఎంత నిస్సహాయుడో, జతలేక పోతే ఎంతదయనీయంగా అయిపోతాడో బోధపడుతూవుంది. అతని మనసు భారంగా వుంది.

మళ్ళీ అడిగాడు డాక్టర్ మూర్తి-తదుపరి కార్యక్రమం ఏమిటని!-

"మీరు యింటి కెళ్ళిపోండి. ఎలిజబెత్ వాళ్ళని మా వ్యాన్ వెంట బెట్టుకు తీసుకెళ్ళిపోతాడు."

కారు స్లో చేసి-డాక్టర్ మూర్తి జేబువెతుక్కుంటున్నాడు ఎడం చేత్తో.

"డబ్బు యివ్వబోతున్నారా?" నవ్వుతూ అడిగి-"ఇవ్వకండి-కొన్ని సమయాల్లో డబ్బు చాలా క్షుద్రంగా కనిపిస్తుంది. ఈ సమస్య చాలా తమాషాగా వుంది. రేపు నేను రమాపురం వెళ్తాను-" అన్నాడు ప్రసాద్.

"రాబీ పుట్టుక గురించి తెలుసుకోడానికా?"

"అవును. అప్పుడుగాని అసలు విషయం బోధపడదు."

"ఈ రాబీ సుందరమ్మగారికి పుట్టి వుంటాడంటారా?"

"ఏమో-స్త్రీ హృదయం అగాధం అంటారు. మా గురువుగారి లెక్కప్రకారం, మనిషి ప్రవర్తన ప్రతిసారీ విచిత్రంగానే వుంటుంది-"

"మీకు గురువు వున్నారా? ఎవరు?" అడిగాడుమూర్తి కుతూహ

"సామర్ సెట్ మామ్ అండీ" నవ్వాడు ప్రసాద్.

"సుందరమ్మగారు– యీ పిల్లవాడు అవకరంతో పుట్టాడని వది లేసివుంటారంటారా?" అడిగాడు మూర్తి.

"ఊహు. మీ మాటలని బట్టి చూస్తే ఆవిడ అలాంటిది అని పించటంలేదు. అవకరంతో పుట్టాడని పిల్లల్ని వదిలేసి పారిపోయే తల్లితండ్రులు వుంటారనుకోను."

"మరి యీ పిల్లవాడు రావుగార్కి తెలియకుండా కలిగి వుంటా రంటారా?" అడిగాడు మూ ర్తి.

"సంభవం కావచ్చు. రావుగారు ఆమె చాలా అన్యోన్యంగా వుంటారని మీ వుద్దేశం కదూ! అల్లాంటిది—ఈ భారతదేశంలో భర్తకి తెలియకండా పిల్లవాడిని కనటం సంభవమా? ఏదో బలహీనతతో కాలు జారిన స్త్రీలూ గృహిణులూ వుండవచ్చేమోగాని-భర్తకి తెలియకుండా పిల్లవాడిని కనటం సాధ్యమా?"

"ఈమె విషయంలో ఆ అవకాశం వుంది. ఎందుకంటే. రావు గారు మూడేళ్ళపాటు జర్మనీలో వుండొచ్చారంట." అన్నాడు మూర్తి.

"మీకెట్లా తెలుసు? వంటరిగా వెళ్ళారా?" అడిగాడు ప్రసాద్.

"వంటరిగా వెళ్ళారనే విన్నాను. ఈవిడ పిల్లల చదువులు చెడి పోతాయని యిక్కడేవుండిపోయారట-" మూర్తి మాటలువిని సన్నగా విజిల్ వేశాడు ప్రసాద్.

"అయితే అలాంటిది జరగటానికి అవకాశం వుందన్నమాట. ఈ విషయం తేల్చుకొనిదే నాకు నిద్రపట్టేట్లు లేదు. రేపు రామా పురం వెళ్తాను." అన్నాడు ప్రసాద్.

"ఇంత హైరానాదేనికి? ఆ చంద్రహారం నెమ్మదిగా గుట్టు చప్పుడుకాకుండా రావుగారికి యిచ్చేస్తే-ఏగొడవా వుండదుగా" అన్నాడు మూర్తి.

"కావచ్చు కాని. సుందరమ్మగారి ఆఖరి కోర్కెని మనం ఎవరం మన్నించలేకపోయామని కొరత మిగులుతుంది. ఇంత దాకా వచ్చాక_నా కుతూహలం ఆపుకోలేను. చూడండి డాక్టరుగారు నాకు మీకు మళ్ళీ-వూపిరి ఆడని పనిలేదు. నేను కనుక్కోకపోతే ప్రాణాలు కోల్పోయే పేషంట్లులేరు-హాయిగాతిని కూచుని-కాలక్షేపానికి క్లబ్‌కి వెళ్ళే జీవితంనాది_ ఒక్కొక్కసారి నాకూ కొంత పని ఏకాగ్రత కావాలనిపిస్తూ వుంటుంది-చాన్సువచ్చింది వదులుకోటం దేనికి?"

"రాబీ-సుందరమ్మగారికి పుట్టాడని కనుక్కుంటారే అనుకోండి. ఆ విషయం రావుగారికి చెపుతారా?"

"చెప్పను. చనిపోయిన స్త్రీ గత జీవితాన్ని తవ్వేంత నీచుడిని కాను" అన్నాడు ప్రసాద్ తీవ్రంగా

"అప్పుడు చంద్రహారం వాళ్ళకి యివ్వరా? ఇవ్వకపోతే మాధవిగారు వూరుకుంటారా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"ఊరుకోరు. ఇంకా పదిరోజులు టైమువుందిగా! ఈ లోపల యింకా ఎన్ని కొత్త గాధలు పైకొస్తాయో...."

"అంటే?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"ఏమో యీ పిల్లవాడు రావుగారికి మాత్రమే పుట్టివుండవచ్చు-ఆయన చెల్లెలికి కలిగివుండొచ్చు,సుందరమ్మగారి కొడుకులకి ఎవరికైనా కలిగివుండచ్చు. ఒకటిమటుకు నిజం-సుందరమ్మగారు యీ రాబీని గుర్తించింది. వాడికి ఏదోఒకటి యివ్వాలనుకుంది అన్నది స్పష్టం అయింది." అన్నాడు ప్రసాద్.

"తొందరపడకండి-ఈ రాబీని ఎస్తేరమ్మ ఎవరి దగ్గరనుంచో

కొన్నానంటున్నది. రాబీని అమ్మిన ఆయా బ్రతికివుందో లేదో! మీ పరిశోధనమధ్యలో ఆగిపోతుందేమో! అతని వుత్సాహానికి కళ్ళెం వేస్తూ అన్నాడు మూర్తి.

"కానివ్వండి. పదిరోజులు వ్యవధి వుంది. ఈలోగా రావుగారు వాళ్ళు పోలీసు రిపోర్ట్ యివ్వరు. ఎలిజబెత్ వూళ్ళోలేదు. అంచేత మీరు వ్యక్తిగతంగా యిబ్బంది పడాల్సిందిగాని, మీ ప్రతిష్టకి భంగం కలిగే పరిస్థితులుగాని రావు.ఈ లోగా నేను చాలా విషయాలు కనిపెట్ట గలననుకుంటాను." అన్నాడు ప్రసాద్.

"రావుగారి దగ్గరకెడతారా? విషయాలు కనుక్కోటానికి."

"ఉహు. ఇటునుంచి, యీ రామాపురం వైపునుంచి, విషయ సేకరణ ఆరంభిస్తాను. రేపు పొద్దుటే వెళ్తాను."

"కారు తీసుకెడతారా?" అడిగాడు డాక్టరు.

"మా డ్రయివరూ-కారూ వున్నాయి. కారయితే కాస్త గౌరవం, ప్రతిష్టా వుంటాయి." అన్నాడు ప్రసాద్.

డాక్టర్ ప్రభాకర్ మూర్తికి ఒకవైపు నెత్తిమీంచి బరువుదించి నట్లుగా వుంది. మరోవైపు యీ గొడవలన్నీ లేకుండా చంద్ర హారం వెనక్కియిచ్చేసి చేతులు కడుక్కోవాలనివుంది. కాని ఎలిజ బెత్‌లోని నిజాయితీ, రాబీ మొఖంలోని అమాయకత అతనిని ఆ పని చెయ్యటం న్యాయంకాదని హెచ్చరిస్తున్నాయి. ఇలా రాజీ పడటం-తనకీ, తనవృత్తికీ, హాస్పటల్‌కీ వీటికి మంచిది కాదనికూడా అనిపిస్తోంది. పైకి వూరుకున్నా-రావుగారు మనసులో-తమ హాస్ప టల్ గురించి ఏమనుకుంటారు? స్టాఫ్, దొంగ వాళ్ళని, అనుకోరా!

"మీ ఒక్కరి మీదా యీ బాధ్యతపెట్టటం న్యాయంకాదని పిస్తోంది. కాని-నేను రోగుల్ని-హాస్పటల్‌ని వదులుకురాలేను. మీకు ఏ యిన్‌ఫర్‌మేషన్ కావాలన్నా-ఏ సాయం కావాల్సివచ్చినా వెంటనే

ఫోన్ చెయ్యండి. నాకు యిబ్బంది అని మొహమాట పడకండి. వెంటనేకారు తీసుకువచ్చేస్తాను. నా కోసం మీరు యీ రొంపిలో జొర పడ్డారు. మాకు యింకో కారుంది-అది తీసుకెళ్ళకూడదు."

"ఊహు. మా డ్రవర్‌కి నా అలవాట్లు బాగా తెలుసు. అదీ గాక యిందులో మీకు ఎంత తక్కువ సంబంధంవుంటే అంత మంచిది. పదిరోజులలో యీ మిస్టరీ తెగకపోతే-మాధవిగారు వూరు కోదు. అప్పుడివన్నీ సాక్ష్యలకింద కొస్తాయి-ప్రాక్టీసు చెయ్యక పోయినా నేను ప్లీడర్ని-" అన్నాడు సాయీ ప్రసాద్ నవ్వుతూ.

ప్రసాద్‌ని వాళ్ళింట్లో దించేసి డాక్టర్ మూర్తి యింటికెళ్ళాడు. ఆ రాత్రే ఎలిజబెత్ కుటుంబాన్ని, ప్రసాద్ బావమరిది వున్న వూరికి పంపేశాడు.

ఊరు పొలిమేరల దగ్గరకు కారు వస్తుంటే జేబులోంచి డైరీ తీసి-మరోసారి చూసుకున్నాడు ఎడ్రసు. కారు ఆ వూళ్ళో వున్న హోటల్ ముందు ఆగింది. చెట్టునీడలో కారు ఆపుకోమని, ప్రసాద్ హోటల్‌లోపలికెళ్ళాడు. లోపల పాలరాయి పరిచిన బల్లలు - రెండు వైపులాకుర్చీలు, హాల్లో స్పీకర్లోంచి-ఘంటసాల కంఠం బిగ్గరగా విని పిస్తూ వుంది. హోటల్లో జనం అట్టేలేదు. ఇదీ ఒకందుకు మంచిదే అనుకుని-బల్లముందు కూచున్నాడు. యిరవైఏళ్ళ లోపు వయసున్న-తెల్లగావున్న కుర్రవాడొకడు-"సార్?" అంటూ వచ్చాడు బల్లదగ్గరకు.

"ఏమున్నాయి?" ప్రసాద్ యీ పిల్లవాడిని ఖబుర్లలో పెట్టి ఆస్పత్రి గురించి తెలుసుకోవాలనివుంది.

"ఇడ్లీ చల్లారిపోయింది. ఉప్మావేడిగా వుంది-దోశె వేయించ మన్నారా?"

"అయితే దోశె-మసాలాదోశె చెప్పు...." ఆ సర్వర్ కదలక మునుపే- "మీ హోటల్లో లాడ్జింగ్ వుందా?" అడిగాడు.

"లేదండి. ఈ పక్కనే మరో హోటలుంది-అక్కడ గదులు దొరుకుతాయి. కాని బాగుండవు."

"ఏం?"

"ఆ హోటల్‌కి మంచి పేరు లేదండి."

"ఈ వూళ్ళో నాలుగైదు రోజులుండాలోయ్. ఎక్కడయినా మంచి లాడ్జింగ్- దొరుకుతుందేమోనని. నాకీ వూరుకొత్త" ఆగాడు ప్రసాద్. 'ఏం పని మీదవచ్చారు?' అని ఆ సర్వర్ ప్రశ్నలు అడుగుతాడేమోనన్న ఆశతో. కాని, వాడు. ఏలాడ్జి మంచిదో అని బుర్రలో మధన పడుతున్నాడు.

"ఇక్కడ మిషనాస్పత్రి వుంది కదూ?"

"ఉందండీ-"

"బయట వూరు నుంచి వైద్యానికి వస్తూంటారా."

"నాకు తెలియదండి. నేను వచ్చి నెల్లాళ్ళే అయింది. సినిమా హాల్సు తప్ప నాకేం తెలియవు. మా ప్రొప్రయిటరుని అడగండి. వారిదీ వూరే-" అంటూ అక్కడినుంచి కదిలాడు సర్వరు.

ప్రసాద్ బల్ల దగ్గరనుంచి లేచి కౌంటర్ దగ్గర కొచ్చాడు. అది చిన్న సైజు హోటల్లోని అన్ని కౌంటర్స్‌లాగానే వుంది. గోడ మీద రీపరుబద్దకు కొట్టిన అన్నిరకాల దేముళ్ళు వున్నారు. వెంకటేశ్వర స్వామి వెండి పటం- దానికి పూలమాల వేళ్ళాడుతూవుంది. ఆ పూలు కాస్త వడిలినట్లున్నాయి. బహుశా పొద్దుటే వేసివుండచ్చు అనుకున్నాడు ప్రసాద్.

"ఈ వూళ్ళో మిష నాసుపత్రి వుందిటకదూ, ఎక్కడుందో మీకు తెలుసా?"

"రైలు స్టేషనుకి మైలు దూరంలో వుందండి, అది మిషనాసుపత్రికాదు, మామూలుదే."

"మరి అలా అంటారే."

"ఎప్పుడో యాభై ఏళ్ళక్రితం ఓ దొరసాని డాక్టరుగా వచ్చిం దట. అందుకని మిషనాసుపత్రి అంటూండే వారు."

"మిషనరీలకూ దానికి సంబంధంలేదా? క్రిస్టియన్స్‌ది కాదా?"

"మతానికి క్రిస్టియన్స్ కాని వూరికే ఎవరికీ వైద్యం చెయ్యరు. ఆఖరికి గుక్కెడు రంగునీళ్ళకి కూడా డబ్బులు వసూలు చేస్తారు. 'మిషన్ ఆస్పత్రి' అనేప్పటికి చాలా మంది బీద వాళ్ళకి సాయం చేస్తారని మోసపోతుంటారు" అన్నాడు ప్రొప్రయిటరు. అతనికి బొట్టు లేదు-నామాలూ లేవు. నీట్‌గా తెల్ల బట్టలు వేసుకుని కూచునివున్నాడు. చేతిలో 'రాడికల్ హ్యూమనిస్టు' పత్రికవుంది. అది చూశాక యీ యువకుని మనస్తత్వం బోధ పడింది ప్రసాద్‌కి.

"మా వాళ్ళ అమ్మాయిని యీ ఆస్పత్రిలో చేర్చాలనుకుంటు న్నారు-" ఆగాడు ప్రసాద్.

"ఏం జబ్బు?"

ప్రసాద్ జవాబు చెప్పలేదు. ఇబ్బందిగా మరోవైపు చూస్తు న్నాడు కావాలని.

"అల్లాంటి కేసులకి యిది సరైనచోటు చాలా మంది అమ్మా యిలు వస్తూంటారులేండి." అన్నాడు తను అర్థవంతంగా.

"ఎవరిని అడగాలి? ఎలా ఎప్రోచ్ అవాలి?" మళ్ళీ నసుగుతూనే సలహా అడిగాడు ప్రసాద్.

"ఏం భయం లేదు. సరాసరి ఆఫీసు కెళ్ళండి. గోడలమీద మరియమ్మ ఫొటోలు- ఒక వైపు జీసస్ క్రీస్తు. వాతావరణం చాలా పవిత్రంగా కనిపిస్తుందిలెండి." అతను హేళనగా నవ్వి చెప్పాడు.

"అక్కడ స్టాఫూ అదీ సౌకర్యంగా వుంటుందా?"

"ఓ- అందుకే మీ సందేహంలేదు. అంతా తోడు దొంగలు."

"మీకు ఆ ఆస్పత్రి అంటే కోపంలాగా వుందే." నవ్వుతూ- మాట వరసకి అడిగినట్లు అన్నాడు ప్రసాద్,

"కోపం వుండి ఏం ప్రయోజనం? చెప్పేవి శ్రీరంగ నీతులు దూరేవి దొమ్మరి గుడిసెలు. డబ్బుకి ఎంతపనైనా చేస్తారు యిక్కడి వాళ్ళు. అదే ఏ బీదవాళ్ళో చిక్కుల్లో పడివస్తే- చిటికిన వేలుకూడా కదల్చరు- అందుకే నాకు తిక్క."

"మీరెవరినైనా తీసుకెళ్ళారా?"

"వెళ్ళాను. డబ్బుగల వాళ్ళు చేస్తే, అది మెడికల్‌ఎయిడ్ - బీద వాళ్ళయితే, పాపం- ఆ పిల్ల మా కళ్ళ ముందు చచ్చిపోయింది." కసిగా వుంది అతని కంఠం.

"డబ్బుకి యిబ్బంది లేదులెండి."

"కారులో కూడా వచ్చారనుకుంటా. నిరభ్యంతరంగా మీకు గది దొరుకుతుంది- ఆ అమ్మాయికి వైద్యం సుఖంగా జరిగిపోతుంది, సరాసరి వెళ్ళండి. రెడ్‌కార్పెట్ పరిచి మరీ రిసీవ్ చేసుకుంటారు." అన్నాడతను ఈలోగా వేడి వేడి దోసె లోపలి నుంచి వచ్చింది. ప్లేటులో ఆకు పరచి ఆ ఆకు మీద దోసె కాయితంలాగా చుట్టి పెట్టి తీసుకొచ్చాడు సర్వరు. దోసె రుచిగా-వేడిగావుంది. పట్నంలోని త్రీస్టార్ హోటల్‌లో కంటే రుచిగా వుంది. బ్రూ తాగి-బిల్లు చెల్లిస్తూ- "టిఫిన్-చాలా రుచిగావుంది. క్లీన్‌గా కూడావుంది." అన్నాడు ప్రసాద్, ప్రొప్రయిటర్‌ని అభినందిస్తూ.

"ఇక్కడ యిల్లాంటివి ఎవరిక్కావాలండీ. ఏదో నా చాదస్తం తప్ప-" అన్నాడాయువకుడు. ప్రసాద్‌కి ఆ యువకునితో మరికాసేపు మాట్లాడాలనివుంది. తెలివిగలవాడు-చట్టాగల అన్యాయాలని చూసి

బాధ పడగల హృదయం కలవాడు. ఎందుకు యిక్కడ-యీగల్లా పెట్టె దగ్గర రాట్ అవుతున్నాడో-

"నువ్వు టిఫిన్ తీసుకున్నావా?" అడిగాడు డ్రయివర్ ని కారులో కూచుండగానే.

"తీసుకున్నానండి. తమరు బిల్లు చూసుకోలేదా?" తిరిగి ప్రశ్నించాడు డ్రయివరు.

ఇది ప్రతిసారీ అలవాటే. తన యజమాని డబ్బు సరిగా లెక్క చూసుకోడని- సమయం వస్తే ఎత్తి పొడుస్తూ వుంటాడు డ్రయివరు అప్పారావు. అప్పారావుకి ఆ ప్రసాద్ మీద గౌరవం, ఒకరకమైన అధికారమూ, చనువూ కూడా వున్నాయి. పాతికేళ్ళనుంచి వాళ్ళింట్లో డ్రయివరుగా వుంటం చేత కలిగిన హక్కులవి. ప్రసాద్ జవాబు చెప్ప లేదు ఆ ప్రశ్నకి.

సాయి ప్రసాద్ పెర్రిమాజన్ నవల్సు చదివి చదివి, క్రైము సైన్సు అలవరచుకొని కొన్ని కొన్ని సమయాల్లో, ఆఫీసుల్లో, యిళ్ళల్లో ముఖ్య వ్యక్తులు వుండరు అన్న నిర్ణయానికి వచ్చాడు. ఈ నిర్ణయం- చాలాసార్లు సరి అయింది అన్నది కూడా ఋజువయింది. అప్పుడు టైము ఒంటిగంటన్నర. ఈ టైము, లంచ్-కమ్-రెస్ట్-టైము కాబట్టి- మిషన్ ఆస్పత్రిలో ముఖ్యులు ఎవరూ వుండరు. ఆఫీసులో ఏ గుమాస్తానో, కాంపౌండరో వుంటారు వాళ్ళ దగ్గర నుంచి సమాచారం రాబట్టవచ్చు నన్న వుద్దేశ్యంతో- ఆ మధ్యాహ్నం వేళ, మిషన్ ఆస్పత్రి ఆవరణలో కారు ఆపమన్నాడు డ్రైవర్ని. కారు దిగి ఎండలో ముఖం తుడుచుకుంటూ- వందరూపాయల నోట్లు జేబులోంచి స్పష్టంగా కనిపించేట్లు సరిగ్గా సర్దుకున్నానో లేదో అని-మరోసారి చెక్ చేసుకున్నాడు. హోటల్ ప్రొప్రయిటరు మాటలని బట్టి- యీ హాస్పటల్లో మతం కంటే మహాలక్ష్మి ముఖ్యం అయివుంటుందని

అంచనా వేసుకుని, పల్చగా వున్న టెర్రీకాట్ షర్టు జేబులో నూరు రూపాయలనోట్లు పెట్టుకున్నాడు.

అతను లోపలి కెళ్ళేసరికి, ఆఫీసు గదిలాంటి రిసెప్షనులో-ఒక నర్సుపిల్ల కునికిపాట్లు పడుతూవుంది టేబుల్ మీద తల ఆనించుకుని. కొత్త మనిషిని చూసి ఖంగారుపడి, లోపలి కెళ్ళి- మధ్య వయసు దాటిన-నల్లని వ్యక్తితో గదిలోకి వచ్చింది తిరిగి.

"ఎవరు-ఏం కావాలి?" అడిగాడా వ్యక్తి.

"మా కజిన్‌ని ఎడ్మిట్ చెయ్యాలని వచ్చాను." అన్నాడు ప్రసాద్ చుట్టూ చూస్తూ. ఆ అమ్మాయి వెళ్ళి పోయింది. చుట్టూగోడల మీద యోగ్యతా పత్రాలు- మధ్యలో మేరిమాత, మరో మూల జీసస్ క్రీస్తు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసి రంగులు పులిమిన బొమ్మ, మరో గోడ మీంచి టూత్ పేస్టువారి ఎడ్వర్టైజుమెంటు అమ్మాయి ముప్పై రెండు పళ్ళూ బయట పెట్టి నవ్వుతోంది.

"రండి, కూచోండి" అంటూ ఆఫీసు టేబుల్‌కి అవతలి వైపు కూచున్నాడు ఆ వ్యక్తి.

"తమ పేరు?" అడిగాడు ప్రసాద్.

"నేను రిసెప్షన్ క్లర్క్-కమ్-మేనేజరు నండి. డాక్టరుగారు సాయంత్రంగాని రారు. పేషంటుని ఎడ్మిట్ చేసుకునే అధికారం నాకువుంది. స్పెషల్‌రూమా? వార్డా, ఏం కావాలి?" అడిగాడు అతను.

"ముందు హాస్పటల్ చూస్తాను-డబ్బు సమస్యకాదు శుభ్రంగా వుండి-వైద్యం బాగా జరుగుతుందంటే- డబ్బుకి లోభించము" అన్నాడు ప్రసాద్, జేబుమీద చెయ్యివేస్తూ!

ఎదుటి వ్యక్తి కళ్ళలో సన్నని మెరుపు. రొట్టె వాసన సోకిన కుక్కలాగా అతని ముక్కులు కాస్త కదలాడాయి. ప్రసాద్‌కి తృప్తిగా వుంది. అతను బల్లవెనక నుంచిలేచి హాస్పటల్ లోపలికి తీసుకెళ్ళాడు.

హాస్పటల్ చతురస్రాకారంలో వుంది. మధ్య పెద్ద ఖాళీస్థలం దాని చుట్టూ చదరంగా వరండాలు- ఆ వరండాలని ఆనుకొని, గదులు, పొడ వాటి హాల్సు మధ్యనున్న ఖాళీస్థలంలో- బాలింతల బట్టలు- వరండాలో పేషంట్ల తాలూకు బంధువులు- ఆ తిండికోసం,కాచుకు కూచున్న కాకులు- గవర్నమెంటు హాస్పటల్స్కంటే నీట్‌గా, కామ్‌గావుంది అక్కడ.

"ఆ వైపు స్పెషల్ వార్డువుంది చూస్తారా? మొత్తం పదిగదులు- బాత్‌రూమ్‌లు కూడా వున్నాయి ప్రతి గదికీ. ఆ వెనక చిన్న గది వుంది. సామాను అది పెట్టుకోవటానికి" -చెప్తున్నాడు మేనేజర్.

"మీ పేరు?"

"సాంబశివరావంటారండి."

"ఎన్నాళ్ళబట్టీ వున్నారిక్కడ?" అడిగాడు ప్రసాద్.

"పదిహేనేళ్ళబట్టి- వస్తారా అటువైపునున్నాయి స్పెషల్ రూమ్‌లు"

"రోజుకెంత"

"ముప్పై అయిదండి- స్పెషల్ నర్సు కావాలంటే మరో ముప్పై ఛార్జి చేస్తాము. నైట్ నర్స్ అయితే ముప్పై అయిదు."

"డెలివరీకి ఎంత పుచ్చుకుంటారు?" అడిగాడు ప్రసాద్.

ఆ మనిషి-నడుస్తున్నవాడు-క్షణం ఆగి "మామూలు కాన్పయితే అయిదొందలు. 'కాంప్లికేషన్స్' అయితే కేసునిపట్టి వుంటుంది. కొందరయితే కాన్పుకి ముందే, నెలరోజులు ముందే వస్తుంటారు. ఇక్కడే వుంటే మంచిదని-డాక్టరుగారు పరీక్ష రోజూ చేస్తారని...." అన్నాడు. అతని మాటల మధ్య, గూడార్థం వుందా? పైకి అనని మాటల మధ్య నుంచి మీకు కావలసిన అర్థాలు వెతుక్కోమంటున్నాడా?

"ఇక్కడ వాతావరణం బాగుంది. చుట్టూ చెట్లూ అవీ చల్లగా వుంది ప్రశాంతంగా-అందరికళ్ళా బడకుండా- హాయిగా వుంటుంది" అన్నాడు ప్రసాద్, సాంబశివరావు వంక అర్థవంతంగా చూస్తూ.

"అయితే పదండి. కేసు వివరాలు, ఎడ్మిషన్ ఫీజూ మాట్లాడుకుందాం." అంటూ వెనుతిరిగాడు సాంబశివరావు.

"ఇక్కడివాళ్ళు అట్టే దాపరికం లేకుండానే వ్యవహారాలు నడిపేస్తున్నారు-" అనుకున్నాడు ప్రసాద్. ఆఫీసుగదిలోకి వచ్చాక- "మీ సూపరెంటుగారికి చెప్పక్కర్లేదా?" అడిగాడు ప్రసాద్-

"ఏముందండీ చెప్పటానికి? మీరు వైద్యానికి వచ్చారు-మేము వైద్యం చేస్తాం. అంతవరకే మా బాధ్యత." అన్నాడు అతను.

టేబుల్ ముందు కూచున్న ప్రసాద్ జేబులోంచి నూరు రూపాయలు తీసి-, టేబుల్ మీద పెట్టి- "ఇది ఎడ్వాన్సుగా జమ కట్టుకోండి-" అన్నాడు మామూలుగా.

అతను డ్రాయరు తాళంతెరిచి-రశీదుబుక్కు తియ్యబోతుంటే, "రసీదు దేముందిగాని- మీరు నాకో చిన్న సాయంచెయ్యాలి...." ఆగాడు.

"మేము వూరు పేరూ అంతగా పట్టించుకోము- మీకు యిష్టం లేకపోతే చెప్పకండి."

"అదికాదు- పదిలక్షల రూపాయల ఆస్తితో ముడిపడివున్న వ్యవహారం.ఇందులో మీరు కాస్త సహాకరిస్తే...." ఆగాడు ప్రసాద్- సాంబశివరావు కళ్ళు అయస్కాంతాల్లాగా నూరురూపాయల నోటు మీద కేంద్రీకృతమై వున్నాయి.

"నేనేం చెయ్యాలి?"

"అసలు విషయం చెపుతా, వినండి. మా వాడొకడు పిల్లా పాపా లేకుండా చచ్చిపోయాడు. వాడి పెళ్ళాం కూడా చచ్చిపోయింది. వారసులు లేరని- దాయాదులు ఆస్తంతా పట్టుకుపోదామని చూస్తున్నారు. వాడు బ్రతికివుండగా నాతో అన్నాడు- తనకి అక్రమంగా ఒక పిల్లవాడు కలిగాడని- అప్పట్లో తండ్రికి భయపడి యీ సంగతి బయటకి చెప్పలేదని...."

ఎదుటి వ్యక్తి చెప్పవాల్చకుండా చూస్తున్నాడు-ప్రసాద్ వంక! ఆ కళ్ళలో ఆశ్చర్యంలేదు. ఇటువంటివి సర్వసాధారణమైనట్లుగా వుంది అతని మనోభావం.

"ఇరవై ఏళ్ళ క్రితం 1964లో యిక్కడ యీ ఆస్పత్రిలో-వాడి ప్రేయసి పిల్లవాడిని కన్నదిట- ఇక్కడే పురుడు పోసుకుందిట-నాకు అప్పటి రికార్డులు కావాలి."

"ఉందేం?"

"దానిని బట్టి ఆ పిల్లవాడిని వెతికి పట్టుకుంటాను."

"ఇంకా బ్రతికి వున్నాడని ఎలా నిర్ణయిస్తారు? ఒకవేళ వున్నా, ఎలా వెతికి పట్టుకుంటారు అసలు నేనప్పుడు లేను."

"మీ దగ్గర రికార్డులు వుంటాయిగా? వెతికిపెట్టరూ- ఆ పిల్ల వాడి వివరాలు తెలిస్తే- వాడి తల్లికి యీ ఆస్తి వచ్చే అవకాశం వుంటుంది."

"ఆ అమ్మాయి మీకేమవుతుంది?"

"చెల్లెలు" అన్నాడు తడుముకోకుండా ప్రసాద్.

"పెళ్ళిచేసుకోలేదా?"

"లేదు- ఆ అనుభవంతో విరక్తి పొంది వుద్యోగం చేసుకుంటున్నది."

"ఆస్తి ఎంతన్నారు?"

"పదిలక్షలు. మీ రికార్డుల మీద ఆధారపడి వుంది-యింత ఆస్తీను! ఇది చాలా శ్రమ అయిన పని అని తెలుసు. కాని, మీకష్టం వుంచుకోను-" జేబులోంచి మరో రెండు వందరూపాయల నోట్లు తీశాడు ప్రసాద్.

అవతల మనిషి కదలటంలేదు. మరో రెండు కాయితాలు తీశాక, ఆ కళ్ళలో కాస్త చలనం కనిపించింది.

"అబ్బో. నిన్నామొన్నటి విషయమా. ఇరవై ఏళ్ళయిందంటున్నారు. పైగా నేనప్పుడు లేను కూడా. చాలా టైము పడుతుంది. మా సూపరెంటెంటు కళ్ళబడకుండా వెతకాలి. అసలా రికార్డ్సు వున్నాయో లేదో-"

"ప్రయత్నించండి. ఆస్తి మా చెల్లెలికొస్తే- మీ విషయం మర్చిపోను-"

"అంతా అల్లాగే అంటారు- తీరా సమయం వచ్చాక మమ్మల్ని మర్చిపోతారు."

"ఈ కేసులో అలా వీలవదే-రేపు కోర్టులో రికార్డు ప్రొడ్యూస్ చెయ్యాలంటే- మీకూ-మీ హాస్పటల్‌కి వేలు గుమ్మరించకుండా-అసలు కాయితం మా చేతికి వస్తుందా?" నవ్వుతూ అడిగాడు ప్రసాద్.

సాంబశివరావు కళ్ళలో ఆశ తళుక్కుమంది.

"పోనీ, ఆరోజుల్లో వున్న స్టాఫ్ మీకెవరన్నా తెలుసా? నర్సులుగాని-ఆయాలుగాని...."

"మీరు రికార్డెడ్ ఎవిడెన్సు కావాలంటున్నారు గదా- యీ నోటి సాక్ష్యాలు ఏం పనికివస్తాయి?" అన్నాడు సాంబశివరావు.

పిట్ట తప్పిపోకుండా జాగ్రత్త పడుతున్నాడు అనుకుని- "మీ రికార్డులు ఎలాగా ముఖ్యమైనవే. ఆ రోజుల్లో- కానుపుచేసిన డాక్టర్లుగాని-నర్సులుగాని...."

"డాక్టర్లు ఏడాదికంటే యిక్కడుండరండి- నర్సులుకూడా అంతా కుర్రవాళ్ళే. మరియమ్మ అని ఒక ఆయా వుంది. అది ఆస్పత్రి పెట్టినప్పటినుంచీ యిక్కడే వుండేది." అన్నాడతను. మళ్ళీ

అందుకుని. "64 సంవత్సరం అంటే-కుదరదండి-ఒకనెల యిటూ అటూగా చెప్పండి. మీ చెల్లెలంటున్నారు.... మీరే వెంట వచ్చి వుండాలి."

"ఊహు- మా పెద్దవాళ్ళు తీసుకొచ్చారట వుండండి. కాస్త జ్ఞాపకం చేసుకు చెపుతాను- జూన్ జులై నెలల్లో అనుకుంటాను. సంవత్సరం మటుకు ఖచ్చితంగా అదే. ఈ రెండునెలల రికార్డ్లు వెతకండి."

"పేరు?"

క్షణం తటపటాయించాడు ప్రసాద్. "సుందరమ్మ అని వుంటుంది- మొగపిల్లవాడు కాలువంకరతో పుట్టాడని విన్నాను. ఆరేసి వేళ్ళు...." అన్నాడు కొద్ది కొద్దిగా సమాచారం వదుల్తూ.

"రేపు మధ్యాహ్నం యీవేళప్పుడు రండి. ఈ విషయం మా సూపర్నెంటుకు తెలిస్తే నా వుద్యోగం వూడిపోతుంది. ఒక వేళ మీరొచ్చేప్పటికి ఎవరన్నావుంటే, ఈ విషయాలు ఎత్తకండి-"

"మీరు ఆయా- మరియమ్మ అన్నారే- ఆవిడ ఎక్కడుంటుంది-"

"దేనికి?" చివాలున అడిగాడు.

"అసలు ఆ పిల్లవాడు బతికివున్నాడో- వుంటే, ఎక్కడుండి వుంటాడో- యీ వివరాలకి! మీ విషయం ఎత్తను. మీకూ ఆమె చెప్పేవాటికీ సంబంధం వుండదు. ప్రమాణం చేసి చెపుతున్నాను." అన్నాడు ప్రసాద్.

అయిష్టంగానే సాంబశివరావు మరియమ్మ ఎడ్రసిచ్చాడు. ఈ మరియమ్మ రిటైరు అయిపోయి ఏడాది అయిందిట. కొడుకు దగ్గర వుంటున్నదిట. కొడుకు ప్రైమరీ స్కూల్లో సింగిల్ టీచరుగా

అక్కడికి యిరవై మైళ్ళ దూరంలో వున్న పల్లెటూర్లో పనిచేస్తున్నాడు-అతని ఎడ్రసు తీసుకుని మరియమ్మ వేటకై బయలుదేరాడు ప్రసాద్.

అది చాలా పల్లెటూరు. ఒక యాభై గడపకంటే వున్నట్లు లేదు. ఎక్కువభాగం క్రిస్టియన్స్ కనిపిస్తున్నారు-చాలా ఇళ్ళముందు శిలువ-మేరీమాత బొమ్మలు వేలాడ తీసి వున్నాయి. అక్కడికి వెళ్ళేప్పటికి-యించుమించు చీకటిపడింది. గొడ్లకాపరులు-ఆవులూ-మేకలతో యిళ్ళకు తిరిగివస్తున్నారు. మట్టిరోడ్లు. ఎర్రమన్ను-గాలిలోకి లేస్తూ పొగలా చుట్టబెడుతోంది. ఆ వూరికి కారు రావటం అరుదులా వుంది-దుమ్ము రేపుకుంటూపోతున్న ఆ కారి వంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. పిల్లలు. కారు చర్చిముందు ఆగింది-అది చాలా చిన్న చర్చి. ఒక వందమందికూడా పట్టరు. పొడవుగా చర్చి-దానిపైన క్రాసు చర్చి ముందు మేరీమాత విగ్రహం. ఆ సాయంత్రం వేళ ఒకరిద్దరు స్త్రీలు మోకాళ్ళమీద కూచుని ప్రార్థిస్తూ వున్నారు. చర్చి ఆవరణలోనే స్కూలు వుంటుందన్న సాంబశివరావు మాటలని బట్టి, కారు బయట నిలిపి లోపలికెళ్లాడు ప్రసాద్. అక్కడ అడగ్గా వెనకవైపుకి చూపించి వెళ్ళమన్నారు. చర్చి చుట్టూవున్న ప్రహరీగోడకి ఒక వైపునున్న చిన్న తలుపు తీసివుంది. ఆ తలుపులోంచి వెడితే-తాటాకులు కప్పిన యిళ్ళు రెండు కనిపించాయి. ఆకారాన్నిబట్టి-ఒకటి స్కూలు, రెండోది మాస్టరుగారి యిల్లు అయివుంటుందని వూహించుకున్నాడు. ఒక యింట్లో దీపంలేదు, రెండో యింట్లోంచి వెల్తురు కనిపిస్తూ వుంది.

"ఇక్కడ మరియమ్మగారున్నారా?" అడిగాడు బయట నుల్చుని. ఆవరణ చాలా శుభ్రంగా వుంది. రెండువైపులా కూరపాదులు. లోపలి దీపకాంతి అలికిన నేలమీద పడుతూవుంది.

'ఎవరూ?' అంటూ ఒక మధ్య వయస్కుడు వచ్చాడు లోపలి నుంచి.

"మరియమ్మగారి కోసం వచ్చాను."

"మీపేరు? ఏం పనిమీద వచ్చారు?" అడిగాడా వ్యక్తి ప్రసాద్‌ని కూచోమని అనకుండానే!

"నా పేరు వారికి తెలియదండి-ఎస్తేరమ్మ దగ్గరనుంచివచ్చాను. ఈ వూరు వెళ్తున్నానంటే మరియమ్మగారిని చూసిరమ్మన్నారు. వారిద్దరూ ఒకే ఆస్పత్రిలో పనిచేశారుట-మీరు వారబ్బాయా?" అడిగాడు ప్రసాద్ చనువుగా.

"అవునండి." అన్నాడావ్యక్తి కాస్త ఖంగారుపడుతూ.

"మీరిక్కడ టీచరని విన్నాను-యిల్లు తెలుసుకోటం కష్టం అవుతుందేమో-అనుకున్నాను. ఈ వూర్లో మీకు తెలియని వాళ్ళు లేరనుకుంటా. మేష్టారుగారిల్లు ఎక్కడా అంటే, మేము చూపిస్తాం-మేము చూపిస్తాము అంటూ పిల్లలు చుట్టుముట్టేశారు. మీకు చాలా పేరున్నట్లుంది-ఈ వూరు వాళ్లకి మీమీద గౌరవం భక్తి వున్నాయండీ."

ఈ పొగడ్తకి ఆ వ్యక్తి వుబ్బిపోయాడు. అప్పటిదాకా తటపటాయిస్తున్న అతను-"నుల్చునే వున్నారు కుర్చీ తీసుకొస్తాను-" అంటూ లోపలికెళ్ళి కర్రకుర్చీ తెచ్చివేసి, తల్లిని బయటకు రమ్మని కేకవేశాడు.

మరియమ్మ బొద్దుగా నల్లగా-గున్న ఏనుగులాగా దొర్లుకుంటూ వచ్చింది లోపలినుంచి. తెల్లని బట్టలు-పండిపోయిన జుట్టు. వృత్తిని వొదిలిపెట్టినా వాళ్ళుమటుకు ఆ వృత్తి తాలూకు చిహ్నాలు వదలరు కాబోలు. ఈ తెల్లబట్టలు ఎస్తేరమ్మా వేసుకుంది.

"నేను ఎస్తేరమ్మగారి వద్దనుంచి వచ్చానండి." అన్నాడు ప్రసాద్.

"ఏ ఎస్తేరమ్మా" అడిగిందామె.

"అదే, మీరు పిల్లవాడిని పెంపకానికిచ్చారు, ఆవిడ! పిల్లవాడూ తనూ క్షేమంగా వున్నామని చెప్పమంది. మీ పేరు చెప్పుకుని రోజూ ఏసుప్రభువు దగ్గర కాండిల్ వెలిగిస్తూ వుంటారు" అన్నాడు ప్రసాద్.

మరియమ్మ ముఖంలో సంశయాలు-భయాలు పటాపంచలయి పోయాయి. అక్కడే మట్టి అరుగుమీద కూలబడి "పిల్లవాడు చదువు కుంటున్నాడా? కాలు బాగుచేయించారా? ఎస్తేరమ్మ కూతురు వుండాలి కాబోలు-పెళ్ళి చేసిందా?" ప్రశ్నలు మొదలుపెట్టింది.

మరియమ్మ యిరవై ఏళ్ళనాటి విషయాలు ఏవీ మర్చిపోలేదు. "పాపం, మొగుడుపోయి, పుట్టెడు దుఃఖంలో వుంటే, యీ పిల్లవాడిని వాళ్ళో వేశానండి-పిచ్చిదండి. వాడిని చూసుకుని, తన దుఃఖం దిగ మింగుకుంది. పిల్లవాడు ఎలా వుంటాడు. ఎర్రగా దొండపండులా వుండాలే, వెధవ పన్నెండువేళ్లూ వాడూను-బొద్దుగా...." అడిగింది

"తెలుపేనమ్మా-చాలా మంచివాడు సాధువు. వాడిపై పెదవిమీద తొర్రె వుందని మీరు కనిపెట్టలేకపోయారా?" అడిగాడు ప్రసాద్ సమాచారం బయటకి లాగాలని.

"మూడునెలల గుడ్డండి-ఏం తెలుస్తుంది? పెసరగింజలా పై పెదిమమీద వుంటే, అది పురుపుడు కాయ అనుకున్నాను-అది తొర్రె అయిందా, పాపం? కుట్టించలేదా? అయినా మాలాంటి బీదవాళ్ళకి అవ్వేం కుదురుతాయి? అంతావుండి-వాళ్ళవాళ్ళు ఆ పసిగుడ్డుని వొదిలి పోయారే! మాలాంటి వాళ్ళం ఏం చేస్తాం?"

"పిల్లవాడిని పెంచమని పదివేలు ఇచ్చారటగా,"

మరియమ్మ భయంతో యిటూ అటూ చూసింది-జవాబుకి తడుముకుంటూ వుంది.

"మీరేం భయపడకండి-పిల్లవాడి తల్లి మాకు దగ్గర బంధువు-ఆవిడే చెప్పింది."

"పదివేలు కాదండి. అయిదువేలు యిచ్చారు. ఈలోగా ఎస్తేరమ్మ కష్టం చూసి వోర్చుకోలేక-నేనూ పెంచలేక, యిచ్చానండి. ఆ డబ్బుకూడా ఎస్తేరమ్మకే అప్పజెప్పేశాను." అంది మరియమ్మ ఖంగారుపడుతూ. ప్రసాద్ ఆ విషయం తరిచి అడగదలుచుకోలేదు. మరియమ్మ-పిల్లవాడిని అమ్మింది-అయిదువేలు సుందరమ్మగారినుంచి తీసుకుని అది గుటుక్కున మింగేసి_వాడిని రెండొందలకి అమ్మింది. మరియమ్మ అబద్దాలు చెపుతోందని తెలుసు.

"పిల్లవాడు వుద్యోగం చేస్తున్నాడా? మంచి ప్రయోజకుడై వుండాలే-"

"చేస్తున్నాడు. నెలకి ఆరొందలు సంపాయిస్తున్నాడు- బి.ఎ. పాసయ్యాడు." అబద్ధాలు పేరుస్తూ కట్టుకథ చెప్పుకు పోతున్నాడు ప్రసాద్. ఆ పిల్లవాడు ప్రయోజకుడయితే, మరిమయ్మకి అపరాధం చేశానన్న భయం తగ్గుతుంది. అప్పుడే వాడి పుట్టు పుర్వోత్తరాలు పూర్తిగా రాబట్టవచ్చు.

"ఏదో నేను, సుఖపడతాడని యిచ్చాను. వాడు పెద్దవాడయి తల్లినీ-అక్కనూ పోషిస్తున్నాడు." అంది మరియమ్మ తృప్తిగా.

"ముందే చెప్పానుకదమ్మా-మీపేరు చెప్పుకుని, దీపం వెలిగించుకుంటారని! అయితే అంత ముద్దొచ్చే పిల్లాడిని ఎల్లా వొదిలారమ్మా—ఆ తల్లికి మనసెలా వచ్చింది?" అడిగాడు సాయిలా పాయిలాగా.

"మీకేదో ఆశ్చర్యంగా వుందిగాని మాకిది అలవాటేనండి. ఆ ఆస్పత్రికొచ్చే కేసుల్లో సగం యిల్లాంటివేనండి-అందుకే అన్ని మేడలు కట్టారు వాళ్ళు."

"ఎవరు?"

"మా సూపర్నెంటు. ఇక్కడయితే అందరికీ తెలుస్తుందని,

డబ్బంతా మద్రాసు తర్లించి, రెండు పెద్దమేడలు కట్టాడు. ఇద్దరు కొడుకులూ అమెరికాలో వున్నారు. అదృష్టం అందీ. ఆ ఆస్పత్రి మొదలుపెట్టినప్పుడు ఎలా వున్నానో-ఇప్పుడూ అలాగే వున్నాను. నేను ఆయాని-ఆయన డాక్టరు. వుచ్చలూ. పీతుళ్లూ-మైలలూ మేము ఎత్తిపోస్తాం. అసయ్యం లేకుండా - వారేమో డబ్బూ పేరూ సంపాయించుకుంటారు-అంతేనండి." కసిగా అంది మరియమ్మ.

"మీకు జీతాలు బాగా యిచ్చేవారు కాదా?"

"ఎక్కడండి. ఆయా అంటే అందరికీ లోకువే. కడుపు వుబ్బుకొచ్చినపుడు తప్ప, మేం జ్ఞాపకంరాము. ముష్టి ఎనభైరూపాయలు యిచ్చేవారు రిటైరు అవమన్నారు- అయాను. ఒక వెయ్యి చేతిలో పెట్టారు-అంతేనండి" తను అయిదువేలూ కొట్టేసినందుకు సమర్థించుకుంటూ కారణాలు చెపుతోంది.

"ఈ పిల్లవాడి తల్లిదండ్రులు ఆస్పత్రికి పెద్ద మొత్తంమీదనే దానం ఇచ్చారని విన్నాను."

"ఇచ్చినా, మీకు చెప్పరండి. కాని అప్పుడు తండ్రివెంట లేడండి. ఉంటే, యీ దొంగ చావెందుకు?" అడిగింది మరియమ్మ.

"మరి ఎవరొచ్చారు? ఆవిడకు పెళ్ళి అయిందిగా?"

"లేదు. తల్లీకూతుళ్లూ వచ్చారు."

ప్రసాద్ వులిక్కిపడ్డాడు. ఇద్దరూ స్త్రీలే. తాను యింతదాకా యీ గాథలో ఒక్క స్త్రీయే వుందనుకుంటున్నాడు. చటుక్కున జేబులో చెయ్యిపెట్టి నూరురూపాయల నోటుతీసి, "ఆ మాటల్లో మర్చిపోయాను. ఎస్తేరమ్మ మీకీ నోటు యివ్వమంది. రాబీ, అంటే తన కొడుకు మొదటి జీతంలో, మీకోసం దాచిందట. మీకు యిమ్మని చెప్పింది. మొదటిలోనే యిద్దామనుకుని మాటల్లోపడి మర్చిపోయాను" అన్నాడు ప్రసాద్.

మరియమ్మ వద్దనలేదు-గంతేసి తీసుకుంది, హక్కు వున్నట్లు తీసుకుంది.

"ఎస్తేరమ్మ-మంచి మనిషండి. ఉత్త అమాయకురాలు-పాపం, విశ్వాసంతో జ్ఞాపకం ఉంచుకు పంపింది" అంటూ, చెంగున ముడేసుకుంది. కొడుకు చేతికి ఆ డబ్బు యివ్వలేదు-అది గమనించాడు ప్రసాద్. ఈ నూరురూపాయల నోటు చాలా మాట్లాడుతుంది. కావలసినన్ని విషయాలు సేకరించ వచ్చు అనుకున్నాడు.

"ఇద్దరు స్త్రీలొచ్చారంటున్నారు. పిల్లలు వెంట రాలేదా?"

"పిల్లలు ఎవరూ లేరండి. తల్లీకూతుళ్ళు వచ్చారు. ఆ తల్లి కోడిపెట్టలా కూతుర్ని కాపాడుతుండేది. మమ్మల్ని మాట్లాడనిచ్చేది కాదు."

"అమ్మాయి పేరు జ్ఞాపకంవుందా?"

"సుందరీ అని పిల్చేది తల్లి. ఆ పిల్ల బొమ్మలాగా - పిచ్చిదానిలాగా కళ్ళప్పగించి చూస్తూండేది."

"ఎన్నేళ్ళు?"

"పదిహేనుకూడా వుండవనుకుంటా. సన్నగా పూచిక పుల్లలా వుండేది. అసలు తను గర్భిణితో వున్నానని కూడా ఆ పిల్లకి తెలియనంత వెర్రిబాగులుగా వుండేది."

"చదువుకోలేదా?"

"చదువుకుందనే అనుకుంటా. మధ్య మధ్య ఇంగ్లీషులో చకచక మాట్లాడేది తల్లితో. మళ్ళీ రోజుల తరబడి నిశ్శబ్దంగా వుండిపోయేది."

"ఎన్నాళ్ళున్నారు?"

"నెల్లాళ్ళండి- చివరికి ఏమైందో తెలుసా?" అడిగింది

మరియమ్మ. వుద్యోగంలోంచి రిటైరు అయినవాళ్ళు తమ గత జీవితాన్ని గురించి చెప్పటం మొదలుపెడితే తిప్పివుంచిన పంపు నీళ్ళలాగా ఆగరు-అలా చెప్పుకుపోతూనే వుంటారు.

"ఆ పిల్ల చాలా బలహీనంగా వుండేది. డాక్టరుగారు బాగా ఎక్సర్‌సైజు చెయ్యమనేవారు. షికారుకి వెళ్ళమనేవారు. కాని తల్లిగాని-పిల్లగాని వినిపించుకునేవాళ్ళుకాదు. అలా పక్కమీద పడుకుని వుండేది ఆ అమ్మాయి."

"తల్లికూడా ఏం మాట్లాడేది కాదా?"

"మాట్లాడకేం? చాలా మంచి ఆవిడ. తమ కుటుంబం గురించి మాత్రం-చాలా రహస్యంగా వుంచేది. ఏ వూరు అని గాని-భర్త పేరు గాని, యీ అమ్మాయికి పెళ్ళి అయిందో లేదో-యిటువంటివి ఒక్క మాట కూడా బయటికి అనేదికాదు"

"మరి యింకేం మాట లుంటాయి?" అడిగాడు ప్రసాద్. అతనికి యీ కేసు విచిత్రంగావుంది. అందులోనూ ఒక స్త్రీ తన భర్తా పిల్లలూ గురించి పైకి చెప్పకుండా, అంత గుంభనగా ఎలా వుండగలిగింది? స్త్రీలకి సహజమైన యీ బలహీనత నుంచి ఎలా తప్పుకోగలిగింది?

"అయ్యో! చాలా మంచి మనిషండీ. హాస్పిటల్‌లోని అందరి క్షేమ సమాచారాలు అడిగేవారు. కష్టం, సుఖం వినేవారు. మా అందరికీ అవసరం అయితే అయిదూ పదీ యిచ్చేవారు"

"దానిదేముందిలేండి. ఎంతమంది చేబదుళ్ళు యివ్వరు?"

"అబ్బే-చేబదుళ్ళు కాదండి. అవసరానికి యిచ్చేవారా-తిరిగి తెచ్చిస్తే పుచ్చుకునేవారు కాదు. ఒకసారి యాభై రూపాయలు-పీకల మీదకొచ్చి అడిగి పుచ్చుకున్నాను. జీతం వచ్చాక తిరిగి యివ్వబోతే వద్దన్నారు." అంది మరియమ్మ.

ఇది సగం అబద్ధం-సగం నిజం అనుకున్నాడు ప్రసాద్. మరియమ్మ అప్పు తీసుకుని వుండచ్చు. మళ్ళీ తిరిగి యివ్వడమన్నది సర్వాబద్ధం.

"ఇంతకీ ఆ అమ్మాయికి ఏం జబ్బన్నారు?" అడిగాడు ప్రసాద్.

మరియమ్మ కళ్ళు ఆ దీపకాంతిలో తళుక్కున మెరిసాయి-ఈ వచ్చిన మనిషి వుత్త పిచ్చివాడన్నట్లుగా చూపింది.

"ఏం జబ్బుంటుందండి? ఈ డబ్బుగల వాళ్ళందరికీవున్న జబ్బే. బాగా తిని-అదుపూ ఆజ్ఞా లేకుండా తిరుగుతుంటారు. కడుపొచ్చింది! గుట్టు చప్పుడు కాకుండా యిక్కడికి తీసుకొచ్చేశారు."

"ఇల్లా చాలామంది వస్తూంటారా?"

"అదేదో రామాయణం అంతా విని-రాముడికి సీత ఏమవుతుందని అడిగాడుట-అల్లా వుంది మీరు అడగటం-అసలు వచ్చేవన్నీ యిల్లాంటి కేసులేనండి! బాగా డబ్బుంటుంది, ఆ వచ్చిన బరువుని ఎలాగోల్లా వదిలించుకోవాలిగా-అందుకని యిక్కడి కొస్తూంటారు"

"ఇంతకీ-తల్లి పేరు చెప్పారు కాదు"

"ఉండండి. కూతురు పేరు సుందరండి. ఆవిడ పేరు లక్ష్మీదేవి అని కాబోలు గుర్తు. అవునవును. లక్షమ్మగారు అని పిల్చేవారం. నిజంగా లక్ష్మీదేవిలాగా ఉండేది. దబ్బపండులా ఛాయ. నవ్వుతూ-మంచి ఠీవిగా వుండేది."

"కూతురు!"

"తల్లి పోలిక రాలేదండి. సన్నగా చామన చాయతో వుండేది. ఎప్పుడూ నల్లమందు తిన్నట్టు పడివుండేది"

"మత్తు మాత్రలు వేసుకునేదా?"

మరిమయ్య విసుగ్గా చూసింది ప్రసాద్ వంక. ఆ కళ్ళలో భయం. పట్టుబడిపోయానేమోనన్న సంశయం. జవాబు చెప్పకుండా వూరుకుంది. ఈలోగా, ఆ పక్కనే అరుగుమీద కూచున్న కొడుకు లోపలికి వెళ్ళాడు. తమ సంభాషణ అంతా నిశ్శబ్దంగా, బొమ్మలా వింటున్నాడు. అసలు ఆ మనిషి వునికినే మర్చిపోయాడు ప్రసాద్. ఇదే అదను అనుకుని-డబ్బున్న జేబు మీద చెయ్యి వేసి - మరిమయ్మ వంక అర్థవంతంగా చూస్తూ- "ఈ మత్తు మాత్రలు వేసుకోటం ఈ రోజుల్లో అందరికీ సాధారణమైపోయింది. చిన్నపిల్లలు మరీని" అన్నాడు నోటు చేతిలోకి తీసుకు పట్టుకుని.

మరియమ్మ చెయ్యి ఆ చీకట్లో కదిలింది. మళ్ళీ-వెనక్కి లాక్కుని, "నిజంగా చెపితే ఆ అమ్మాయిది ఏం లేదండి. తల్లి మా చేత మాత్రలు తెప్పించేవారు. కాంపోజ్-మాండ్రెక్సు ఇవి నర్సుల చేతా నాచేతా తెప్పించుకునేది రహస్యంగా"

"ఆవిడ వేసుకునేదేమో? రాత్రిళ్ళు నిద్రపట్టక తెప్పించుకునే వారేమో"

"ఊహు. ఆ అమ్మాయికి యిస్తూండేది. మధ్యాహ్నం కూడా యిస్తుండేవారు, ఎప్పుడూ మత్తుగా నిద్రపోతూండేది"

"దేనికి?"

"బహుశా-తమ గురించి అందరికీ చెపుతుందని భయమేమో!"

"పొట్ట ఎత్తుగా కనిపిస్తుంటే అందరికీ తెలియదా?"

"అది ఎలాగూ దాచరు. కాని యిక్కడికొచ్చిన వాళ్ళు, తమ అసలు పేర్లూ-ఎడ్రసూ చెప్పరు. దొంగపేర్లు చెపుతారు. లక్ష్మమ్మ గారు-కూడా అంతే-"

"మీకెలా తెలుసు?"

"ఆవిడ యిచ్చిన ఎడ్రసుకి వుత్తరం రాశాను-అలాంటి వాళ్ళు

ఎవరూ లేరని-వెనక్కి వచ్చేసింది." అంది మరియమ్మ.

చేతిలో నోటుని ముందుకు జాచి-"చాలా విషయాలు చెప్పారు. మీ టైము వృధా చేశానేమో-లోపల పనివుందో ఏమో" అంటూ నోటు అందించాడు.

అది గబుక్కున తీసుకుని జాకెట్‌లో దాచుకుని. "ముసలి ముండని నాకేం పని అండీ. చేసినన్నాళ్లూ వుచ్చలూ పీతుళ్ళూ ఎత్తి నానాచాకిరీ చేశాను. ఇంతచేసీ నాలుగు డబ్బులు వెనకేసుకోలేక పోయాను. ఈ లోకంలో కృతజ్ఞత చచ్చిపోయిందండీ. తమ పేరూ, ప్రతిష్టా కాపాడుకొంటానికి - రహస్యంగా యిక్కడి కొస్తారు. ఆ టైములో మేము కన్న తల్లికంటే ఎక్కువగా సేవచేస్తాం. ఇక్కడి నుంచి వెళ్ళిపోయాక-ఒక్క ఉత్తరం ముక్క రాయరు. మా మొహా లేవో పాపిష్టివన్నట్లు చూస్తారు-పాపం చేసేది వాళ్ళును-మొహంచాటు చేసుకునేది మేమూను-"

ప్రసాద్ సానుభూతిగా శబ్దంచేశాడు పెదిమల్తో.

"లక్ష్మీదేవమ్మగారు కూడా అంతేనండి-ఆ పిల్లకి రహస్యంగా మాత్రలు తెచ్చేదాన్ని. కుక్కలాగా విశ్వాసంగా వాళ్ళు చెప్పిన వెధవ పనులన్నీ చేసేదాన్ని...."

"ఏం చేశారు?"

"ఎందుకులెండి. ఎవరి పాపాన వాళ్ళు పోతారు. వెళ్లాక ఒక్క వుత్తరం ముక్క-ఎంతో అవసరంలోవుండి డబ్బు కావాలని రాశా నండి-జవాబులేదు. విశ్వాసం లేని వాళ్ళండి."

"పంపలేదా?"

"ఉత్తరం తిరిగి వచ్చిందని చెప్పానుగా."

"లక్ష్మమ్మగారు యిక్కడెన్నాళ్లున్నారు"

"నెల్లాళ్ళున్నారండి."

"వారికోసం ఎవరన్నా వచ్చేవారా?"

"అవన్నీ ఎందుకుల్లేద్దురూ-ఇక్కడికొచ్చే కేసులన్నీ అల్లాంటివే." అంది జవాబు చెప్పకుండా తప్పించుకుంటూ.

ఈ మరియమ్మకి డబ్బు వాసన సోకింది. కుక్కలా పసికట్టింది. కళ్ళముందు నోట్లు రెప రెపలాడిస్తే తప్ప-సమాచారం బయటకిరాదు. ఉదయంనుంచీ ప్రయాణం చేసివున్న ప్రసాద్‌కి-కొత్త శ్రమగానే వుంది. వొళ్లు చితచితలాడుతోంది. రేపు ఎల్లాగా వుండిపోవాలి యీ వూళ్ళో. మరోసారి వచ్చి మిగతా విషయాలు కనుక్కుంటేనో!

"రేపు ఎన్నింటికి యింట్లో వుంటారు?" అడిగాడు.

"నాకేం పనా పాటా. ముసలిముండను. తిండిదండగ తప్ప-నేను చేసే నిర్వాకం ఏముంది? ఏదో మీలాంటి బాబులు వస్తే-తెలిసీ తెలీక వాగుతూంటాను. పది గంటలకి రండి. నే నెక్కడికి పోతానండి-కాటికి తప్ప! నాకు వెళ్ళేదారి లేదండి" అంది మరియమ్మ- యింటి లోపలివైపుకి చూస్తూ బిగ్గరగానే.

"అదేమిటి అలా అంటారు? మీకు వంట్లో శక్తి వుందిగదా! ఉద్యోగం ఎందుకు మానేశారు."

"అరవై ఏళ్ళు వచ్చిన ముండని. ఎవరిక్కావాలండీ తిండి దండగ తప్ప."

"మా వూళ్లో చిన్నపిల్లల బడి వుంది-అందులో నమ్మకం అయిన ఆయా లేక తిప్పలు పడిపోతున్నారు. 'అక్కడికి రాకూడదా? నెలకి నూట యాభై యిసారు."

"నిజంగా యిప్పిస్తారా? ఏదో ఓ చిన్న గదిలో వుడకేసుకు తిని ఉంటాను-"

"అదేం యిబ్బంది ఉండదు. కమిటీవారే స్కూల్ కాంపౌండులో ఆయా కోసం చిన్నపాక వేశారు-అందులో వుండొచ్చు రేపొచ్చినపుడు వివరాలన్నీ చెపుతాను" అంటూ ప్రసాద్ లేశాడు. తాను వచ్చి అబద్ధాలు చెప్పి, ఈ ముసలిదాన్ని మోసగిస్తున్నానని తెలుసు. కాని, మనిషి ఆశకు, ధనానికి దాసుడు. ఈ రెండు చూపిస్తే ఎంతవారూ కరిగి-నీరై పాదాక్రాంతులవుతారు. అందులోను ఈసమాజంలో ఒక రకం ఈ రెంటికీ దాసాను దాసులు అవుతుంటారు. ఈ మరియమ్మను లొంగదీసుకుని-సమాచారం రాబట్టటానికి యిదే మార్గం. ప్రసాద్ కుర్చీలోనుంచి లేచాడు.

బస్తీ-పల్లెగాని రామాపురంలో లాడ్జింగ్ హౌస్‌లు- అన్ని హోటళ్ళకి మల్లేనే మురిగ్గా-రంగు వెలిసిన గోడల్తో ఉన్నాయి. గదిలో యినప మంచం- పీచు పరుపు. దానిపైన రజాయిలా వున్న పల్చని ఫోమ్ పరుపు. పైన వుతికిన దుప్పటి పరిచినా-దానిపైన కాఫీ మరకలు-

ప్రసాద్ మధ్యాహ్నం వెళ్ళిన హోటల్‌గాక-మరో హోటల్ కెళ్ళి భోంచేసి వచ్చాడు డ్రయివర్ కారులోనే పడుకున్నాడు. అతను రాత్రి పదింటివేళ రూముకి తాళంపెట్టి-పోస్టాఫీసు కెళ్ళాడు- డాక్టర్ మూర్తికి ఫోన్ చెయ్యటానికి. ఆ సమయంలో టెలిగ్రాఫ్ క్లర్క్ నిద్రపోతున్నాడు బల్లమీద పడుకుని. అతన్ని లేపి-ట్రంక్‌కాల్ బుక్ చేసి, పక్క బెంచిమీద కూచున్నాడు-మధ్యాహ్నం నుంచీ సేకరించిన

సమాచారాన్ని క్రమానుగతంగా పేర్చుకుంటూ! ఈ విషయాలన్నీ జిగ్‌జాగ్ పజిల్‌లా కత్తిరించిన బొమ్మలో భాగాలులాగా వున్నాయి-అన్నీ అతి జాగ్రత్తగా పేరిస్తే తప్ప ఒక స్వరూపంరాదు.

ఈ మరియమ్మ మాటల్నిబట్టి చూస్తే, రాబీ సుందరమ్మగారిక్కి కలగలేదని స్పష్టం అవుతోంది. అయితే సుందరమ్మగారి కూతురికి కలిగి ఉంటాడన్నమాట. సుందరమ్మ భౌతిక కాయం పక్కన కూచున్న స్త్రీలలో-కూతురు ఎవరు? పేరు ఏమిటి? ఇంత జరిగాక ఆ పిల్లకి పెళ్ళి ఎలా చేయగలిగారు? ఈ విషయాలు రావుగారికి తెలుసా? ఆయన ఈ ఆస్పత్రికి ఎందుకు రాలేదు? అసలు యిదంతా ఎలా జరిగింది?

అరగంట తరువాత 'కనెక్షన్' వచ్చింది. అవతల నుంచి డాక్టర్ మూర్తి కంఠం.

"హలో—మీ దగ్గరనుంచి కాల్ వస్తుందని ఇందాకటి నుంచీ ఎదురు చూస్తున్నాను. ఏమైనా విషయాలు తెలిశాయా?"

"తెలిశాయి. ముందు ఈ ప్రశ్నలకి జవాబు చెప్పండి. రావుగారికి ఎంతమంది కూతుళ్ళు."

"ఒక్కర్తే-పేరు పంకజం అని జ్ఞాపకం."

"ఎన్నేళ్లుంటాయి?"

"ముఫై పైనే. అనుకుంటా. నిన్న మనం వెళ్ళినపుడు అక్కడే ఉంది. వాళ్ళాయన స్టేట్స్‌లో ఉన్నాడు."

"ఆహా" అనుకుని-మరో విషయం. రావుగారు ఏ సంవత్సరంలో జర్మనీ వెళ్ళారో జ్ఞాపకం ఉందా!"

"ఉండండి. నేను వూరికే కూచోలేదు. కామన్ ఫ్రెండ్స్‌ని అడిగాను. 63 నుంచి 65 ఆఖరుదాకా జర్మనీలో ఉన్నారట-మూడేళ్ళు" అన్నాడు డాక్టర్ మూర్తి.

"అయితే మన అంచనాలు తప్పు."

"ఏమిటి?"

"రాబీ ఆమె కొడుకుకాదు-మనుమడు-" అన్నాడు ప్రసాద్.

"మైగాడ్-" అన్నాడు మూర్తి ఏమీ అనలేక.

"నేను రేపంతా యిక్కడే ఉంటాను. ఏమన్నా అవసరం ఉంటే-ఈ నెంబరుకి పి.పి. చెయ్యండి. మరీ అవసరం అయితే తప్ప చేయవద్దు" అంటూ ఫోన్ పెట్టేశాడు ప్రసాద్.

అతనికి చనిపోయిన సుందరమ్మగారిమీద లోలోన గౌరవం కలుగుతూ వుంది. మామూలు సంసార పక్షమైన-గృహిణి భర్త పరాయి దేశంలో ఉండగా-యింత తతంగం ఎలా నడప గలిగింది? ఇంత జరిగాక-ఆ పిల్లకి పెళ్ళి ఎలా చెయ్యగలిగింది? ఆలోచిస్తూ-అలా హోటల్కొచ్చాడు. వరండాలో రూమ్‌బాయ్. వాడి కళ్ళలో ప్రశ్నలు. ఒక మాదిరి బస్తీల్లోని ఈ లాడ్జింగ్ హౌసుల గురించి ప్రసాద్ విని వున్నాడు.

"నాకేం పనిలేదు-తెల్లవారి నేను పిలిచేదాకా 'డిస్టర్బ్' చెయ్యకు వెళ్ళు" అన్నాడు కటువుగా. వాడు మెల్లిగా జారుకున్నాడు అక్కడ నుంచి.

పక్కమీద పడుకున్నాడేగాని ప్రసాద్‌కి నిద్ర రావటంలేదు. కొత్త ప్రదేశం-మురికిగా-అసహ్యంగావున్న పరిసరాలు. తనకి ఏమీ సంబంధంలేని, విచిత్రమైన జీవిత గాథలు. తాను దేనికి ఈ పరిశోధన ప్రారంభించాడు? ఎందుకోసం? లోపలికి వెళ్ళిన కొద్దీ-పుల్లిపాయ పొరలులాగా కొత్త కొత్త విషయాలు బయట పడుతున్నాయి. సుందరమ్మగారు-చాలా సాహసవంతురాలైన వ్యక్తిలా ఉంది. మరో స్త్రీ

అయితే-కూతుర్ని చావబాదును- చచ్చిపొమ్మనును-గర్భ విచ్ఛిన్నం కోసం ప్రయత్నించును,కూతుర్ని మోసగించిన వాడికిచ్చి పెళ్ళిచేసి-హిందూ ధర్మాన్ని,పవిత్రత నిలబెట్టి ఉండును. ఇవేం చెయ్యకుండా మామూలు బాటకాక, విభిన్నంగా ఎలా ప్రవర్తించ గలిగింది? పైగా ఆస్పత్రిలో కూతురికి తనపేరుపెట్టింది-ఆ పేరుతో పిల్చేదిఅంటోంది మరియమ్మ. ఇంత పకడ్‌బందీగా అన్ని ఏర్పాట్లూ చెయ్యగలిగిన-యీ స్త్రీ-ఆ పసివాడిని ఎందుకు అలా అనాధగా వదిలి వెళ్ళిపోయింది? సుందరమ్మగారి స్వభావాన్ని బట్టిచూస్తే-ఆమె హృదయం వున్నవ్యక్తి లాగా-మెత్తని స్వభావంగల స్త్రీలాగా అనిపిస్తున్నది. అలాంటప్పుడు ఈ అవిటి పిల్లవాడిని యింత నిర్దాక్షిణ్యంగా ఎలా వదిలింది?

పైగా వాడిని పెంచటానికి అయిదువేలు యిచ్చిందని-మరియమ్మ తన నోటితోనే వొప్పుకుందే. దీనిని బట్టిచూస్తే-సుందరమ్మ గారు డబ్బుకి కాపీనం పడే మనిషి కాదని, ఆర్థిక స్వాతంత్ర్యంగల గృహిణి అనీ స్పష్టమవుతోంది. ఇంత తెలివైన స్త్రీ-భర్తనివొప్పించి ఏదో ఒక కథ చెప్పి ఆ నిర్భాగ్యుడ్ని-తీసుకెళ్ళి పెంచుకోలేక పోయిందా? ఎందుకు చెయ్యలేదు? ఏ కారణాలు అడ్డు వచ్చాయి? ఆ తరువాత పంకజం జీవితం ఎలా మామూలుగాటిలో పడింది? ప్రసాద్ బుర్ర ప్రశ్నలమయంగా ఉంది. కనురెప్పలు మూసుకుని వున్నా అతని మనసు నిద్రపోనంటున్నది. మరునాడు హాస్పటల్‌కి వెళ్ళాలి. ఆ రికార్డులలో-తండ్రి పేరు ఉంటుందేమో। ఉంటే అదిమటుకు అసలు పేరయి ఉంటుందని గ్యారంటీ ఏమి? ఈహాస్పటల్ రికార్డులో-తండ్రి పేరు తప్పు అయివుండచ్చు-కనీసం పుట్టింది ఆడో మొగో తెలుస్తుందిగా. పిల్లవాడి శరీరపు గుర్తులు ఉండొచ్చుగా. దానినిబట్టి ఆ పిల్లవాడు రాబీ అవునో కాదో నిశ్చయించుకోవచ్చు.

ఇరవై ఏళ్ళ తరువాత-ఆ పిల్లవాడిని సుందరమ్మగారు గుర్తించ గలిగినపుడు, ఆ పుట్టినవాడు రాబీకాక ఎవరవుతారు? తప్పకుండా రాబీయే. హాస్పటల్ రికార్డుల్లో కొత్త విషయాలు బయట పడతాయన్న ఆశలేదు ప్రసాద్‌కి. అయితే తను నాలుగొందలు క్లర్క్-మేనేజర్‌కిచ్చాడు. అతను రాత్రంతా కూర్చుని పాత రికార్డులు వెతికివుంటాడు. ఇంత శ్రమపడి వెతికితే-తాను రాకపోతే ఆ సాంబశివరావుకి కోపం రావచ్చు. ఎక్కడో ఇరవై ఏళ్ళ క్రితం జరిగినది. రికార్డు రూమ్‌లో అడుగున పడివున్న విషయాన్ని బయటకి లాగి, తాను తేనె తుట్టెను కదిల్చాడు. ఆ ఈగల్తో ప్రయోజనం లేదని వదిలేస్తే అవి కుట్టే ప్రమాదం వుంది. అందుకని తప్పకుండా మరునాటి మధ్యాహ్నం వెళ్ళితీరాల్సిందే అని నిశ్చయించుకున్నాడు. అప్పటికి అతని మనసు కుదుటపడింది. కొద్ది కొద్దిగా నిద్రమత్తు ఆవహించింది. రెండు గంటలు కొట్టటం లీలగా అతని చెవుల్లో పడుతుండగా నిద్రలోకి జారు కున్నాడు ప్రసాద్.

ఆ మరునాడు అతను ఆస్పత్రికి వెళ్ళేప్పటికి సాంబశివరావు విజయగర్వంతో ఎదురు తెన్నులు చూస్తున్నాడు. అతను డ్రాయర్లోంచి పాత ఫైలు బయటికి తీశాడు.

1964 జులై ఆరోతేదీన మొగపిల్లవాడి జననం నమోదయి వుంది రికార్డులలో తల్లి పేరు సుందరమ్మ-తండ్రి పేరు కె.యస్. రావు అది తొలికాన్పు. పుట్టిన పిల్లవాడికి కుడిపాదం మెలిక పడి వుందన్న గుర్తు, రెండు చేతులకు ఆరేసి ⟨ ⟩ వున్నాయన్న గుర్తులు వివరింపబడివున్నాయి. డెలివరీ సహజమైనదా-తేలిగ్గా వచ్చిందా అన్నదానికి 'సిజర్' అని నర్సు రాసిన ముక్క కూడా నోట్ చేసుకున్నాడు ప్రసాద్.

సాంబశివరావుకి ధన్యవాదాలు చెప్పి, ఈ వివరాలు ముందు ముందు కేసులో ముఖ్య ఆధారాలు అవుతాయని, అప్పుడు పెద్ద మొత్తంలో అతనికి డబ్బు ముట్టచెప్పగల అవకాశం వుందనీ ఆశ

పెట్టి బయటపడ్డాడు ప్రసాద్. ఈసారి తన చెయ్యి తడి అవనందుకు కాస్త నిరాశ చెందినా, సాంబశివరావు ఉత్తరోత్తరా రాబోవు డబ్బు గురించి సంతోషపడుతూ కారు దాకా సాగనంపాడు ప్రసాద్‌ని.

# 6

సాయిప్రసాద్ కోసం ఉత్సాహంగా ఎదురు చూస్తూ కూచుని ఉంది మరియమ్మ. ఆమెకి-కొడుకు యిల్లూ, కోడలి పద్ధతులూ నచ్చటం లేదు-చేతులో డబ్బులు ఆడటం లేదు. కొడుక్కి తెలియకుండా దాచుకున్నా, కోడలు తన మొగుడికి నూరిపోసి, కూరా నారా అంటూ ఉన్న చిల్లరకాస్తా లాగేసుకుంటున్నది. అనుకోకుండా రెండొందలు చేతికొచ్చి పడ్డాయి-పైగా వుద్యోగం ఇప్పిస్తానంటున్నాడు. నర్సరీ స్కూలు పిల్లల్ని చూసుకోటం అంటే పెద్ద కష్టం వుండదు. బెడ్ పాన్‌లు మొయ్యక్కర్లేదు. శరీరంలో శక్తి ఉన్నంతదాకా అక్కడే కాలక్షేపం చెయ్యవచ్చు. క్రితంరాత్రి కంటే భయభక్తులతో-నమ్రతగా కూచుని ఉంది మరియమ్మ.

సాయిప్రసాద్‌ని చూడగానే లేచి నుల్చుంది కూడాను.... అది చూసి తనలో తాను నవ్వుకున్నాడు....నిన్న సాయంత్రం మధ్యలో ఆగిపోయిన సంభాషణని, ఎలా ముడి పెట్టాలా ఈనాడు? అని ఆలోచిస్తున్నాడు.

"ఇక్కడ చల్లగా బాగుంది" అన్నాడు ప్రసాద్.

"ఏం బాగుందో, ఏమిటో-సంపాయించుకు స్వతంత్రంగా బతికినవాళ్ళు-ఒకళ్ళ మోచేతికింద వుండ లేరండీ .. ఎంత కొడుకయినా-కోడలయినా సంపాదన లేకపోతే లెక్క చెయ్యరండి."

"నేను వెళ్ళగానే-మీకు వుద్యోగం ఏర్పాటు చేస్తాను. వాళ్ళకి మనిషి కావాలి-మీకు పని కావాలి" అన్నాడు ప్రసాద్.

"చిత్తమండి" అంది మరియమ్మ వినయంగా.

"మీకు ఆస్పత్రివాళ్లు ఏదో యిచ్చారన్నారు" అడిగాడు ప్రసాద్

"ఎంత ఇచ్చారని-ముష్టి వెయ్యిరూపాయలు. దిక్కుమాలిన కల్మషం అంతా మేము ఎత్తి పోస్తాం. సూపరెంటుగారేమో షోగ్గా-అలా పైపై మందు లిచ్చేసి వేలకి వేలు పొడుపు కుంటారు-మావన్నీ కష్టపు బతుకులండి...."

"సుందరమ్మగారు"-నాలిక కొరుక్కుని. అదే లక్ష్మమ్మగారు మీకు కాస్తో కూస్తో ముట్ట చెప్పారుగా-"

"అది పెట్టే కదండీ, యీ యిల్లు వేసుకుంది. నా కొడుక్కయితే జ్ఞాపకం లేదుగాని, వాడు మర్చిపోయాడండీ-ఈ తల్లి చేసిందంతా! ఇప్పుడు నువ్వేం పెట్టావ్?-అని కోడలు రోజూ దెప్పి పొడుస్తూంటే-వాజమ్మలాగా నోరుమూసుకు కూచుంటున్నాడు." కసిగా చెపుతోంది మరియమ్మ.

మానవ స్వభావాన్ని గురించి-మళ్ళీ ఆలోచన వచ్చింది ప్రసాద్‌కి. తనేమో సుందరమ్మగారి ఆచూకీ తియ్యాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ మరియమ్మేమో తన కష్టాలు చెప్పుకుంటూ-అటువైపు తిప్పుతోంది సంభాషణని.

"ఆ ఎస్తేరమ్మ పనే బాగుంది-పరాయి బిడ్డని పెంచినా వాడు ప్రయోజకుడయ్యాడు. అక్కనీ-తల్లినీ బాగా చూస్తాడా?"

"అయ్యో-వాళ్ళ మాటంటే జవదాటడు. జీతం జీతం-అల్లా తెచ్చి తల్లి చేతుల్లో పోస్తాడు-కాలు వంకర అనిగాని-రాజాలాంటి పిల్లవాడు." అన్నాడు ప్రసాద్ మరియమ్మలోని అసంతృప్తిని ఎగసన తోస్తూ.

"వెర్రిముండని.స్వంతకొడుకు ఉన్నాడు కదా అని, ఎస్తేరమ్మ

ఏడుస్తుంటే రాజాలాంటి బిడ్డను ఇచ్చేశానండి-వాడే వుంటే, ఈపాటికి నన్ను నెత్తిన పెట్టుకొని వుండేవాడు."

"ఆ పిల్లవాడి కోసం లక్ష్మమ్మగారు మళ్ళీ రాలేదా?" అడిగాడు ప్రసాద్ ఓ రాయిని విసురుతూ.

మరియమ్మ వినిపించుకోనట్లు వూరుకుంది.

"లక్ష్మమ్మగారు-ఆ పిల్లవాడి కోసం వెతుక్కుంటూ వచ్చారని విన్నాను-"

"ఎవరు చెప్పారు?" అడిగింది భయంగా.

"వాళ్ళ వాళ్ళు-" అన్నాడు తాపీగా.

"పిల్లవాడిని పెంచుతూవుండు-వచ్చి తీసుకెడతాను అన్నారు. నాకా ఆస్పత్రిలో పని! ఆస్పత్రివాళ్ళకి తెలియకుండా నాకు అప్పగించారు కదండి."

"ఏం?"

"ఏడోరోజున ఆ పిల్లని తీసుకెళ్ళిపోయారండి."

"పచ్చి బాలింతనా?"

"పచ్చి బాలింతేకాదు-చచ్చి బతికింది అనుకోండి. కానుపు చాలా కష్టం అయింది. అసలు పిల్లవాడు లోపల చచ్చిపోయాడే అనుకున్నారు. బలవంతాన పొట్ట కోశారండి...."

"ఏం?"

"ఆ పిల్ల ఎప్పుడూ మత్తుగా పడి ఉండేది. తల్లి నిద్రమాత్రలిచ్చేది-యీ పిల్ల వేసుకునేది."

"ఎందుకట?"

"మాకేం తెలుసు. దానికి కడుపులో నెప్పి-రాత్రిళ్ళు నిద్ర

పట్టక ఏడుస్తూంటుంది. అందుకని పగలు నిద్రపోనిస్తున్నాను - అనే వారు. కాని, రాత్రిళ్లు ఎప్పుడు చూసినా హాయిగా నిద్రపోతూం దేది-"

"మరి?"

"మాతో మాట్లాడితే, అసలు విషయం చెప్పేస్తుందని భయం. అసలు యీ ఆస్పత్రికి వచ్చే వాళ్ళంతా యింతేనండి. ఉన్న నిజం చెప్పరు. పెళ్ళి అయిందంటారు-మొగుడు వదిలేశాడంటారు. మొగుడు దూరదేశంలో ఉన్నాడంటారు. వాళ్ళు అబద్ధాలాడుతున్నారని మాకూ తెలుసు-విని వూరుకుంటాం-"

"ఎబార్షన్సుకూడా చేస్తారటగా ఇక్కడ?"

"మొదటి-మూడు నెలలలోనూ అయితే చేస్తారు. కాని, మావాళ్లు ఎబార్షన్‌కి వొప్పుకోరు"

"ఎందుకని-అది తేలికేగదా?"

"తల్లి ప్రాణం పోతే-పోలీసుకేసు అవుతుందని భయం. సజావుగా పురుడుపోసి కావాలంటే పిల్లవాడిని తీసేసుకుంటారు-"

"ఏం చేస్తారు?"

"మిషన్‌వాళ్ళకి అప్ప చెపుతారు. లేకపోతే, అనాధ శరణాలయాలు వుండనే వున్నాయి."

"ఈ పిల్లవాడిని అలా ఎందుకు చెయ్యలేదు? నీకే ఎందుకిచ్చారు?"

మరియమ్మ వెంటనే జవాబు చెప్పలేదు. ప్రసాద్ సర్దుకుని.... "ఎస్తేరమ్మకి యిచ్చినందువల్ల పిల్లవాడు బాగుపడ్డాడుగాని చెడిపోలేదు. అందు గురించి మీరు భయపడకండి-" అని ధైర్యం చెప్పాడు.

"శరణాలయానికి-మిషన్‌కి యిస్తే మళ్ళీ పిల్లల్ని వెనక్కి-ఇవ్వరండి. అందుకని నన్ను పెంచమని రహస్యంగా యిచ్చారు."

"రహస్యం అంటే-మీకూ లక్ష్మమ్మగారికే తెలుసన్న మాట."

"అవును. పిల్లవాడు చచ్చిపోయాడని ఆ కూతురికి చెప్పించండి, అసలు యిల్లాంటి కేసులకి, మేము అల్లాగే చెపుతాం-"

"పాలు?"

"సరిపోయింది-నిద్రమాత్రలు మింగి మింగి-ఆ అమ్మాయి-పూచికపుల్లలా ఎండిపోయింది. పాలు లేవు, పాపాలు లేవు. మూడు రోజులు వొంటిమీద తెలివి లేకుండా ఉందండి-గ్లూకోజు ఎక్కించారు. నెత్తురు కూడా ఎక్కించినట్లు జ్ఞాపకం."

"అప్పుడు పసివాడిని మీకు అప్పగించారన్నమాట."

"అవునండి. మేకపాలు పోసి పెంచాను. నానాతిప్పలు పడి పెంచాను. వాళ్ళకేం, నాలుగు డబ్బులు చేతిలోపెట్టి టింగ్‌మని వెళ్ళిపోయారు. ఎంతైనా చెప్పండి-ఈ డబ్బుగల వాళ్ళు కసాయి వాళ్ళండీ! పసిగుడ్డును అలా వీడి వెళ్ళిపోటం మాలాంటి వాళ్ళకి చేతగాదండి." చెప్పుకుపోతోంది మరియమ్మ.

సుందరమ్మగారు మరియమ్మని నమ్మి-పిల్లవాడిని పెంచటానికి అన్ని ఏర్పాట్లూ చేశారు-డబ్బు యిచ్చారు. అయితే ఈ మనిషి-వాడిని అమ్మేసింది. ఆ విషయాలు సుందరమ్మగారికి చెప్పిందా, లేదా? అది ఎలా తెలుసుకోడం?

"పాపం! ఆ పిల్ల ఏడ్చిగోలచేసి ఉంటుంది కదూ."

"ఉహూ-వొంటిమీద స్పృహవుంటేగా. అసలు తల్లి ప్రాణానికే ముప్పొస్తుందని భయపడ్డారు. ఏడ్చే శక్తికూడా లేదండి. తెల్లగా-పాలిపోయి, నాచీరె రంగులో ఉండేది."

"అప్పటికి ఎన్నేళ్ళుంటాయి?"

"పధ్నాలుగూ పదిహేను కంటే వుండవండి. యిరవై ఏళ్ళనీ-పెళ్ళయిందనీ కధలు చెప్పారుగాని, మొఖం చూస్తే చదువుకుంటున్న పిల్లలా వుంది-మొగుడువుంటే యిక్కడి కెందుకు వస్తారు? మామూలు పెద్దాసుపత్రికే వెడ్తారు. ఆ తరువాత...." నాలిక కరుచుకుని ఆగిపోయింది.

"ఏదో చెప్పబోతున్నారు. చెప్పండి...." అడిగాడు అనునయంగా.

"వాళ్ళు యిక్కడ వుండగానే - ఒకబ్బాయి వెతుక్కుంటూ వచ్చాడు-"

"ఎవరి కోసం?"

"పేరు చెప్పలేదుగాని, రెండురోజులు గేటు దగ్గర కాపలా కాశాడు-అప్పుడే లక్ష్మమ్మగారితో మాట్లాడాడు."

"బహుశా. మొగుడయి వుంటాడేమో-"

"మొగుడుకాదు, మొద్దులుకాదు - మొగుడయితే హాయిగా ఆఫీసులోనే అడగొచ్చుగా-వాడే యీ పిల్లకి కడుపు చేసి వుంటాడు-" అంది మరియమ్మ తనకి అలవాటైన భాషలో.

ప్రసాదు కాస్త తడబడ్డాడు.... షాక్ కొట్టినట్లు అయింది అతనికి. సర్దుకుని "ఆ అబ్బాయితో లక్ష్మమ్మగారు మాట్లాడారా?" అని అడిగాడు.

"ఒకగంట చెట్టుకింద కూచుని మాట్లాడు కున్నారండి....పిల్లని బయటకి రానివ్వలేదు. మాకు ఇలాంటివి అలవాటే.... అందుకని దూరాన్నించి గమనించానండి."

"తరువాత?"

"వెళ్ళిపోతున్న అతన్ని కలుసుకున్నానండి—వెనక గేట్లోంచి పాపం, పిల్లవాడు— ఏడుపుమొహం పెట్టుకుని బాధపడిపోతున్నాడు. నా చేతిలో పదిరూపాయలు పెట్టి పురుడొచ్చాక రాయమన్నాడండి."

"రాశారా?"

"రాశాను."

"ఎట్లారాశారు?"

"ఎడ్రసు యిచ్చాడండి."

"మళ్ళీ వచ్చాడా—?"

"ఏడాదిన్నర అయాకవచ్చి కనిపించాడు. అప్పటికి పిల్లవాడు ఎస్తేరమ్మ దగ్గర వున్నాడు."

"మిమ్మల్నేం అడగలేదా?"

"పిల్లవాడు నిజంగా చచ్చిపోయాడా?" అని అడిగాడు. వాళ్ళు అలా చెప్పారుట. నాకెందుకీ తంటా అని, నేనూ అదే చెప్పాను" అంది మరియమ్మ.

సాయిప్రసాదుకి ఏం మాట్లాడాలో తెలియకుండా వుంది. అన్ని కథలూ— మానవ బలహీనతకు సంబంధించిన అన్నిగాథలూ యిలాగే ముగియాలా? జీవం పోసుకున్న ఒక పసికందుని, అందరూ కలిసి యిలా సజీవ సమాధి చేస్తారా? వాడేంచేశాడు? తన ప్రమేయం లేకుండా— ఈ ప్రపంచంలోకి నెట్టబడ్డ ఆ ప్రాణిని అంతా కలిసి— 'చంపెయ్యడం' రూపుమాపటం ఏంన్యాయం? అతనికి రావుగారిమీద సుందరమ్మగారిమీద, పంకజంమీద ఈ సమాజంమీద విపరీతమైన కసిగావుంది. ఇరవై ఏళ్ళ క్రితం— ఈ ఆస్పత్రి చెట్లకిందనుంచి, వెనక్కి పంపివేయబడ్డ ఆ యువకునిమీద విపరీతమయిన జాలిగా వుంది.

సుందరమ్మగారు అనుమతియిస్తే పెళ్ళిచేసుకుని వుండేవాడేమో ఎందుకు ఆమె వొప్పుకోలేదు? బహుశా కడజాతి అయివుంటాడా? బీద వాడై వుంటాడా?

"ఆ పిల్లవాడు?"

"ఏ పిల్లవాడండి!"

"అదే మీకు ఎడ్రసుయిచ్చాడే- అతనికి వయసెంత వుంటుంది?"

"ఎంతండి.... ఇరవై ఏళ్ళుండొచ్చు లేతగా అమాయకంగా వున్నాడు."

"అతని ఎడ్రసు మీ దగ్గరవుంది అన్నారు గదా నాకిస్తారా?"

మరియమ్మ భయపడింది. ఇక్కడకూడా కొంత డబ్బు ముడి పడివుంటుంది.... అనిపించింది ప్రసాదుకి. దగాపడో, కాలుజారో, ఒళ్ళు పొగరు ఎక్కో పొరబాట్లు చేసిన స్త్రీ పురుషులు గుమిగూడే స్థలం ఇది! ఈ ఆస్పత్రిలో అడ్డదార్లకి, వందలూ వేలూ అని కిమ్మతు వుంది. సూటిగాపోని యీ పరిసరాల్లో, వ్యక్తులకి మానసికమయినశక్తి వుండదు. అటువంటి వారి బలహీనతని ఆసరాగా చేసి.... డబ్బుగుంజు కోటం మరియమ్మవంటి వారికి ఒకవృత్తి అయిపోయింది. ఈ మరియమ్మకి వక్రమార్గం తప్ప— మామూలుదారి తెలిసే అవకాశంలేదు. ఆమె పరిసరాలు అలాంటివి. మనుషులంతా చుట్టూ పరిస్థితులకి బానిసలే.

మరియమ్మని గురించి ఆలోచిస్తున్నప్పుడు.... అదే వృత్తిలో వున్న ఎస్తేరమ్మ.... ఎలిజబెత్ జ్ఞాపకంవచ్చారు. వారిలోని నిజాయితీ ప్రేమ యీమెలో ఎందుకులేవు? రాబీ తమని వదిలి వెళ్ళిపోతాడేమో— తమనించి ఎవరైనా లాక్కుంటారేమోనని ఆ తల్లీకూతుళ్ళు తల్లడిల్లి పోవటం అతని బుర్రలో మెదిలింది. ఒకే వృత్తికి, ఒకే మతానికి

జీవిత విధానానికి చెందిన ఈ యిద్దరూ అతని కళ్ళముందు కనిపించారు. ఒకేరకమైన పరిస్థితులనుంచి వచ్చిన ఈ యిద్దరి దృక్పథాల్లో యింత తేడా ఎందుకొచ్చింది? ఏ యిద్దరు వ్యక్తులూ ఒకవిధంగా వుండనట్లే, ఏ యిద్దరి స్వభావాలూ ఒకేమాదిరి వుండవుకాబోలు.

"అతని ఎడ్రసు యిస్తారా!" అడిగాడు.

"ఎందుకండి.... ఇరవైయేళ్ళక్రితం నాటిమాట. ఇప్పుడు తవ్వటం దేనికండి" మరియమ్మ మనసులోని భయం, మాటల్లో ప్రస్ఫుటమవుతోంది.

"ఊరికేనే— "రాబీ" అంటే ఎస్తేరమ్మ కిచ్చిన పిల్లవాడు పెరిగి ప్రయోజకుడయ్యాడంటే.... మీరు సంతోషించలేదు? అలాగే తండ్రికూడా—"

"ఈ పిల్లవాడు లేడని చెప్పాను గదండీ?" అడిగింది మరియమ్మ గడుసుగా.

"నేనూ అలాగే చెపుతాను. నాకు ఆ యువకుని కలుసుకోవాలని వుంది. వాళ్ళుపిల్లని యివ్వలేదో యితను పెళ్లి చేసుకోలేదో కనుక్కోవాలనివుంది. ఇదిగో నా ఎడ్రసు— మీరు ఎప్పుడు బయలుదేర్తానంటే అప్పుడుమావాళ్ళుమనియార్డరుకడతారు..."చేపకిఎరవేసినట్లు ఆయా వుద్యోగం కళ్ళముందు అల్లల్లాడిస్తుంటే, మరియమ్మ అయిష్టంగానే లోపలికెళ్ళింది.

"ఆ ఎడ్రసులో వుంటాడో లేదో?" నసుగుతూవుంది.

"ఆ విషయం మీకు మనియార్డరు కూపనులో రాస్తాను. అతను అక్కడే వున్నాడో లేదో...." ఈ మాటవల్ల తప్ప ఎడ్రసు ఇచ్చి తప్పించుకోలేదన్న ధైర్యంతో అన్నాడు ప్రసాదు.

"ఖర్చులకి వుంచుకోండి," అంటూ యాభైరూపాయలు చేతిలో పెట్టి ఎడ్రసు తీసుకుని జేబులో పెట్టుకుని బయలుదేరాడు ప్రసాదు.

అప్పుడే బడి వదిలినట్లున్నారు. తేనెతుట్టెలోంచి ఈగల్లా పిల్లలు 'జుమ్' అంటూ బయటకొస్తున్నారు. మాట్లాడకుండా స్కూలు. బిల్డింగ్‌లోంచి బయటపడే కుర్రవాడు ఒక్కడైనా వుంటాడేమోనని ప్రసాదు వెతుకుతూ వున్నాడు. చాలా రోజులునుంచి ప్రతిసారీ అతని అన్వేషణ విఫల మవుతూనేవుంది. గోలగా అరుస్తూ చెల్లాచెదురుగా పరుగులు పెడు తున్నారు పిల్లలు.

మరియమ్మ యిచ్చిన ఎడ్రస్, మరోసారి పరిశీలించాడు. అది రాజమండ్రి ఎడ్రస్- ఇరవై ఏళ్ళక్రితంనాటి ఎడ్రస్. ఆ వ్యక్తి పేరు ఆనందరావు. ఈ ఆనందరావు ఇంకా ఆ వూళ్ళోనే వున్నాడన్న నమ్మకం ఏమిటి? ఇంతదూరం కార్లోవెళ్ళి, ఆ మనిషి అక్కడ లేడంటే.... ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి? సదాసరి వెళ్ళిపోయి.... తన అదృష్టం పరీక్ష చేసుకోటం కంటే వేరే మార్గంలేదు. లాడ్జికొచ్చి రూము ఖాళీ చేస్తూంటే—— అతనికి ఫోన్ వచ్చింది.

డాక్టర్ మూర్తి అవతలివైపునుంచి మాట్లాడుతున్నాడు.

"మీ పరిశోధన ఎంతవరకూ వచ్చింది?" అడిగాడు.

ప్రసాదు క్లుప్తంగా విషయాలు చెప్పి.... "ఎలిజబెత్ వాళ్ళు.... అక్కడ సెటిల్ అయ్యారా?" అడిగాడు,

"అయ్యారుట. రాబీ చాలా హాపీగా వున్నాడుట.... ఆ కాఫీ తోటమధ్య! ఇక్కడి పొగ సన్నసన్నగా రాజుకుంటూవుంది_"

"ఏం?"

"రావుగారు తనమాటమీద నిలబడ్డా ఆ "షి.... డెవిల్" వూరు కునేట్లులేదు."

"ఏం చేసుందట?"

"వాళ్ళ నాన్న లీడింగ్‌లాయరుట. పోలీసు కంప్లెయింట్ యివ్వటానికి తహతహలాడి పోతోంది."

"చూద్దాం.... ఈ లోపల కొన్ని కొత్త విషయాలు బయట పడ్డాయి...."

"దానివల్ల.... మనకేంలాభం? నేను ఎలా బయటపడాలో చెప్పండి?"

"దారి కనిపిస్తోంది. రాజమండ్రిలో మీకెవరైనా.... ఫోన్‌వున్న ఫ్రెండ్ తెలుసా?"

"ఉన్నారు"

"ఫోన్‌చేస్తే— మనంచెప్పిన పని చెయ్యగల మనిషికావాలి."

"అంటే?"

"ఫలానా ఎడ్రస్‌లో.... ఆనందరావు అన్న పేరుగలవ్యక్తి వున్నాడోలేడో కనుక్కుని చెప్పగలగాలి."

"ఎడ్రసు యివ్వండి. ఏడుగంటలలోపున మీకు ఏవిషయం చెపుతాను.... మీరు త్వరగా విషయం తేల్చండి. నాకు నర్వస్‌గా వుంది.... అసహ్యమైన పేరు...." ఫోన్ కట్ అయిపోయింది.

సరిగ్గా ఆరుయ్యేకి.... హోటల్‌లో ఫోన్‌రింగ్ అయింది. కౌంటర్ దగ్గర జనం. సాయంత్రంవేళ కాబట్టి వొచ్చేపోయే లాడ్జర్ల గలగలమని మాటలు శబ్దాలు. డాక్టర్ మూర్తి మాటలు స్పష్టంగా విని పించలేదు. ఆ మనిషి ఆ ఎడ్రసులోనే వున్నాడన్నది. మటుకు.... రెండుసార్లు రిపీట్ చేశాడు డాక్టర్ మూర్తి.

ఏడింటికి రూమ్‌ఖాళీ చేసి—ఎటాచ్ కేసూ, బాగూ, కారులో వేసుకు బయలుదేరాడు ప్రసాద్. డ్రైవర్ కారు నడుపుతుంటే, ప్రసాద్ ఏం మాట్లాడాలి? ఏం అడగాలి అన్నది రిహార్సల్స్ వేసు

కుంటున్నాడు. అంతదాకా యీ విచిత్రమైన గాథలో-ప్రసాద్ కి ఎవరి మీదా సానుభూతి కలగలేదు. అందరూ తమ తమ ప్రయోజనాల కోసం. యిరవై ఏళ్ళ క్రితం నాటి జీవన నాటకంలో పాత్రలు అయారు. ఇందులో నష్టపోయిన వ్యక్తి ఎవరు? ఈ మహానాటకంలో ఏకాకి ఎవరు?-అని ప్రశ్నించుకున్నప్పుడు-ఆనందరావు అనే యిరవై ఏళ్ళ యువకుడు ప్రసాద్ కళ్ళముందు ప్రత్యక్షమవుతూ వున్నాడు.

సుందరమ్మగారు-తెలివిగా కూతురు తప్పిదాన్ని దాచిపెట్టి, గుట్టుచప్పుడు కాకుండా-పురుడు పోయించి ఆ పిల్లవాడిని అనాధని చేసి వదిలేసింది. పంకజం గతాన్ని మర్చిపోయి, హాయిగా అమెరికాలో పిల్లాపాపతో సుఖంగా వుంది. మరియమ్మ దిక్కులేని పసికందు కారణంగా అయిదువేలు సంపాయించి, వాణ్ణో వస్తువులాగా, అమ్మిపారేసింది. మొగపిల్లవాడి కోసం కరువు వాచిన ఎస్తేరమ్మ పుత్ర ప్రేమని పొందింది. అందరికీ ఏదోవిధంగా లబ్ధి కలిగింది-తోడు దొరికింది-ఒక్క ఆనందరావుకి తప్ప! ఆ యువకుడు-కావాలని తప్పు చేశాడా? తప్పుచేసి పారిపోయేవాడయితే, హాస్పిటల్ కి ఎందుకొచ్చి వుంటాడు? అంటే, యవ్వన ప్రాంగణంలోకి అడుగు పెడుతున్న ఆ యువకుడు నిజంగానే- యీ పధ్నాలుగేళ్ళ పిల్లని ప్రేమించివుండాలి? మరి పెళ్ళి ఎందుకు చేసుకోలేదు? బహుశా, సుందరమ్మగారు వొప్పుకుని వుండదు. తాము ధనవంతులు. కూతురు తప్పు చేసినా, కప్పెట్టి మంచి సంబంధం చెయ్యగల తాహతువుంది. సగటు తల్లిలాగానే ఆమె ప్రయత్నించింది. అది తల్చుకుంటే విసుగ్గా వుంది.

ప్రసాద్ కి షుమారు నలభై దాటినాయి. ఇద్దరు పిల్లలు-భార్య, డబ్బు, వ్యవధి, అన్నీవున్నాయి. చిన్న చిన్న వ్యసనాలూ వున్నాయి.

పరస్త్రీ సాంగత్యమూ కొత్త కాదు. కాని, వీటన్నిటి నుంచీ కూడా-అతను యిరవై ఏళ్ళ ఆనందరావు ఏకాంతతని, అందరూ దూరంగా నెట్టెయ్యగా, నిస్పృహతో వెళ్ళిపోయిన ఆ యువకుని మర్చిపోలేకుండావున్నాడు.

ఆ రాత్రి తొమ్మిదింటివేళ రాజమండ్రి చేరుకున్నాడు. ఇక్కడ హోటళ్ళకి సమస్యలేదు. ప్రసాద్‌కి రాజమండ్రి చిరపరిచితం-చేతిలో చీటితో-దానవాయిపేట వెతుక్కుంటూ-తొమ్మిది దాటాక బయలు దేరాడు. పదిగంటల వేళ యిలా వెళ్ళి తలుపు కొట్టటం అమర్యాద అనిగాని, అవతలవారికి ఇబ్బందిగా వుండచ్చు ననిగాని అతనికి అనిపించలేదు. చూడాలి-చూడాలి. ఆనందరావు అనే యువకుని చూడాలి, అంటూ ఆత్రపడుతున్నాడు.

బయటనుంచి చూస్తే ఇల్లు మరీ బీదగాలేదు. చుట్టూ చెట్లు-చిన్న గేటు. లోపల మామూలు పెంకుటిల్లు. వెన్నెల్లో యింటిపైన బంగళా పెంకులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. లోపల మనుషులు పడుకున్నట్లులేదు. ముందు వరండాలో దీపం వెలుగుతోంది. వరండాకున్న డైమండు ఆకారపు రీపర్సు-నేలమీద వికృతంగా తమ నీడని పరుస్తూ వున్నాయి. అసలు సైజుకి రెట్టింపు సైజులో నీడ, ముందున్న చప్టా మీదపడింది.

"ఆనందరావుగారు-ఆనందరావుగారు-" పిలిచాడు ప్రసాద్ గేటుదగ్గర నుంచి.

ఎనిమిదేళ్ళ అమ్మాయి. పరికిణీ జాకెట్ వేసుకునివుంది, బయట కొచ్చింది.

"ఎవరు?"

"ఆనందరావుగారికోసం వచ్చాను పడుకున్నారా?"

"నాన్నగారి కోసమా?" అడిగింది ఆ పిల్ల.

ఆనందరావు కూడా పెళ్ళి చేసుకున్నాడన్న మాట. జవాబు ఇవ్వటం మర్చిపోయి నుల్చున్న ప్రసాద్‌ని మళ్ళీ అడిగింది ఆ పాప.

"నాన్నగారి కోసమా?"

"అవునమ్మా"

"లోపలికి రండి." అంటూ తీసుకెళ్ళింది.

వాలు కుర్చీలో కూచుని మధ్య వయస్కుడొకతను. పేపర్లు దిద్దుతున్నాడు. ఆ మనిషి బొద్దుగా పచ్చగా వున్నాడు, టీప్తపాటు. యీ వ్యక్తి ఆనందరావు అయి వుండడు. అనుకున్నాడు ప్రసాద్. ఇరవై ఏళ్ళ యువకుడు యితను కాదా అనికూడా అనుకున్నాడు. మరుక్షణంలో కాలమానం జ్ఞాపకం వచ్చింది.

ఆ మనిషి కుర్చీలోంచి లేవలేదు. తలఎత్తి చూశాడు. ఇది స్కూలు మాస్టర్ల జాతి. వచ్చిన ప్రతివాడూ విద్యార్థి లాగానే కనిపిస్తాడు వీళ్లకి, కనీసమర్యాద కూడా వుండదు, అనుకుంటూతనని తాను పరిచయం చేసుకున్నాడు ప్రసాద్. మొఖంమీద పడుతున్న వత్తయిన తెల్లని జుట్టు పైకి తోసుకుంటూ చూశాడా వ్యక్తి ప్రసాద్ వంక. కళ్లలో అలసట. తీవ్రమైన క్షోభకు గురి అయినట్లు బాధ, ముఖంలో యింత స్పష్టంగా ప్రతి ఫలించటం ప్రసాద్ మున్నెన్నడూ ఎవరిలోనూ గమనించలేదు.

"సారీ, లేచి మిమ్మల్ని రిసీవ్ చేసుకోలేక పోయాను. క్షమించండి," అన్నాడా వ్యక్తి కాళ్లవంకే చూపిస్తూ.

రెండు కాళ్లూ లేవు. మోకాలి కిందనుంచి యినుప బూట్లు. ప్రసాద్ అవాక్కయిపోయాడు—తానుయిరవై ఏళ్ల యువకునివూహించుకున్నాడు. యిక్కడ నలభై ఏళ్లమధ్య వయస్కుడు— రెండు కాళ్లూ

లేని వ్యక్తి దర్శనం యిస్తున్నాడు. ఇంతకంటే ఆశ్చర్యం ఏమైనా వుంటుందా?

"కొత్తవాడిని-ముందు చెప్పకుండా వచ్చేశాను. ఏమీ అనుకోకండి."

అతను సరళంగా నవ్వాడు. నవ్వుతున్నప్పుడు కళ్లజోడు ముఖంమీదకి జారి, అతని ముఖం కార్టూన్ లాగా తమాషాగా వుంది.

"ఎప్పుడోగాని-యిలా విచిత్రంగా విజిటర్స్ రారు-అందులో యీ టైములో. ఇది కొత్తగానేవుంది. చిట్టీ, అంకుల్‌కి మంచి నీళ్లు కావాలేమో పట్టుకురా."

"భోంచేశారా" అడిగాడతను ప్రసాద్ వంక పరీక్షగా చూస్తూ.

"లేదు మిమ్మల్ని చూద్దామని, హోటల్లో సామాను పడేసి సరాసరి వచ్చేశాను."

"నన్నా-దేనికి? మార్కులకోసం వచ్చినట్లుగా లేదే-మిమ్మల్ని చూస్తే! అలా అనిపించడంలేదు."

"ఎలా చెప్పగలిగారు?"

"వాళ్ళవళ్ల బుట్లో-స్వీట్స్‌పాకెట్టో తీసుకొచ్చి, ముందు మా చిట్టికిచ్చి, దాన్నిమంచిమాట ఆడుకుంటారు. ఆ జాతి వేరు లెండి," అన్నాడు ఆనందరావు నవ్వుతూ.

ప్రసాద్ కూడా నవ్వాడు.

"మా భోజనాలు అయిపోయాయి-పళ్లు తీసుకుంటారా? చిట్టీ మజ్జిగ పట్టుకురా. అమ్మనడిగి అరటిపళ్లు కూడా పట్రా.--మీరేదో గట్టిపని మీదేవచ్చారు. కాసేపుకూర్చుంటారుగా. ముందు ఆత్మారాముడిని వూరుకోబెట్టండి," అన్నాడు ఆయన దిద్దిన పేపర్లు దొంతరగా పెట్టి తాను కడుతూ.

"మీ పనికి అడ్డువచ్చానను కుంటా."

"పేపర్లు దిద్దటం పనికాదు. మా టీచర్లకి ఈ పని గాలి పీల్చటం లాంటిది. నిద్దట్లోలేపినా, దిద్దేస్తాం. మీరు ఎందు కొచ్చారో నాతో ఏం పనిమీద వచ్చారో-గెస్ చేస్తుంటాను. పళ్లు తీసుకోండి--" అన్నాడు ఆనందరావు. ఆ మాటఅయితే పైకి అన్నాడుగాని, అతని కళ్లు-విచారంతో ఒక రకమైన తాత్విక దృష్టితో-శూన్యంలోనికి చూస్తున్నట్లుగా వున్నాయి. ఆ కళ్ళలో పైకి వర్ణించలేని, మాటలలోకి యిమడని విషాదం. మానసికంగా, దైహికంగా అలసి డస్సిపోయి నట్లున్న భావం తొంగిచూస్తూవుంది. ప్రసాద్‌కి సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలియకుండా వుంది. సాంబశివరావు-మరియమ్మ వంటి వాళ్ళని డబ్బుతో మాట్లాడించవచ్చు, నోట్ల రెప రెపకి వాళ్ళ గొంతులు బెక బెక మంటాయి. ఆనందరావు హృదయానికి దగ్గరగా వెళ్ళటం కష్ట సాధ్యం అనిపిస్తోంది. విషాదం గూడుకట్టుకున్న ఆ కళ్ళు నవ్వలేవు-పెదిమల్తో-మాటలతో నవ్వగలడు తప్ప.

చిట్టి, అరటి పళ్ళ తొక్కలు ప్లేట్లోపక్కకి తోసి, అందులోనే ఖాళీ మజ్జిగగ్లాసు వుంచుకుని. లోపలికి వెళ్ళింది. చూపిస్తూ -"ఇంట్లో అంతా పడుకున్నారా? మనమాటలు వాళ్ళని డిస్టర్బ్ చేస్తాయేమో!" అడిగాడు ప్రసాద్.

"అల్లాంటి యిబ్బంది లేదు. మా ఆవిడకు చెవులు వినిపించవు. చిట్టి పడుకోగానే నిద్రపోతుంది."

"డాక్టరుకి చూపించలేదా?" అడిగాడు ప్రసాద్.

"చూపించాము. మా అమ్మాయి పుట్టినప్పుడు ఏవో నాటు మందులు వాడారుట. అప్పటినుంచీ వినిపించటంలేదు. ఇక లాభం లేదన్నారు." చాలా సాధారణ విషయంలాగా చెప్పాడు ఆయన.

సాయిప్రసాద్‌కు నేలలోకి కృంగిపోతున్నట్లుగా వుంది. కొందరు కష్టాలు భరించటానికే పుడతారు కాబోలు. ఆ మనిషి ఇన్ని బరువులు మోస్తూ ఇంకా ఎలా సహజంగా వుండగలుగుతున్నాడు? సాయిప్రసాద్ మనసులోని భావావేశాన్ని గ్రహించుకున్నట్లు చిరునవ్వు నవ్వాడు ఆనందరావు.

"నేను ఎవరో, ఎందుకొచ్చానో గ్రహించారా?"

"పేరు చెప్పారు. ఈవూరు కాదని తెలుస్తోంది. ఎందుకొచ్చారో అన్నది బోధపడటంలేదు. ఏదో బలవత్తరమైన కారణం వుండే వుంటుంది" అన్నాడు ఆనందరావు.

"సుందరమ్మగారు పోయారు తెలుసా?" అడిగాడు గభాలున సాయిప్రసాద్, ఎత్తునుంచి స్విమ్మింగ్‌పూల్‌లోకి దూకుతున్నవాడిలా.

ఆనందరావు కదలలేదు. ఆశ్చర్యపోనూ లేదు. కళ్ళలో ఆగ్రహమూ లేదు. "నాకు తెలియదు. ఎప్పుడు పోయారు?" సాయిప్రసాద్ ఏసుందరమ్మగారి గూర్చిఅంటున్నాడో వెంటనేగ్రహించుకోగలిగాడు. అతను ఎరగనట్లు నటించలేదు. అంటే ఆ కుటుంబాన్ని గూర్చి యీ వ్యక్తి మర్చిపోలేదన్నమాట.

"అటుమొన్న వుదయం కార్డియాక్ అరెస్ట్ వల్ల పోయారు."

"అయామ్ సారీ. ఆమె చాలా మంచి మనిషి. వుత్తమురాలు" అన్నాడు ఆనందరావు.

ఈ మాటలు వింటుంటే సాయిప్రసాద్‌కి ఆశ్చర్యంగా వుంది. ఈతనికి ఆమెమీద కసిలేదా? పంకజాన్ని పెళ్ళి చేసుకోకుండా అడ్డుకుందన్న కోపంలేదా? ప్రసాద్ కళ్ళలోని ప్రశ్నలని, సందేహాలని గ్రహించుకున్నట్లు, ఆనందరావు మెల్లిగా మనస్ఫూర్తిగా అన్నాడు. "ఆమె చాలా గొప్ప మనిషి. అంత సహృదయం గల స్త్రీలు అరుదుగా

కనిపిస్తారు. ఆమె మీకు ఎలాతెలుసు? మీ రాకకూ ఆవిడ పోవటానికీ సంబంధం?" ప్రశ్న గాలిలోకి వదిలాడు ఆనందరావు.

"పంకజం!" అన్నాడు సాయిప్రసాద్ సూటిగా.

"తను మిమ్మల్ని పంపిందా?"

"లేదు నేనే వచ్చాను. అసలు యిక్కడి కొస్తున్నట్లు వారెవరికీ తెలీదు."

"మరి"?

"మీరు పంకజాన్ని ఎందుకు పెళ్ళి చేసుకోలేదు? సుందరమ్మ గారు వద్దన్నారా? మీకూ వారికి అంతస్తుల్లో తేడానా?" అడిగాడు సాయిప్రసాద్.

ఆనందరావు చివాలున తలఎత్తాడు. ఆ కళ్ళలో కోపం ఎర్రని జీర. "ఇతరుల వ్యక్తిగత విషయాల్లో కల్పించుకోడం అనాగరికం. మీకు యీ ప్రశ్నలడిగే హక్కులేదు."

"వుంది. మీ కొడుకుని పెంచుతున్న వాళ్ళమీద దొంగతనం అంటగట్టారు. అమాయకులైన ఆడవాళ్ళ మీద లేనిపోని నేరం మోపారు."

"ఎవరు? పంకజమా?"

"కాదు రావుగారింట్లోవాళ్ళు."

"అసలేం జరిగింది?"

సాయిప్రసాద్, సుందరమ్మగారు పోయిన మరుక్షణం నుంచీ జరిగిన డ్రామా, పూసగుచ్చినట్లు చెప్పుకొచ్చాడు. ఆనందరావు శిలా విగ్రహంలా కూచుండిపోయాడు. అయిదు నిముషాలపాటు నిశ్శబ్దం. ఎక్కడా చప్పుడు లేదు. ఆనందరావు బరువుగా విడుస్తున్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలు స్పష్టంగా వినిపిస్తూ వున్నాయి.

"స్ట్రేంజ్" అన్నాడతను నూతిలోంచిలాగా

"ఏమిటి?"

"సుందరమ్మగారు యింత అబద్ధం ఆడతారనుకోలేదు. ఆ రోజు హాస్పటల్ కెళ్ళినప్పుడు. ఆవిడ నాస్థితి అర్థం చేసుకున్నారు, లోకం తెలియని మేమిద్దరం మాకు తెలియకుండా పొరబాటు చేశామని గ్రహించారు."

"మీకు పంకజం ఎలా తెలుసు?"

"తను పి.యుసి, నేను బి.ఎ ఫైనల్లో ఒకే కాలేజీలో చదువుతుండేవారం. అప్పటికి జూనియర్ కాలేజీలు లేవు. అప్పుడు వాళ్ళ నాన్నగారు జర్మనీలో వున్నారు."

"అవునట"

"ఈ విషయం పైకి చెపితే ఎవరూ నమ్మరు. కాని మేము యిలా అవుతుందనుకోలేదు.సరదాకి-అదేదో కొత్త "ఎక్స్పరిమెంట్" అనుకున్నాము. తీరా కొంపమునిగేప్పటికి ఇద్దరం ఖంగారుపడ్డాము."

"తరువాత?"

"సుందరమ్మగారు-నన్ను పిలిచి ఏమీ అడగలేదు. వాళ్ళు ఆ వూరు వదిలేసి వెళ్ళిపోయారు. మొగపిల్లల్ని హాస్టల్లో జేర్చి-"

"పై. వాళ్ళు ఎవరికీ తెలియలేదా?"

"లేదు. అసలు ఎవరికీ అనుమానం రాలేదు. వాళ్ళు వెళ్ళిపోయాక పంకజం అంత అర్థాంతరంగా వెళ్ళిపోతే నాకేదో అనుమానం వచ్చి, నాకున్న మిడిమిడిజ్ఞానంతో ఈ ఘోరం జరిగి వుంటుందని వూహించాను."

"అప్పుడే హాస్పటల్కి వెళ్లారా?"

"లేదు-వాళ్ళు ఎక్కడున్నారో తెలుసుకోటానికి చాలా చాలా కష్టపడ్డాను."

"ఎట్లాతెలిసింది"

"సుందరమ్మగారు-కొడుకుపేరన, 'టియమ్వోవా'పంపారు-అది చూసి కనిపెట్టాను."

"అంటే, మొగ పిల్లలకి ఈ సంగతి తెలుసంటారా?"

"తెలియదు-పంకజానికి-టి. బి అని చెప్పారు. కొన్నాళ్లు మదన పల్లిలో వున్నారు. ఒకేయింట్లో వుంటే మొగపిల్లలకి యీ జబ్బు అంటుకుంటుంది - ఈలాంటి జబ్బు పిల్లతో ఎవరి యిళ్ళలోనూ వుండకూడదు. మదనపల్లి శాంటోరియమ్కి తీసుకెడతాను. అని వెళ్ళారుట."

"అంటే పంకజం అన్నదమ్ములు మీతో మాట్లాడే వాళ్ళన్న మాట."

"దెబ్బలాడుకుంటేగా? అసలు ఎవరికీ అనుమానం రాలేదు. పంకజం తెల్లగా పాలిపోయి, చిక్కిపోతుంటే బోన్ టి. బి. అని చెప్పాడుట డాక్టరు. కాని తప్పు చేశాను కాబట్టి నాలో ఏదో భయం-అనుమానం. మళ్ళీ పంకజం నాకంట పడక పోయేప్పటికి, నా అను మానం ధృవమయింది."

"మదనపల్లి నుంచి-ఆస్పత్రికి వచ్చారన్నమాట."

"అయిదు నెలలు కాబోలు మదనపల్లిలో వున్నారు. ఆ తరు వాత గాలి మార్పుకి రామాపురం తీసుకొచ్చారు అన్నారు. అది చూసే-నేను ఎలాగన్నా పంకజాన్ని చూడాలని హాస్పటల్కి వెళ్ళాను."

"చూడనివ్వలేదటగా?"

"వద్దు అని అనలేదు ఆవిడ. మీరే ఆలోచించండి. ఆ తల్లి

స్థానంలో మీరుంటే ఏంచేసేవారు. అసలు మామూలు తల్లి తండ్రు అయితే ఏం చేసేవారు?." అడిగాడు ఆనందరావు.

"పెళ్ళి చేసుకోమని గొడవ చేసివుండే వారు. చేసిన తప్పుని సరిదిద్దుకోమని-- వత్తిడి తెచ్చివుండేవారు."

"ఆమె అదే చేశారు."

"పెళ్ళికి మీ వాళ్ళు వొప్పుకోలేదా?"

"అసలు ఆమె యీ సమస్యను మరో కోణంనుంచి చూశారు. నన్ను తిట్టలేదు. కాళ్ళు విరగకొడ్తానని అనలేదు. అరిచి గోల చెయ్య లేదు."

"ఆశ్చర్యంగా వుందే?"

"అందుకనే- ఆమె ప్రత్యేకమైన వ్యక్తి అన్నాను. చాలా సానుభూతితో నా తప్పిదాన్ని విన్నారు. నా ఆరాటం, పంకజం ఏమై పోతుందోనన్న నా భయాన్ని అర్థం చేసుకున్నారు."

"చూడనివ్వలేదన్నారుగా."

"ఆవిడ ఒక్కటే అడిగారు. ఇప్పుడు చూసినందువల్ల ప్రయోజనం వుందా? దానివల్ల జరిగిన పొరబాటు సరిఅవుతుందా? అని! అవదు. నాకు ఏంచెయ్యాలో అన్నప్లానుగాని, పెళ్ళి చేసుకుందా మన్న ఆత్రంగాని లేదు-తప్పు చేశానన్న పశ్చాత్తాపంతప్ప! అప్పుడు ఆవిడ చాలా నిదానంగా, కన్నకొడుకుకి చెప్పినట్లు, నా భవిష్యత్ ప్లాను గురించి చెప్పారు. చేసినతప్పు దిద్దుకోటానికి ఒకటే మార్గం వుందన్నారు. నేను కనీసం ఎమ్. ఎ. పాసయి, లెక్చరర్ జాబ్ సంపాయిస్తే, పంకజాన్ని యిచ్చి పెళ్ళి చేస్తానన్నారు."

ప్రసాద్ ఆశ్చర్యంగా వింటున్నాడు. చెవులు దోర బెట్టుకు వింటున్నాడు.

"పొరపాటు నీ దొక్కడిదేకాదు- మా అమ్మాయిదీను, నాకూ యీ పొరబాటులో భాగం వుంది"అని ఆవిడ చెపుతున్నపుడు యిరవై ఏళ్ళులేని నేను ఆక్షణంలో మానసికంగా చాలా ఎదిగాను. క్షమాగుణం మనిషిని ఎంత వున్నతుని చేస్తుందో, ఆమె ముందు నేనంత అల్పుడినో బోధ పడింది."

చుట్టూ నిశ్శబ్దం.ఆ నిశ్శబ్దంలో ఆనందరావు మాటలు నెమ్మదిగా స్పష్టంగా వేదనా భరితంగా వినిపిస్తూ వున్నాయి.

"మీరు నమ్మరు- ఆరోజు నేను ఆమె వొళ్ళో తలపెట్టుకుని ఏడ్చాను. ఎందుకో తెలియదు చాలా బాధ వేసింది. నా వల్ల యీమె యీ కొత్త పరిసరాల్లో-యిలా అవమాన కరమైనస్థితిలో వుండాల్సి వచ్చిందని-ఆమె స్థితికి కుమిలి పోయాను."

"మరి పంకజాన్ని ఎందుకు పెళ్ళి చేసుకోలేదు."

"చాలా విషయా లున్నాయండి. మీ రొచ్చి నా మనసులోని జ్ఞాపకాల తుట్టని కదిల్చారు- వినాల్సిన బాధ్యత వుంది. తొందర పడకండి." అన్నాడు ఆనందరావు స్కూలు టీచరులాగానే.

సాయిప్రసాద్ నాలిక కరుచుకున్నాడు- పొరబాటు మన్నించమన్నట్లు.

"పంకజాన్ని-నేను ఎమ్మే పాసయేదాకా చూడవద్దన్నారు. మేమిద్దరం మళ్ళీ కలుసుకోమని, నా దగ్గర మాట తీసుకున్నారు. ఎమ్మే అయాక ఆడిగ్రీ చేతులో పుచ్చుకునిగాని మేము ఒకళ్ళ మొఖం ఒకళ్ళం చూడటానికి వీల్లేదన్నారు."

"చిత్రంగా వుంది."

"అప్పుడు- ఆ క్షణంలో నాకు అది చాలాకఠినమైన విషయంలా అనిపించింది. కాని ఆమె పెట్టిన నిబంధన ఎంత శక్తివంతమైందో వూహించండి. మేము మళ్ళీ ఆతప్పు చేస్తే! ఒకసారి కాలుజారిన వాళ్ళ-

మళ్ళీ ఆ బలహీనతలో పడరని నమ్మకం ఏమిటి? అదీ ఆవిడ పాయింట్."

"ఒప్పుకున్నారా?"

"ఒప్పుకున్నాను. నాకు యిరవై ఏళ్ళులేవు. పంకజానికి పదిహేడేళ్ళుంటాయి. ఇంత చిన్న వయసులో పెళ్ళి-అదీ తప్పటడుగు వేసి-సరిదిద్దుకునే పెళ్ళి. అటువంటి పెళ్ళి వద్దు అని నలభై ఏళ్ళ గృహిణి సలహాయిస్తుంటే, తప్పు చేసిన యువకుని మనస్థితి ఎలా వుంటుందో వూహించండి."

"మరి పుట్టబోయే ప్రాణి గురించి మీకు ప్రేమ-బాధ్యత...."

నవ్వాడు ఆనందరావు.

"నన్ను పెద్ద గండం నుంచి తప్పిస్తానంటున్నారు. అయిదేళ్ళు ఆగి, మీ ప్రేమ బలవత్తరమైనది అయితే, అయిదేళ్ళు నిలబడగలిగితే పెళ్ళి చేస్తానంటున్నారు. ఇంతకంటే ఏం కావాలి? ఏ దేవతలు యింతకంటే గొప్పవరాలు యిస్తారు."

"మరి మీరు విచారంగా ఆస్పత్రిలోంచి వెళ్ళిపోయారని మరియమ్మ అంది."

"ఎవరూ_ఆ ఆయానా-అది వచ్చి దొంగది. దూరాన్నించి మా మాటలు కనిపెట్టి-వెంట బడింది-డబ్బు లిమ్మని."

"ఇచ్చారుటగా?"

"ఇచ్చాను. యాభై రూపాయలు గుంజుకుంది."

"ఎందు కిచ్చారు?"

"చెప్పలేను- పంకజానికి పురుడు వస్తే-మొగపిల్లవాడో ఆడపిల్లో తెలుసుకోవాలని-పెద్ద కోరిక." అన్నాడు ఆనందరావు.

"మీతో అంత సూటిగా-దాపరికం లేకుండా సుందరమ్మగారు మాట్లాడారన్నారు. ఆమెనే అడక్కపోయారా?"

"ఆమె పంకజాన్ని-యీ సంఘటననీ- అన్నిటిని అయిదేళ్ళ పాటు తుడి చెయ్యమన్నారు నా మనసులోంచి! ఆడపిల్లయినా- మొగ పిల్లవాడయినా పెంచి-మేము పెళ్ళి చేసుకుంటే అప్పుడు మీకు అప్ప గిస్తానని మాట యిచ్చారు."

"అయినా మీరు నమ్మలేదుగా?" నవ్వాడు ప్రసాద్ తమాషాగా.

"ఆ ఆయా వుందిచూడండి. అది అందరి బుర్రల్ని చెడగొట్టే స్తుంది. 'దొంగతనంగా పిల్లల్ని కని-పుట్టిన బిడ్డ పీక నులిమేస్తారు. యీ డబ్బుగల వాళ్ళని నమ్మకు అంది, అసలే నాకు 'గిల్టీగా'- ఖంగారుగా వుంది- అటువంటి పని జరక్కుండా రెక్కలు కట్టుకొచ్చి అడ్డుకుందామన్న 'ఫూలిష్ థాట్స్'తో ఆ ఆయాకి నా ఎడ్రసుయిచ్చాను దొంగ ముండ అదేకదూ- మిమ్మల్ని నా దగ్గరకు పంపింది" అడిగాడు.

"అవును" అన్నట్లు తలవూపాడు ప్రసాద్. అతని మెదడు చురుకుగా-ఎలర్ట్‌గా వున్నా-కళ్ళు మూతలు పడి పోతున్నాయి. క్రితం రాత్రి ఆ మురికి లాడ్జిలో బాగా నిద్ర పట్టలేదు. సాయంత్రం మూడు గంటలసేపు ప్రయాణం చేసి- సరాసరి వచ్చేశాడు. ఎంత ప్రయత్నిం చినా కనురెప్పలు వాలి పోతున్నాయి.

"మీకు నిద్రవస్తున్నట్లుంది." అడిగాడు ఆనందరావు.

ఆవలిస్తూ 'కాదు' అన్నట్లు తలవూపాడు.

ఆనందరావు ఫక్కున నవ్వి. "మీ తల అబద్ధం చెపుతున్నా, నోరు నిజం చెపుతోంది. రేపు పొద్దుట మాట్లాడు కుందాం."

"మీకు స్కూలు లేదా-"

"వెళ్ళను. శలవు పెడతాను, ఈ రాత్రి నాకు నిద్రపట్టదు. ఆ విషయం మీకూ తెలుసు- ఆ పిల్లవాడు బ్రతికే వున్నాడని-మీరు

చెప్పేరు. ఎత్తు పీఠంమీద కూచున్నా ఆదర్శమూర్తి, కింద పడి పోయింది. బంగారు విగ్రహానికి కూడా బురద కాళ్ళే అంతే.విచారంగా వుంది." అన్నాడు ఆనంతరావు- అతను ఎవరినిగురించి అంటున్నాడో- ప్రసాద్ మనసులోకి వెళ్ళలేదు. అతనికి అంత మత్తుగా వుంది. నిద్రకూడా వొస్తున్నది. 'గుడ్ నైట్' చెప్పి బయలు దేరాడు హోటల్ కి.

మర్నాడు ఆనందరావు ఇంటినీ ఆ పరిసరాలనీ నిదానంగా చూడగలిగాడు ప్రసాద్.ఆనందరావు కూతురు-రాత్రి బదులు చెప్పిన చిట్టికి-తండ్రి పోలిక. స్కూలు కెళ్ళే హడావుడిలో వుంది. సంచీ బుజాన తగిలించుకుని- తల్లితండ్రికి టాటా చెప్పింది. తండ్రి పోలిక వచ్చిన ఆడపిల్ల అదృష్టవంతురాలంటారు. ఈ అమ్మాయి భవిష్యత్ ఎలా వుంటుంది? ఆనందరావు క్రితం రాత్రికి మల్లేనే-వాలు కుర్చీలో కూచుని వున్నాడు. అతను స్నానాదులు ముగించి-తన కోసం ఎదురు చూస్తున్నాడన్నది అర్థమయింది ప్రసాద్ కి.

"రండి, రండి-బాగా నిద్ర పట్టిందా? రాత్రి మాట్లాడుతుంటేనే మీ కళ్ళు మూతలు పడి పోయినాయి." నవ్వుతూ అడిగాడు ఆనందరావు.

"ఇక్కడింత నిద్ర వచ్చిందా? హోటల్ కెళ్ళేప్పటికి_నిద్ర తేలిపోయింది.రాత్రి మీరు "క్లేఫీట్" (బురద కాళ్ళు)అని అర్థం వచ్చే సిమిలీ వాడారు. ఎవరి గురించా అని-చాలా సేపు మదనపడ్డాను. నేను సరిగ్గా విన్నానా? మీరు ఆ మాట అన్నారా?"

"అన్నాను."

"సుందరమ్మగారి గురించి అనుకుంటా- నా వూహ నిజమే కదూ?" పక్క బెంచీమీద కూచుంటూ అడిగాడు. ఈ ఆనందరావుని చూస్తే- ప్రసాద్‌కి కొత్తమనిషిలాగా అనిపించటంలేదు, చాలారోజుల నుంచీ పరిచయం వున్న ఆత్మీయుడిలా అనిపిస్తున్నది.

"అవును ఆమె నాతో అంత అబద్ధం ఆడతారనుకోలేదు. రాత్రంతా ఆమె గురించే ఆలోచిస్తూ గడిపాను. ఆవిడ గురించి చాలా అనుకొన్నాను. కాని, అటువంటి అబద్ధం ఆవిడ ఎందుకు చెప్పారంటారు?" ఆనందరావు కళ్ళలో బాధ-కను పాపలు నల్లగా- విషాదానికి ప్రతిబింబాలవలె వున్నాయి.

"ఆవిడ అబద్ధం చెప్పలేదు."

"మరిపిల్లవాడు బతికే వున్నాడంటున్నారు."

"బతికేవున్నాడు. అయితే పిల్లవాడు బ్రతికివున్నాడన్నది ఆమెకే తెలియదు. ఇది మరియమ్మ పని. మీ యిద్దరికీ ఆ మరియమ్మే అబద్ధం చెప్పింది."

"మైగాడ్- ఆ దొంగముండ చెప్పిందా? ఎందుకు చెప్పిందంటారు."

"ఊహించండి. మరియమ్మ స్వభావంతో మీకు పరిచయంవుంది. ఎందుకు చెప్పి వుంటుందో ఊహించి చూడాలి,"

"డబ్బుకోసమా? – అదే అయివుంటుంది–"

"అవును."

"పిల్లవాడు బతికుంటే ;డబ్బు గుంజే అవకాశం వుంటుంది గాని–పోయాడంటే ఏం లాభం?"

"మీ పిల్లవాడిని–మూడునెలల వాడిని-తనతోటి ఆయాకి అమ్మే

సింది-రెండువందలకి అమ్మింది-" అన్నాడు ప్రసాద్ చాలా సహ జంగా.

ఆనందరావు మాట్లాడలేదు. అతని కళ్ళలో దెబ్బతిన్న లేడి కళ్ళలోని బాధ-అది దేహానికో-మనసుకోకూడా విడతియ్య లేనటువంటి తీవ్రమైన బాధ-ప్రసాద్‌కి ఆ కళ్ళలోకి చూడాలంటే సంకోచంఉంది. మనిషి హృదయంలోగల తీవ్రమైన బాధ-కళ్ళలో యిలా ప్రతి ఫలించ గలగటం అతనికి యిబ్బందిగా వుంది. ఎలా వోదార్చాలి? మళ్ళా సహజమైన వాతావరణం ఎలా సృష్టించాలి? ఆవరణలోకి చూస్తున్నాడు. ఎదురుగున్న మామిడిచెట్టు ఆచెట్టు వొత్తుగా-ఆకులూ కొమ్మల్తో చిన్నగా ఉంది. కొమ్మలమధ్య పక్షి కాబోలు గూడు కట్టు కునివుంది.ఆగూడులోంచి చిన్న చిన్న కిచ కిచలు! బహుశా అప్పుడే కళ్ళు తెరిచిన పిట్టలు కాబోలు-తల్లి వాటినోట్లో-తన ముక్కుతో ఆహారం పెడుతోంది. అవి ఆత్రంగా-ఎంతతిన్నా చాలవన్నట్లు నోళ్ళు తెరిచి చూస్తున్నాయి.ఆ దృశ్యం ఎంతో మనోహరంగా ఉంది.ప్రసాద్ చెట్టుమీంచి తన దృష్టిని ఆనందరావు పైపుకి తిప్పాడు, అతనూ ఆ పిట్టలపై పే చూస్తున్నాడు. అప్పుడే కళ్ళు తెరిచిన ఆ పిట్టలకి-తల్లి ఆహారం పెడ్తోంది-తన ముక్కుతో. ఆ దృశ్యం అతని మనసులో ఎటువంటి ఆలోచనలని, సంక్షోభాన్ని రేకెత్తిస్తున్నదో! ఆనందరావు కళ్ళు తడితో తళతళమంటున్నాయి. ఏ క్షణాన్నైనా ఆ కళ్ళు వర్షించ వచ్చు! రెప్పవాల్చకుండా-ఆ తల్లి పిట్టవంకే చూస్తున్న అతని హృద యంలో ఎన్ని సముద్రాలు ఘోషిస్తున్నాయో! ఎన్ని అగ్ని పర్వతాలు బద్ధలవుతున్నాయో!

తలుపుదగ్గర-గుమ్మం వెనుక ఎవరో నుల్చున్న అలికిడి. ఆనందరావు అంతర్ దృష్టి వున్నట్లు-తలవెనక్కి తిప్పిచూసి-'రా'

అన్నట్లు సైగ చేశాడు. ఆమె లోపలికెళ్ళి-ట్రేలో వేడి వేడి వుప్మా-రెండు ప్లేట్లలో పెట్టుకు, తీసుకొచ్చింది. ఆనందరావు- వాలుకుర్చీ చేతులమీద పొడవైన వ్రాతబల్ల ఉంది-క్రితంరాత్రి ఆ బల్లమీదే పేపర్లు పెట్టుకుని దిద్దుతూవుంటం గమనించాడు ప్రసాద్. ఈపూట పేపర్లకట్టలు లేవు. ఆ బల్లమీద "హిందూ" వుంది. అది పక్కకి తోసి-వుప్మా ప్లేటు బల్లమీద ఉంచమన్నట్లు సైగ చేశాడు.

ఆమె ఆనందరావు భార్య అయి వుంటుంది-అనుకున్నాడు ప్రసాద్. చామనఛాయగా- సన్నగాఉంది. పెద్ద అందగత్తె కాదు, అనాకారి కాదు. మామూలు మధ్యవయసు గృహిణిలాగా ఉంది. వొంటిమీద నగలు లేవు. సామాన్యమైన చీరె కట్టుకుని ఉంది-ఆధునికంగా కూడా లేదు.

"మా ఆవిడ రమణి." అంటూ పరిచయం చేశాడు.

ఆమె చిరునవ్వు నవ్వి-నమస్కరించింది."టిఫిన్ తీసుకోండి-" అంది అతి నెమ్మదిగా.

ఆనందరావు చెప్పాడు కాబట్టి ఆమెకి చెముడు అని తెలిసింది గాని-పైకి ఏ లోపం కనిపించడం లేదు.

ప్రసాద్ మారుమాట్లాడకుండా ప్లేటు చేతులోకి తీసుకున్నాడు. అతను టిఫిన్ తీసుకునే వచ్చాడు. కడుపునిండుగా వుంది-అయినా "వొద్దు" అని చెప్పే ధైర్యం లేకపోయింది.

"బయట డ్రయివరు ఉన్నాడు - అతనికికూడా పెట్టు-" అన్నాడు ఆనందరావు చాలా నెమ్మదిగా స్వరం తగ్గించి.

ఆమె అతని పెదిమల కదలికను జాగ్రత్తగా గమనించి-లోపలికెళ్ళి మరో ప్లేటుతో వుప్మా తీసుకొచ్చి-వీధివైపుకి వెళ్ళింది. భర్త

పెదిమల కదలికను బట్టి ఆమె సులభంగామాటలని అర్థం చేసుకుం టుంది కాబోలు అనుకున్నాడు ప్రసాద్.

ఆనందరావు తన భావ సంచలనాన్ని-ఉద్రేకతని అదుపులో పెట్టుకున్నట్లున్నాడు. "చూశారా-రాత్రి మా దాంపత్యం చూసి మీకు జాలివేసింది కదూ!- చాలామంది మమ్మల్ని చూసి "అయ్యో-పాపం" అనుకుంటారు మొదట: మేమూ అందరిలాగా-మామూలుగానే ఉంటా మండి." నవ్వాడు పెదిమల్తో.

లోపల్నించి-రెండుగ్లాసుల్తో కాఫీ వచ్చింది. ఆమె కాఫీ బల్ల మీద పెట్టి-ఖాళీప్లేట్లు పట్టుకెళ్ళింది.

"నాకోసం లీవు పెట్టారా? రాత్రే చెప్పివుండాల్సింది-సాయిం త్రం వచ్చి వుండేవాడిని." అన్నాడు ప్రసాద్ నొచ్చుకుంటూ.

"ప్రశాంతంగావున్న కొలనులో రాయివేశారు. అలలు రాకుండా ఎలా ఉంటాయి?" చిరునవ్వుతో అన్నాడు ఆనందరావు.

ప్రసాద్ మాట్లాడలేదు.

"మీకు నా కాళ్ళగురించి చాలా ప్రశ్నలు వస్తున్నాయి కదూ- మర్యాద కాదని అడక్కుండా వూరుకున్నారా.ఈ కాళ్ళ మూలంగానే మాకు పెళ్ళి జరగలేదు."

"ఎప్పుడు జరిగింది? ఎలా జరిగింది?"

"సుందరమ్మగారు-నన్నో పెద్ద విపత్తునుంచి తప్పించారు-నా నెత్తిన భారం పడకుండా-ఆ బరువు తనే మోస్తానన్నారు. ఆమె కూడా అందరి తల్లులకిమల్లే-పంకజాన్ని పెళ్ళి చేసుకోమని నామీద వొత్తిడి తెచ్చి-గోలచేసి వుంటే....యీ పాటికి ఏ గుమాస్తాగానో- రూపాయీ రెండుకీ యిబ్బంది పడుతుండేవాడిని."

"తమాషాగా చెపుతున్నారు."

"మీకు తమాషాగా అనిపించినా-అది పచ్చి నిజం. మా నాన్న గొప్ప చాదస్తుడు. డబ్బు వుండీ-వితరణంలేని సగటు మనిషి. కట్నం పుచ్చుకోవాలి-గొప్ప సంబంధం వేసుకోవాలి-యిత్యాది కోరికలున్న మనిషి మానాన్న-"

"రావుగారు గొప్ప వాళ్ళేగా?"

"అయితే మటుకు, నెల తప్పిన పిల్లను చేసుకోనిచ్చే వుదారుడు కాదు మానాన్న. నా మెడలు వంచి సుందరమ్మగారు పెళ్ళి చేసివుంటే నేను యింట్లోంచి వచ్చేసి యిల్లరికపు అల్లుడిని అవాల్సివచ్చేది. లేక పోతే ఏ గుమాస్తా వుద్యోగమో సంపాయించి-పాలడబ్బాల కోసం తిట్టుకుంటూ వుండేవాళ్ళం. ఆవిడ గొప్పవ్యక్తి. ముందుచూపుతో యివన్నీ తప్పించారు. నాకు అయిదేళ్ళ టైము యిచ్చారు. చదువు కుని-నిర్ణయానికి రావటానికి-"

"అవును-చెప్పారు-"

"దాని విచిత్రం ఏమిటంటే-ఆమె తీసుకున్న నిర్ణయం ఎంత గొప్పదో ఆనాడు నాకు అర్థంకాలేదు. అప్పటికి తాత్కాలికంగా బరువు నెత్తిన పడకపోయినా-మనసులో ఏదో వెల్తి. నా బాధ్యత నేను నిర్వహించనీయకుండా ఆమె అడ్డుకున్నారని-ఎక్కడో గుచ్చు కుంటూ వుండేది-"

"మీరు చెప్పినసైకాలజీ-తరుచుగా కనిపిస్తూంటుంది. మనకోసం యితరులు మంచి నిర్ణయాలు తీసుకున్నా, అది నిర్ణయించుకునే 'ఛాయిస్' మనకి వదలనపుడు, కాస్త కినుకగా వుంటుంది."

"ఎగ్జాట్లీ-నాకూ అలాగే ఉండేది. ఆ సంవత్సరం చదువు పూర్తి చెయ్యలేకపోయాను. అలాఅని హాస్పటల్‌కి వెళ్ళిచూసే ధైర్యమూలేదు. సుందరమ్మగారికిచ్చిన మాట తప్పే మనోబలమూ లేదు. మానాన్నను పీడించి డబ్బు తీసుకుని-ఛెడామడా వూళ్ళు తిరుగు

తూండేవాడిని. అప్పుడే-బస్ యాక్సిడెంటు అయింది-నిండుగా వున్న బస్-హైద్రాబాద్ నుంచి వస్తూ చెట్టుకు కొట్టుకుంది. ముందు వరసలో వున్న నేను-కిందకి పడిపోయానట. రెండు కాళ్లూ చక్రం మధ్యన చిక్కుకున్నాయట. నాకైతే తెలియదు-స్పృహ వచ్చాక-ఆస్పత్రిలో, ఒక్కొక్క పాసింజరూ యాక్సిడెంట్ ఎలా జరిగిందో చెపుతూ వచ్చారు. డ్రయివరూ-అతని ఎడంవైపు కూచున్న ముగ్గురూ నుగ్గు నుగ్గయి పోయారు. నేను మటుకు రెండు కాళ్లూ పోగొట్టుకుని ప్రాణా లతో బయటపడాను-"

"ఎన్నాళ్లున్నారు మంచంమీద?"

అతను బాధగా నవ్వాడు. అవి రోజులుకాదు, గంటలుకాదు, నిముషాలుకాదు, క్షణాలు-క్షణం క్షణం అని లెక్క పెట్టినపుడు, నేను పడ్డబాధ- నెప్పి అర్థం అవుతాయి.జంతువులాగాఅరిచానుట-నా కంఠం నాదిలాగా లేదుట, కీచుగా- వెర్రికేకలు వేశానుట. నాకైతే తెలియదు. ఆ తరువాత ఆ తరువాత, రెండుకాళ్ళు తీసేశాక-నయమవటానికి బాధ కాళ్ళులేని నా స్థితికి భయం. ఎలా? ఎలా? ఏమైపోతాను? ఎలా బ్రతుకు తాను? అన్నభయం. ఎన్నిసార్లు చచ్చిపోయానో-ఎన్నిసార్లు మృత్యు వుని- రమ్మని కోరుకున్నానో.... చెప్పినా అర్థంకాదు."

ప్రసాద్ మాట్లాడలేదు. కొన్నిసమయాల్లో మాటలు భావ శూన్యంగా పేలవంగా వుంటాయి.

"ఆ తరువాత - నాకు కర్రకాళ్లు - బూట్లు పెట్టటానికి ప్రయ త్నం .... అబ్బా.... అది తల్చుకుంటే .... ఆ రోజులు, ఆ యాతన బాధ, నిస్సహాయత-కోపం....కసి. ఒక్కోరోజున అలా దేక్కుంటూ లోకంలోకి వెళ్ళిపోవాలి. కాళ్ళులేని కబోధిని - అంటూ అడుక్కుని

బ్రతకటం పోయి అనిపించేది. ఇనపబూట్లు ఎడ్జస్ట్ అయేప్పటి బాధ అనుభవిస్తున్నపుడు ప్రతిరోజూ యమయాతన ఆ షూస్ తొడగటానికి డాక్టరు వస్తాడంటే భయం- ఎంత ఆత్మశక్తి వున్నా దైహికమైన బాధ తట్టుకోటం చాలా కష్టం-"

"అయ్ అండర్‌స్టాండ్"

"మీకు అర్ధంకాదు-మీరు వూహించుకోలేరు. ప్రతిక్షణం 'నేను పాపం చేశాను. ఒక ఆడపిల్ల జీవితం పాడుచేశాను. ఆ పాపం వల్లే నాకీ శిక్ష పడింది' అన్న భయం-దైహికమైనబాధ. ఈ రెండూ నన్ను తూట్లు పొడుస్తుండేవి. మానసికమైన భయం, పాపభీతి- యివి మనిషిని చెదలా తినేస్తాయి. కర్రని దొలిచినట్లు-బుర్రని క్షణం క్షణం దొలిచేసి, చిత్రహింసకు గురిచేస్తుందీ పాపభీతి. మందులు తినే వాడిని-హాస్పటల్‌లో అన్నివైద్యాలు చేస్తున్నారు. నాకు బలం పట్టేది కాదు. ఎంత ప్రయత్నించినా-బూట్లు వేసుకుని-కదలలేక పోయే వాడిని. చిన్న వయసులో వున్న-నేను ఎందుకిలా వైద్యానికి- రెస్పాండు అవటంలేదో డాక్టర్లకి-మా వాళ్ళకి కూడా బోధపడేదికాదు. కాళ్ళు లేకపోయినా ప్రాణంతో వున్నందుకు నాతల్లి తండ్రులు వెయ్యి దేముళ్ళకి మొక్కుకున్నారు.... అయినా నాలో భయం- అశాంతి. మరీ రాత్రిళ్లు ఒక్కోసారి భయంతో పిచ్చికేకలు వేసే వాడినట. అది బస్ కింద పడినప్పటి భయం అనుకునేవారు. కాదు- 'నేను తప్పు చేశాను. దానికి ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను' అన్న బాధ....ఈ మానసిక క్షోభ అనుభవించలేక-నా మనసులో భయాన్ని ఎవరి ముందైనా వెళ్ళ బోసుకోవాలని తహతహలాడిపోతూండే వాడిని— అప్పుడే సుంద రమ్మగారికి వుత్తరం రాశాను. "నా గురించి పూర్తిగా మర్చిపోండి. రెండుకాళ్ళూపోయి, ఆస్పత్రిలో వున్నాను. నన్ను క్షమించండి."

అని ఎందుకు రాశానో-ఏ ప్రేరణవల్ల రాశానో-యిప్పటికీ చెప్పలేను. కాని వుత్తరం రాసిపడేశాను-వాణికే చేతుల్తో."

"జవాబు రాశారా?"

"అంతకంటే అద్భుతమైన పనిచేశారు."

"ఏంచేశారు? మిమ్మల్ని క్షమించారా?"

"మీరు వూహించుకోలేరు. అసలు మామూలు మనుషులు యింత వుదాత్తంగా ప్రవర్తించలేరు. ఆమె వారంలోపున హైద్రాబాద్ వచ్చారు-నన్ను చూడటానికి-తనే స్వయంగా వచ్చారు."

"నిజంగానా? మిమ్మల్ని చూడటానికి వచ్చారా?"

"ఆమె రావటం-నా జీవితంలో గొప్ప మలుపు. రావటమేకాదు నా మంచంమీద కూచుని-నన్ను వోదార్చారు. పాపభీతి-పాపం గీపం యిలాంటివి ఏమీ మనసులో పెట్టుకోవద్దు-అన్నారు. జరిగిన విషయాలు అందరూ మర్చిపోవాలన్నారు"

"అందరూ అంటే-మీ వాళ్ళకి తెలుసా?"

"ఊహూ. పంకజం-ఆమె, నేను, అని అర్థం. ఆ పుట్టినవాడు ఎవరిప్రమేయం లేకుండా యీలోకంలోకి వచ్చిన ఆ ప్రాణి, పోయాడని ఆమే చెప్పారు."

"ఆవిడకు ఎలా తెలుసు?"

"పంకజం కోలుకోటానికి ఆర్నెల్లు పట్టిందట. హాస్టల్లో వుంచి పంకజాన్ని మళ్ళీ పి. యు.సిలో జేర్చారుట. ఆ తరువాత మరియమ్మ దగ్గిరకి వెళ్ళారుట-ఆ పిల్లవాడిని తీసుకురావటానికి."

"రిమార్కబుల్"

"అవును. అందుకు సందేహంలేదు. ఆ పిల్లవాడిని తను

పెంచి-పెద్ద చెయ్యాలనుకున్నారు. అంతదాకా మరియమ్మని-చూడమని కొంత డబ్బు యిచ్చారుట."

"అవును-అయిదువేలు-"

"అరే బాప్‌రే-అయిదువేలా? మీకెల్లా తెలుసు?"

"పదివేలిచ్చారని నేను డబాయిస్తే పది కాదు అయిదు అంది," అన్నాడు ప్రసాద్

"ఆ పిల్లవాడు మూడునెలలు బతికి-చచ్చిపోయాడని చెప్పిందిట. ఎక్కడ పాతిపెట్టారో కూడా చూపించిందట-"

"ఓసి ద్దనిదుంపతెగా-" అన్నాడు ప్రసాద్ ఇంకేమనలేక.

"అప్పుడు చెప్పారు. నువ్వు పాపం చేశానని కుమిలిపోకు-ఆ పిల్లవాడులేడు-పంకజం నిన్ను మరిచిపోయినట్లే లెక్క. మామూలుగా సరదాగా కాలేజికి వెళ్తోంది-నువ్వు ఎందుకిలా హింస పడుతున్నావు. నామీద గౌరవం వుంటే, నువ్వు చదువుకోవాలి-నాకిచ్చిన మాట మర్చిపోతున్నావు. నువ్వు యమ్.ఎ. అవాలి." అంటూ నాకు ర్యం చెప్పి వోదార్చారు." చెప్పటం ఆపి అలా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు ఆనందరావు. బహుశా అతను జ్ఞాపకాల దొంతర్లలో వెతుకుతున్నాడేమో!

"ఆమెరాక నాలో గొప్ప మార్పుతెచ్చింది-" చెప్పటం ఆరంభించాడు మళ్ళీ "నా మనసులోని భయాల్ని చెప్పుకున్నాక-హృదయభారం తగ్గింది. మనసు తేలికపడింది. సుందరమ్మగారు వాళ్ళ ఊరు వెళ్ళాక నాకు పోస్టులో రెండు పుస్తకాలు పంపారు."

"ఏమిటవి-?"

"రూజ్‌వెల్ట్ బయాగ్రఫీ -రెండోది హెలెన్ కెల్లర్ జీవితచరిత్ర. ఈ రెండూ తెలుగు ట్రాన్స్‌లేషన్సు పంపారు. నాకు పుస్త

కాలు చదివే అలవాటులేదు. ఆమెమీద గౌరవంతో, కాలం గడవ టానికి ఆరెండూ చదివాను. అక్కడితో నేను చీకటినుంచి వెలుగు లోకి వచ్చాను. మళ్ళీ జన్మఎత్తాను. కొత్తమనిషిని అయాను. అంత దాకా వున్న పాపభయం పోయి,పట్టుదల, ధైర్యం వచ్చాయి. అప్పుడు కోలుకోవటం మొదలు పెట్టాను. కాళ్ళకి షూస్ కూడా వేసుకుని నెప్పయినాసరే-మంచంపట్టుకుని నడవటం ప్రారంభించాను." అని దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు ఆనందరావు.

"మనుషులందరూ ఒకటే అని వుపన్యాసాలు యిస్తూంటారు. సుందరమ్మగార్ని గురించి తెలుసుకున్నాక-అవి ఎంత అబద్ధాలో అనిపిస్తోంది"

"నిజమే. ఆమె పైకి మామూలు గృహిణిలాగా కనిపిస్తారు. పచ్చగా-వంటినిండా నగల్తో ప్రసన్నంగా వుంటారు. ఇలా ఎంత మంది స్త్రీలు వుండరు! వుంటారు చాలామంది మధ్యవయసున్న సంపన్న గృణిణులు పైకి నవ్వుతూవున్నా వాళ్ళలో యింతటి సంస్కారం, ఆలోచనాశక్తీ వుండదు. గృహిణిలందరూ- సుందరమ్మ గారు కారు-కాలేరు." అన్నాడు ఆనందరావు తీర్పు చెపుతున్నట్లు.

"మీరు మళ్ళీ ఆస్పత్రికి వెళ్ళారని విన్నాను. మరియమ్మకి మీ యాక్సిడెంటు గురించి తెలీదా?"

"ఊహూ. తెలిసే అవకాశంలేదు. ఎందుకంటే- నేను కార్లోంచి అంటే టాక్సీలోంచి దిగ్లేదు. ఈ మరియమ్మవుంది చూశారా దానిది డెవిలిష్ బ్రయిన్. అది నాకోసారి వుత్తరం రాసింది."

"డబ్బుకా."

"కాదు. నేను ఆస్పత్రినుంచి వచ్చాక ఒక నెల్లాళ్ళకను కుంటా. మొగపిల్లవాడి బొమ్మ కార్డుమీద అంటించి, పంపింది."

"ఫోటోవా?"

"కాదు. మామూలు పేపర్లో పడే బొమ్మ కత్తిరించి కార్డుమీద అంటించి-కింద సంతకం పెట్టింది. దాని తెలివి తేటలు గ్రహించారా! పిల్లవాడు పుట్టాడనే సమాచారం నాకు తెలియచెయ్యాలి. ఉత్తరం రాస్తే పట్టుబడతానని భయం."

"ఎవరి భయం?"

"సుందరమ్మగారి భయం అయివుంటుంది ఆ విషయం గుంభనగా రాసింది."

"అప్పటికి యాక్సిడెంట్ అవలేదనుకుంటా."

"కాలేదు. కాని మొగపిల్లవాడు అనేప్పటికి నాలో ఏదో కదలిక. సిగ్గుతో కూడిన గర్వం. నారక్తం-నాలోని అంశ యిలా-ఆ ఉత్తరం ఎవరికీ తెలియకుండా జేబులో పెట్టుకు తిరిగాను. కాని, వెళ్లే ధైర్యం లేకపోయింది. ఆ తరువాత అంతా మీకు తెలుసు."

"మీరు వచ్చారని చెప్పింది. అది మరో అబద్ధమా?"

"కాదు, వెళ్లాను. హాస్పటల్ నుంచి డిశ్చార్జి చేశాక ఎందుకో ఒకసారి వెళ్ళి నిజానిజాలు కనుక్కోవాలనిపించింది."

"అప్పుడెళ్ళారన్నమాట. అప్పటికే-పిల్లవాడిని అమ్మేసింది-యీ లంఖిణీ- అందుకే భయపడి-పోయాడని చెప్పింది." అన్నాడు ప్రసాద్.

"చిత్రం. పిల్లల్ని అమ్ముకోటం కొనటం ఇది కథల్లో చదువుతాం. నా రక్తాన్ని, ఒక స్త్రీ అమ్మితే-యింకో స్త్రీ కొనుక్కుందా?"

"సారీ, మీకు బాధ కలిగిస్తున్నాను. ఆ విషయం చెప్పకుండా వుండాల్సింది."

"నిజం ఎప్పుడూ బాధపెడుతుందండి. అది జీవితం నాకు నేర్పిన పాఠం."

"ఆ పిల్లవాడి గురించి-మీకు కుతూహలం లేదా!"

"ఉండి, ప్రయోజనం?"

"అవకాశం వుంటే వెనక్కి తీసుకొచ్చి...."

"ఊహు. అల్లాంటి పని చెయ్యను. సుందరమ్మగారు నాకు కొన్ని ఆదర్శాలూ- నిబంధనలూ వుండాలని-ఆదేశించారు. మాటల్లో కాదు.ఆమె ఆచరణలోచేసి చూపారు.ఆ పిల్లవాడివల్ల-ఇక్కడవున్న నా భార్యకీ, పిల్లకీ బాధకలుగుతుంది. సాఫీగా వెళ్ళిపోతున్న వాళ్ళ జీవితాల్ని సమస్యల మయం చెయ్యను."

"మీ అంతటి-మనోబలం అందరికీరాదు."

"నాకూలేదు. రాత్రంతా మథనపడ్డాను. ఆవిడ యిరవై ఏళ్ళ క్రితం-యీ ప్రాణివల్ల ఎవరి జీవితాలూ తల్లకిందులు కాకూడదని, అతి జాగ్రత్తగా వ్యవహరించారు.ఒక స్త్రీ ఆ పని చెయ్యగలిగినపుడు-నేనెందుకు చెయ్యలేను."

"మీకు మనశ్శాంతిగా ఉంటుందని చెపుతున్నాను. రాబీకి-మన యిళ్ళలోకంటే-స్వంత తల్లితండ్రుల వద్ద కంటే ఎక్కువ ప్రేమా, అభిమానమూ లభించాయి. అది నేను నా కళ్ళతో చూసి చెపుతున్నాను." అన్నాడు సాయిప్రసాద్.

"ఇక ఆ విషయాలు చెప్పకండి. ఇరవై ఏళ్ళ క్రితం జరిగిన దుర్ఘటన అది. అయిపోయింది. ఎక్కడి వాళ్ళం అక్కడ సర్దుకున్నాం." అన్నాడు ఆనందరావు.

కొంతసేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది ఆ యిద్దరి మధ్యా.

"ఇంతకీ_మీ సందేహం నివృత్తి అయిందా?"

"అయింది. కాని మీ దగ్గరనుంచి తెలుసుకున్న విషయాలవల్ల, ప్రస్తుతం నాకేం వుపయోగంలేదు."

ప్రశ్నార్థకంగా చూశాడు ఆనందరావు

"సుందరమ్మగారు-ఆ పిల్లవాడిని గుర్తించారు."

"ఎల్లా?"

"ఆ విషయాలు ఎత్తవద్దన్నారుగా."

"నా హృదయాన్ని కదిలించే విధంగా చెప్పద్దన్నాను-మీరు యింత దూరం ఒక లక్ష్యంతో వచ్చినపుడు-కనీసం సలహా యివ్వటంలో తప్పులేదుగా."

"ఆ పిల్లవాడి కుడిపాదం మెలికపడి వుంది-పైపెదవిమీద తొర్రె-ఆరేసి వేళ్ళు రెండు చేతులకీ...."

"మైగాడ్ ...."

"ఆ రోజుల్లో నిద్రమందులు చాలా వాడాయిట. బహుశా ఎబార్షన్‌కి కూడా ప్రయత్నించి వుండచ్చు అంచేత యీ అవకరాలు...." ఆగిపోయాడు ప్రసాద్

ఆనందరావు కళ్ళలో నీలినీడలు. "తెలిసీ తెలియని వయసులో చేసిన-ఆచిన్న పొరబాటుకి యింత శిక్ష-యింత వేదనా వుంటుందా?"

"నేనెవర్ని చెప్పటానికి? మనం అందరం-ఎప్పుడో ఒకప్పుడు తప్పులు చేస్తూనే వుంటాం, శ్రీరామచంద్రులు ఎక్కడా వుండరు-వుండబోరు" అన్నాడు ప్రసాద్.

"అటువంటప్పుడు-యీ శిక్షఏమిటి చెప్పండి? ఇరవై ఏళ్ళయినా-నేరం చేశానన్న బాధ నా హృదయంలో కలుక్కుమంటూనే వుంటుంది-"

"మీరు ఒక విషయం మర్చిపోతున్నారు-నేను చెప్పిన యీ మూడూ-సుందరమ్మగారు గుర్తించటానికి కారణం అయాయి తప్ప, ఆ పిల్లవాడిని-వాళ్ళు. అంటే ఆ పెంచుకున్న వారు, యీ దృష్టితో చూడటంలేదు. అది మనలాగా వాళ్ళు అవకరం అనికూడా అనుకోటం లేదు."

"మరి దేనికీ గొడవంతా?"

"సుందరమ్మగారు-ఆ పిల్లవాడిని గుర్తించి, చంద్రహారం యిచ్చారు. అది నిశ్చయంగా నిరూపణ అయింది."

"మీరు ఇందాక అన్నారు. నిజంగా ఒక పిల్లవాడిని అమ్మటం, యింకా యీ కాలంలో జరుగుతోందంటారా?"

"ఆహా! రూపాయిన్నర స్టాంపు పేపరుమీద కరణం నోటరీ యిద్దరూ సంతకాలు పెట్టిన పత్రం నేను కళ్ళతో చూశాను." అన్నాడు ప్రసాద్.

"మనం ఎక్కడికి వెళ్ళిపోతున్నాం? ఎందుకిలా అయిపోతున్నాం?" తనలో తాను ప్రశ్నించుకున్నట్లు అడుగుతున్నాడు ఆనందరావు

ప్రసాద్ జవాబు చెప్పటానికి ఏమీ లేదన్నట్లుగా విని వూరుకున్నాడు.

"ఆ పిల్లవాడు-నాకు పుట్టాడని పైకి చెప్పటంలో ఏమన్నా ప్రయోజనం వుంటుందా?" అని అడిగి, "ఊహూ వుండదు. అప్పుడు పంకజం పేరు బయట కొస్తుంది.... ఈ చిక్కు ఎలా విడదీస్తారు?" అడిగాడు.

ప్రసాద్, ఆనందరావు మాటలు వింటున్నా, తనలో తాను ఆలోచించుకుంటున్నాడు ఈ ఆనందరావు-పంకజం గురించి ఒక ప్రశ్న అడగలేదు. కనీసం ఆమె గురించి కుతూహలం కూడా లేదా?

లేక, కావాలనే ఆలోచనలు అటువైపు వెళ్ళకుండా మనసుని కంట్రోల్ చేసుకోగలుగుతున్నాడా? ఎదుట కూచున్న అతనివంక మరోసారి చూస్తున్నాడు ప్రసాద్ వొత్తుగా వున్న-పండిపోయిన జుట్టు నుదుటి మీద పడుతోంది, తెల్లగా బొద్దుగావున్న ఆకృతి- ఆ కళ్ళు మటుకు-రిమార్కబుల్‌గా ఉన్నాయి. యువకుడిగా వున్నపుడు ఈతను అందగాడై వుండాలి.

"మీరు ఇద్దరూ ప్రేమించుకున్నారా?" అడిగాడు ప్రసాద్ తనమీద తనకి కంట్రోల్ లేకుండా.

ప్రసాద్ ఉలిక్కిపడి "ఎవరు?" అని అడిగి మళ్ళీ సర్దుకుని ఆ ప్రశ్నను అర్థం చేసుకున్నట్లు నవ్వి "ప్రేమ-అంటే ఏమిటి?"

"ఆకర్షణ అనండి. ఒకరు లేకపోతే ఇంకొకరు బ్రతకలేమన్న భావం అనండి. మీరు ఎలా అనుకుంటే అలా?"

"అలా అయితే అవేమీకావు అని చెప్పాల్సివస్తుంది. వీటన్నిటికి మించి "వయసు" అని చెప్పుకోవాలి. అవకాశం, వయసు, కుతూహలం, అజ్ఞానం, జరుగపోయే పరిణామం వూహించలేని అమాయకత-ఇవి తప్ప ఇంకేమీ కారణం కాదు. నిజం చెప్పాలంటే-పంకజం మొహం ఎలా వుంటుందో కూడా జ్ఞాపకంలేదు. ఈనాడు పంకంజం కనిపిస్తే. నేను గుర్తించలేకపోవచ్చు. పంకజం కంటే-సుందరమ్మగారే నాకు ఎక్కువ జ్ఞాపకం వస్తూంటారు. ఆమె ముద్ర నా మనసుమీద ఎక్కువ వుంది." అన్నాడు ఆనందరావు.

ఈ వ్యక్తిలోని నిజాయితీ చూస్తే ప్రసాద్‌కి గౌరవంకలుగుతోంది. మనసులో ఒకటీ, పైకి ఒకటీ మాట్లాడే వ్యక్తికాదు ఇతను. "మీ దగ్గరకొచ్చాను. విషయాలు తిరగ తోడి మిమ్మల్ని బాధపెట్టాను. అయినా యీ సమస్య ఆరంభం అయిన చోటనే వుంది. చంద్రహారం ఎలిజబెత్ తమ్ముడు రాబీకి ఇచ్చిన మాట నిజం. అందుకు కారణం వుంది. అది పైకి ఎలా చెప్పడం? పోనీ, మీ పేరు చెపుతామనుకోండి

మీకు ఆ కుటుంబంతో వున్న సంబంధం పైకి చెప్పాలిగా. అప్పుడు" ఆగిపోయాడు ప్రసాద్.

"సుందరమ్మగారి ప్రభావం నామీద వున్నట్లే ఆ యింట్లో మిగతావారి మీదవుంటే- ఇంత గొడవరాదు. పోనీ, రావుగార్కి చెప్పండి."

"ఏమని?" అడిగాడు ప్రసాద్.

"ఆ పిల్లవాడి గురించి"

"అది న్యాయం కాదు. పంకజానికి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు"

"అయితే ఆ హారం వెనక్కి యిచ్చేసి- పొరబాటు జరిగిందని. ఒప్పేసుకోమనండి ఆ నర్సుని."

"నిజాయితీ గురించి మీకెంత శక్తివుందో....ఆ నర్సుకీ అంత పట్టుదలవుంది."

"యాగీ చేస్తుందా?"

"ఛీ-ఛీ అల్లాంటిది కాదు. నా ఫ్రెండు, డాక్టర్ పేరూ, వాళ్ళ నర్సింగ్ హోమ్ పేరూ చెడిపోటం ఒప్పుకోనంటున్నది."

"ఎలా? ఈ చిక్కుముడి ఎవరు విప్పుతారు? ఇందులో నా పాత్రని ఒప్పుకోమంటే- బహిరంగంగా ఒప్పుకుంటాను. ఉత్తరం రాసి యిస్తాను కావాలంటే! కాని, తల్లి ఎవరు?- అన్న ప్రశ్న వస్తుంది. అది బయటకొస్తే తప్పు- అది దొంగతనంకాదు, అన్నది ఋజువులేదు. ఒక చంద్రహారం కోసం యిన్ని జీవితాల్ని కదల్చడం న్యాయం కాదనుకుంటా-"

"మరి- నిజం మాట ఏమిటి?"

"ముందే చెప్పానుగా. నిజం ఎప్పుడూ చేదుగా వుంటుంది.

సమస్యల్ని సృష్టిస్తుందని. ఆ చంద్రహారానికి బదులుగా-డబ్బిస్తాను—ఆ నర్సు వూరుకుంటుందేమో కనుక్కోండి."

"మీరా?"

"నా బాధ్యతా యిందులో కొంత వుందికదా- ఏమీ చెయ్యలేక పోయినా-డబ్బివ్వగలను." అతని కంఠం బొంగురుగా వుంది-వేదనా భరితంగా వుంది.

ప్రసాద్, ఆనందరావు భార్యని గమనించాడు. ఇంటి పరిసరాలను పరిశీలించాడు- పెద్ద డబ్బున్న వాడిలాగా కనిపించలేదు. రెండు కాళ్లూలేని యీ వ్యక్తి ఎలా జీవిస్తున్నాడు? మొదటిసారి ఆలోచన వచ్చింది- జీవితం ఎలా గడుపుతున్నాడు-కుటుంబ పోషణ ఎలా జరుగుతోంది అని!

"ప్రస్తుత సమస్య డబ్బుతో తీరదు. అవతల ఆ నర్సుకి డబ్బు మీద భ్రమలేదు. పిల్లవాడే వాళ్ళకి ముఖ్యం. కాని దొంగతనం అంటగడితే మటుకు వూరుకోరు."

"ఏం చేస్తారు?" అడిగాడు కుతూహలంగా.

"ఒక స్త్రీ జీవనాధారం పోతుంది. ఆ నర్సు, తన తమ్ముడినీ-తల్లినీ పోషించాలి. తనకొచ్చే జీతంతో! రెండు దొంగకాని- ఒక ఆడదాన్ని దొంగ అంటున్నాము. మూడు; ఒక నర్సింగ్ హోమ్‌కి యింత వరకూరాని- ఒక చెడ్డపేరు వస్తుంది. డాక్టర్ మూర్తి యీ నర్సుపై దొంగతనం రుద్ది-నర్సింగ్‌హోమ్ ప్రతిష్టను కాపాడుకోవచ్చు. కాని అతని అంతరాత్మ వొప్పుకోటంలేదు. అదీ అసలు వచ్చిన చిక్కు."

"చూశారా? అంతరాత్మ అనేది వుంటే యిదే చిక్కు."

"మీకు లేదా?"

"ఉంది కాబట్టే! లేకపోతే, వాళ్ళెవరో నాకు తెలియదు, అనేద్దును. కాని-కాని" ఆగిపోయాడు ఆనందరావు.

"ప్రస్తుత సమస్యతో సంబంధంలేని కొన్ని సంగతులు అడగనా? మీ వ్యక్తిగతమైనవి. ఇబ్బంది అయితే వొద్దు అనండి. నేనేమీ అనుకోను"

"నా జీవితంలోని అవమానకరమైన కాలం గురించి చెప్పాను. అది ఒక బ్లాక్ స్పాట్. ఇంక దాచుకోవల్సినవి ఏమీలేవు. అడగండి"

"మీరు ఎలా చదువుకున్నారు.... పెళ్ళి....?"

"అవా?" పక పక నవ్వాడు ఆనందరావు. "ఇవి అందరూ అడిగే ప్రశ్నలే. ఇంట్లోవుండే-ప్రయివేట్‌గా బి.ఎ. పూర్తి చేశాను. యూనివర్శిటీకి నా పరిస్థితి రాసుకుంటే- ప్రయివేట్‌గా ఎమ్.ఎ రాయటానికి పర్మిషన్ యిచ్చారు. ముందు ఎకనామిక్స్ చేశాను. ఆ తరువాత సరదాకి—పొలిటిక్స్-ఫిలాసఫీ చేశాను. ట్రిబుల్ ఎమ్.ఎ. చేసిన, కాళ్ళులేని ఆనందరావు-అంటూ మా ఫ్రెండ్స్ నవ్వుతూంటారు" అతని కంఠంలో కించిత్ గర్వం.

"మరి స్కూలుకి ఎలా వెళ్తూంటారు?"

"స్కూలుకాదు-జూనియర్ కాలేజికి. ట్రైసికిల్ వుంది. దానికి మోటారు ఫిక్స్ చేయించాను....చాలా రోజులు 'పెళ్ళి వద్దు' అనుకున్నాను. కాని మా నాన్న అమ్మా-నాకు ప్రపంచజ్ఞానం నూరిపోశారు "మేము వెళ్ళిపోతే-నిన్ను చూసుకునే తోడు రావాలి"- అని పోరి కాళ్ళులేని వాడిని కూడా చేసుకునే- బీదయింటి పిల్లని తీసుకొచ్చి పెళ్ళి చేశారు" అన్నాడు ఆనందరావు చాలా క్లుప్తంగా తన జీవితకధ చెపుతూ. మాటల్లో అయితే యింత గబగబ చెప్పేశాడు కాని- ఈ స్థితికి రావటానికి, ఈ మానసిక పరిణతి కోసం అతనెంత బాధపడి వుంటాడో ఎంత నిర్విరామ ప్రయత్నం చేసి వుంటాడో....

"నేను వచ్చిన పని పూర్తికాలేదు. అయినా మీ పరిచయం మటుకు మర్చిపోలేను. ఒక మంచి స్నేహితుడిని పొందగలిగాను-" అన్నాడు ప్రసాద్ కాస్త వుద్రేకంగా.

"మనిద్దరి మధ్యా-యీ సమస్య వెనకనున్న సత్యాన్వేషణ ఒక కామన్ ఫాక్టరు. మీరూ-డాక్టరుగారు-నేను-అంతా నిజాన్ని పట్టుకోవాలని, నిజం వెనుక పరుగులు పెడుతున్నాం. చూద్దాం-సత్యం గెలుస్తుందో-లేక మనం వోడిపోతామో! ఏం జరిగింద్-దీని పర్యవసానం ఏమిటో నాకు రాస్తారుగా," అడిగాడు ఆనందరావు.

"తప్పకుండాను" అన్నాడు ప్రసాద్.

"ఒక విషయం. నాకు మాట యివ్వండి. నా గురించి ఎవరికీ జ్ఞాపకం చెయ్యకండి. ఆ పిల్లవాడికి కూడా నా గురించి చెప్పకండి-డబ్బు యివ్వగలను తప్ప-ఏ విధంగానూ బాధ్యత తీసుకోలేను. అందుకని చెపుతున్నాను-" అన్నాడు ఆనందరావు.

"నాకు తెలుసు. నిజం గెలుస్తే-నేనే స్వయంగా వచ్చి చెపుతాను" అన్నాడు ప్రసాద్ లేచి, చెయ్యి గట్టిగా పట్టుకుని.

# 8

తిరుగు ప్రయాణంలో ప్రసాద్-తన బుర్రని ఎటువంటి ఆలోచనలతో శ్రమ పెట్టకూడదని అనుకున్నాడు. అలా వుండటానికి ప్రయత్నించాడు కూడాను. కాని అది సాధ్యంకాలేదు. తను నాలుగు రోజుల క్రితం-పెద్ద డిటెక్టివ్‌లాగా, యీ చిక్కుముడిని విప్పుతాను-అని

బయలుదేరాడు. ఏమయింది? ఏం మిస్టరీ విడదీయగలిగాడు?! ఎటొచ్చీ ఆ పిల్లవాడు సుందరమ్మగారికి కలగలేదు-అన్నది నిర్ధారణగా తెలుసుకున్నాడు. ఆయనకీ డాక్టర్ ప్రభాకరమూర్తికి- బుర్రలు పని చెయ్యలేదు గాని, షుమారు అరవై ఏళ్ళున్న స్త్రీకి-యిరవయ్యేళ్ళ పిల్లవాడు ఎలావుంటాడు? అందునా మన భారతదేశంలో పదహారేళ్ళకే దాంపత్య జీవితం ఆరంభమయి-నలభై ఏళ్ళకే వార్ధక్యం ముంచుకొచ్చేస్తుంది. అటువంటప్పుడు సుందరమ్మగారికి అంత చిన్న పిల్లవాడు వుండటానికి అవకాశం లేదని తమకి ఎందుకు తట్టలేదు!"

రాబీకి రావుగారి కుటుంబానికి బాంధవ్యం వుంది. అది సక్రమం అయివుంటే-రాబీ యిలా ఎక్కడో పెరుగుతూవుండి వుండేవాడు కాదు. అది అక్రమమైన బాంధవ్యమే!కాని పైకి ఎలా చెప్పటం? "రాబీ సుందరమ్మగారి కూతురు కొడుకు కాబట్టి-వాడి మెళ్లో ఆవిడ చంద్రహారం వేసింది. ఇది దొంగతనం కాదు-" అని పైకి చెప్పినపుడు ఎన్ని జీవితాలు, ఎన్ని కుటుంబాలు తల్లకిందులవుతాయి? రాబీ తన కొడుకు అని తెలుసుకున్నపుడు-పంకజం భరించగలదా? ఇద్దరు పిల్లలూ-సంసారం-ఆవిడ జీవితం ఏమవుతుంది? తనేం చెయ్యాలి? డాక్టర్ ప్రభాకరమూర్తి నర్సింగ్ హోమ్‌లో దొంగతనం జరిగింది-ఆ నర్సుని పట్టుకుపోండి-అని పోలీసులకి అప్పగించాలా? అప్పుడు ఒక అబద్ధాన్ని-నిజంగా మారుస్తున్నామని అర్థం. పోనీ రహస్యంగా ఈ చంద్రహారం రావుగారికి అప్పజెపితే! ఎలా- ఏ సంజాయిషీ యిచ్చుకుని అప్పజెబుతారు! మళ్ళీ ఎలిజబెత్- దొంగ అని ఒప్పుకోవలసివస్తుంది - నిజం, అబద్ధమవుతుందప్పుడు! ఎలా - ఎలా?

పోనీ, రావుగారి చిన్నకోడలు మాధవిని పిల్చి-"గొడవ చెయ్యకండి-మీ వస్తువు మీకు అప్పచెపుతాం'-అంటే! మొదటికే మోసం

వస్తుంది. సుందరమ్మగారు పోయినరోజు ఆవిడ తననీ డాక్టరు మూర్తిని నిలదీసినపుడు-ఆ చంద్రహారం విషయం తమకి తెలియదన్నట్లు ప్రవర్తించారు. తెలిసే, ఆనాడు తాము అలా మాట్లాడామని గ్రహిస్తే-ఆవిడ వూరంతా టాం టాం వేస్తుంది. అందుకు సందేహంలేదు. ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి.

తను ఎందుకీ ప్రయాణం చేసినట్లు? ఏం సాధించినట్లు. ఈ విచిత్ర సంఘటనకి సంబంధించిన వ్యక్తుల దగ్గరనుంచి-పాతగాధ రాబట్టాడు. అందువల్ల ఎలిజబెత్ నిర్దోషి అని నిరూపణ అయింది_కాని అది పైకి చెపితే-ఒక స్త్రీ సంసారం-పిల్లలూ భర్తా-గౌరవం, ప్రతిష్టా అన్నీ మంటగలిసిపోతాయి. అలాంటప్పుడు తను యీ పాతగాధ రాబట్టటం-నిష్ప్రయోజనమయింది. డాక్టర్ ప్రభాకరమూర్తికి తాను ఏం చెప్పాలి? ఆ చంద్రహారం మర్యాదగా వెనక్కి యిచ్చెయ్యగల అవకాశం ఎలా కల్పించాలి?

ఈ విషయంలో ఆనందరావుకూడా నిస్సహాయుడే! అతను చెప్పినట్లు రాబితల్లి ఎవరూ-అన్న ప్రశ్న వెంటనే వుత్పన్నమవుతుంది. ఆనందరావు తండ్రి అని వొప్పుకున్న మరుక్షణంలో, దీనివల్ల ఎవరికీ ప్రయోజనం ఉండదు. అటువంటి నిష్ప్రయోజనమైన విషయం పైకి చెప్పటం దేనికి?

బుర్రబద్దలు కొట్టుకున్నా అతనికి దారి కనిపించడంలేదు. ఈ విచిత్రమైన సంఘటనలో అందరూ బాధ్యులే-అందరూ మంచివారే. కాని_కాని సుందరమ్మగారి రెండోకోడలు మాధవి ఈ చంద్రహారాన్ని తేలిగ్గా వదిలేట్లులేదు-ఆవిడ అల్లరి చేస్తేగాని వూరుకునేట్లులేదు. ఈ విషయానికి తాను ఎటువంటి ముగింపూ యివ్వలేకపోయినందుకు-సాయిప్రసాద్‌కి విసుగ్గా ఉంది నాలుగురోజులపాటు మూడు వూళ్ళు తిరిగి-మళ్ళీ బయలుదేరిన చోటుకే వచ్చాడు. సమస్య-ఎక్కడ ఆరంభమయిందో అక్కడేవుంది. కదలలేదు. చలనం లేకుండా వుంది. ఏం చెయ్యాలి?

ఆ రాత్రి డాక్టర్ ప్రభాకరమూర్తి-చాలా ఆతృతగా వచ్చాడు సాయిప్రసాద్ దగ్గరకు. అతను తన ఆశలన్నీ యీ సాయిప్రసాద్ పైనే పెట్టుకొని ఉన్నాడు. ఆ చంద్రహారం తాచుపాములాగా అతనిని భయపెడుతున్నది. అది కొండచిలువలాగా అతన్ని నిలువెల్లా చుట్టబెడుతోంది.

"ఏమైంది?" అడిగాడు డాక్టర్ ప్రభాకర్.

"రాబీ-ఎవరో, సుందరమ్మగారికి ఏమవుతాడో ఆధారాలతో తెలుసుకుని వచ్చాను."

"అందువల్ల మనకొరిగే దేముంది?"

'అదీ నిజమే-ఎలిజబెత్ అబద్ధం చెప్పలేదు. అంతవరకూ నిరూపణ అయింది."

"నేను మొదటినుంచీ చెపుతూనే ఉన్నాను. ఎలిజబెత్ చాల మంచి మనిషి-వాళ్ళమ్మ నాకు పదిహేను ఏళ్ళుగా తెలుసు. కూతుర అందుకునేదాక ఎస్తేరమ్మ మా నర్సింగ్‌హోమ్‌లో ఆయాగా ఉండేది.'

సాయిప్రసాద్ మాట్లాడలేదు.

"ఇంకా ఎవరిని చూశాడు? ఈ విషయం బయటకి పొక్కకుండా సుందరమ్మగారు ఎలా "మానేజ్" చేశారు?"

"అవన్నీ విన్నపుడు-ఆశ్చర్యం వేసింది. కాని వాటివల్ల మనకి ప్రయోజనం లేదు. ఇక్కడ ఒక్కటే ప్రశ్న. రాబీ, పంకజం కొడుకు-పెళ్ళికాకుండా-అక్రమంగా తల్లి అయింది -అన్నది-మీరు బయటకి అందరి ముందూ చెప్పగలరా?" అడిగాడు సాయిప్రసాద్ సవాల్ విసురుతున్నట్లు.

డాక్టర్ మూర్తి కాస్త తడబడ్డాడు. "ఎప్పుడో యిరవై ఏళ్ళ క్రితం జరిగిన-బలహీనతని, పెళ్ళి చేసుకుని సుఖంగావున్న గృహిణి పైన ఎలా వదలటం?"

"అయితే-ఆ చంద్రహారం, చిన్న అబద్ధం చెప్పి వెనక్కి యిచ్చెయ్యండి" అన్నాడు ప్రసాద్.

"అదెట్లా-మరణించిన ఒక స్త్రీ ఆఖరికోర్కెని కాదనటానికి మన మెవరం?-అని మీరే కదా అన్నది?"

'మరి?.

"చంద్రహారం-రాబీకి చెందాలి. న్యాయప్రకారం అది రాబీ సొత్తు. అందుకోసం పంకజంగారి గత జీవితం గురించి ఎత్తటం న్యాయంకాదు. అలా అని హాస్పటల్లో దొంగలున్నారు-ప్రాణం పోయిన వాళ్ళ నగలు వొల్చుకుంటారు అన్న అపవాదుని నేను భరించలేదు."

"అయితే ఎలా అంటారు? రాబీకి ఆ చంద్రహారం దక్కాలంటే-మీ స్టాఫ్ మీద దొంగతనం రుద్దబడాలి.లేకపోతే పంకజంగారు చేసిన తప్పు........రెండిట్లో ఏదో ఒకదానిని మీరు వొప్పుకోవాలి."

"ఊహూ. నేను-ఏవొక్కటీ వొప్పుకోను. పోనీ రావుగారితో సంప్రదిస్తేనో?" అడిగాడు ప్రభాకరమూర్తి.

"ఏమని? ఆయన వెస్ట్ జర్మనీలో వుండగా ఇది సంభవించింది. మూడో కంటివాడికి తెలియకుండా-చనిపోయిన ఒక స్త్రీ, ఇంత బాధ్యత వహించి, రహస్యం దాచింది యిన్నాళ్ళు. ఇప్పుడు ఆ విషయం మీరు చెపుతారా? రావుగారు పంకజానికి ఏమవుతారు?"

"తండ్రి" ఈ మాత్రం తెలీదా అన్నట్లు జవాబు చెప్పాడు డాక్టర్.

"కన్నతండ్రి-తన కడుపున పుట్టిన కూతురు ఈపని చేసింది. ఆ తప్పిదాన్ని తన భార్య యిన్నాళ్లూ కప్పి పెట్టింది-అంటే-ఎలా ఫీలవుతాడు? అరవై ఏళ్ళ వయసులో భార్య చనిపోయిన ఆయన-వంటరిగా ఫీలవుతున్న సమయంలో, ఇంత తతంగం తనకి తెలియకుండా

జరిగింది అంటే ఆయన మనోభావాలు ఎలా వుంటాయి-వూహిం చండి." అన్నాడు ప్రసాద్.

తను వూహించలేనట్లు చూశాడు డాక్టర్

"ఈ విషయం వింటే-ఆయనకి లోకంమీద నమ్మకం పోవచ్చు. రావుగారికి భార్య అంటే ప్రాణం. ఆ విషయం మీ ఇంట్లోకూడా అనేకసార్లు చెపుతూండే వారని మీరే అన్నారు. అటువంటి భార్య, తన కూతురు పెళ్ళి కాకుండా తల్లి అయిందనే విషయం, తనకే తెలియ కుండా దాచింది అంటే ఎలా ఫీలవుతారు?"

"ఆమె-తెలివికి-ముందు చూపుకి జోహార్లు అర్పిస్తారు-"

"మీరు పొరబడ్డారు. బాధ్యత లేనపుడు-ఆ సమస్యలో తాను చిక్కుకోనపుడు ముఖ్యంగా మన మొగవాళ్ళం నైతిక పరంగా ఆలో చిస్తాం. ఇంత అప్రాచ్యపు పని, ఇంత పాపిష్టి పని కూతురుచేస్తే ఆ తల్లి క్షమించి దాచిపెట్టింది అంటే-ఆ మనిషి ఎల్లాంటిది అన్నకోపం వస్తుంది."

"ఇంత తెలిసిన భార్య మీదనా?"

"ఎంత తెలిసినా-ప్రేమించినా, కూతురు పవిత్రత అనేసరికి తండ్రి దృక్పథం విచిత్రంగా వుంటుంది. ఇరవై ఏళ్ళుకాదు-వంద ఏళ్ళయినా తన రక్త సంబంధీకుల అపవిత్రతను మొగవాడు హర్షించ లేడు-హర్షించడు."

"అంతేనంటారా?"

"అంతేకాదు-ఈ విషయం విన్నపుడు రావుగారికి తన భార్య కార్యదక్షతా ముందు చూపు కంటే-ఆమె తనను చవటని చేసింది. ఈ విషయం తనని సంప్రదించలేదు-మనసు విప్పి చెప్పలేదు-అన్న కోపం వస్తుంది."

"ఎందుకంటారు?"

"అది మానవ స్వభావంలోని-సున్నితమయిన అహం-గర్వం-మగవాడి ప్రయోజకత్వం మీద దెబ్బ! ఇలా ఎన్ని పేర్లయినా సరే పెట్టి పిలవచ్చు."

"మరి ఎలా అంటారు? నాకు నా ప్రాక్టీసు, నా ప్రతిష్ఠ దెబ్బ తినకండా వుంటం ముఖ్యం."

"అప్పుడు ఎలిజబెత్-కొట్టేసింది-అని మీరుకూడామాధవిగారితో కలిసి-ఎలిజబెత్‌ని పోలీసులక అప్పగించండి. పోనీ, దొంగతనం చేసి, మీచేతికి యిచ్చిందని-వాళ్ళ నగ వాళ్ళకి యిచ్చెయ్యండి."

"అది అన్యాయం కాదా, వందమంది దోషులు తప్పించు కున్నా-ఒక నిర్దోషికి శిక్ష పడకండ చూడటమే-న్యాయం అంటారు కదా."

"అదీ నిజమే. ఇప్పుడు చెప్పండి. రావుగారింటికి మళ్ళీ వెళ్ళారా?"

"లేదు".

"ఖబుర్లు తెలిశాయా?"

"మొన్న మాధవిగారు ఫోన్ చేశారు."

"ఏమని?"

"ఎలిజబెత్ ఎడ్రసు కావాలి అని."

"ఏమన్నారు?"

"మీ మామగారితో మాట్లాడుతాను. మీతో మాట్లాడే విషయాలు నాకేం లేదని ఫోన్ పెట్టేశాను."

"నిప్పుతొక్కిన కోతిలా ఎగిరి వుండాలి."

"ఎగిరే ఉండవచ్చు. రావుగారు పెద్ద మనిషి. ఈ పన్నెండు రోజులూ గుంభనగా వుంచుతానన్నారా విషయాన్ని. ఈవిడగారేమో, పిచ్చెక్కినట్లు గెంతుతోంది."

"ఇంట్లో మిగతా ఆడవాళ్లూ-మొగవాళ్ళూ లేరా? ఈవిడ ఒక్కర్తే ఎందుకింత ఆరాటపడుతోంది? పెద్దకోడలు, కూతురు, కొడుకులు యింతమంది వుండగా-ఈ మాధవే ఎందుకు ముందు కొస్తోంది?" సాలోచనగా ప్రశ్నించాడు సాయిప్రసాద్.

"అవును. మీరు చెపుతుంటే అనిపిస్తోంది. చంద్రహారం అన్నపుడు, మిగతా స్త్రీలకి మటుకు ఎందుకు ఆశ వుండదు-వాళ్ళకీ భాగం వుందిగా! అసలు తగాదా వేసుకోవలసిన మనిషి పంకజం. ఈ మాధవే ఎందుకు ఎగురుతోందో?"

"నాకూ ఆశ్చర్యంగానే వుంది. పోనీ ఒకసారి వాళ్ళింటికి వెడదామా?"

"అమ్మో-నాకు భయంగావుంది, బాబూ. ఆ మాధవిగారు నా జేబులో చెయ్యిపెట్టి - చంద్రహారం తీసివ్వు అంటుందేమో. కాస్త దూకుడు మనిషిలా వుంది." అన్నాడు డాక్టర్ మూర్తి.

"ఫరవాలేదు. నేనూ దబాయించగలను. వెళ్దాం రండి."

"ఇప్పుడా?"

"కాదు-రేపు మధ్యాహ్నం వేళ వెడదాం. రేపు ఎన్నోరోజు? ఏడు కదూ? చుట్టాలూ వాళ్లూ-ఏడోరోజుకిగాని చేరుకోరు. అప్పుడు మనం వెళ్ళినా బాగుండదు, పొద్దుటపూట...."

"నాకు వీలవదు" అన్నాడు డాక్టర్ మూర్తి.

"వారికీ వీలవకపోవచ్చు. బ్రాహ్మలూ-గొడవా చాలా వుంటుంది."

"అదేం,వున్నట్లు లేదు...."

"ఎలా తెలుసు?" ప్రశ్నించాడు సాయిప్రసాద్.

"మా శాస్త్రుల్లుగారు-వాళ్ళకి పౌరోహితుడేట-ఆయన అన్నారు. సమారాధన-పూర్ ఫీడింగ్ తప్ప ఏం చెయ్యరుట."

"మంచిదే-సుందరమ్మగారి ఆత్మ నిజంగానే సంతోషిస్తుంది." అన్నాడు ప్రసాద్.

ఆ మరునాడు నాలుగింటివేళ డాక్టర్ మూర్తీ, సాయిప్రసాద్ కలిసి రావుగారింటికి వెళ్ళారు-ఆ యింటి ఆవరణని విషాదచ్ఛాయలు దట్టంగా చుట్టబెట్టి వున్నాయి. ముందున్న పోర్టికోలో-విసిరేసి ఉన్నట్లుగా-అక్కడా అక్కడా కుర్చీలు. ఎక్కడా మనుషుల అలికిడిలేదు నెమ్మదిగా-పోర్టికో దాటుకుని ముందు హాల్లోకి వెళ్లారు. హాల్లో మనుషులు లేరు క్రితంసారి వారు వచ్చినపుడు సుందరమ్మగారి భౌతిక కాయంతో యింటినిండా మనుషుల్తో, ఆ హాలు రద్దీగావుంది. ఈరోజు సోఫాలు పెద్ద పెద్ద కుషన్ సోఫాలు-కూర్చునే మనుషులకోసం నోరు ఆవలించుకుని చూస్తున్నాయి. గోడకి సుందరమ్మగారి కలర్ ఫొటో-దానికి పూలహారం. ఆ హాలులోనే ఆమె దేహాన్ని వుంచిన స్థలంలో దీపారాధన వెలుగుతూవుంది. ఈ యిద్దరూ ఎవరిని అడగాలో ఎటు వెళ్ళాలో తెలియక యిబ్బందిగా గుమ్మంలో నిల్చున్నారు. అప్పుడు-ఆ సోఫాల్లో ఒక దాంట్లో మనిషి కూచునివున్నట్లు-గుర్తించ గలిగారు. సర్వస్వం కోల్పోయిన వ్యక్తిలాగా - రావుగారు ముడుచుకుని, తల వంచుకుని కూచునివున్నారు-ఇద్దరూ అటువైపుకి వెళ్లారు.

ఆయన తలఎత్తి చూసి-కూచోమన్నట్లు చేత్తో చూపించారు పక్కసోఫా. నిశ్శబ్దం. ఎవరికీ మాట్లాడాలని అనిపించటంలేదు-ఇల్లు బావురుమంటూవుంది. ఆఖరికి పిల్లల కంఠాలుకూడా వినిపించటంలేదు. సాయిప్రసాద్‌కి ఆశ్చర్యంగావుంది. ఈ వృద్ధుని వదిలేసి-యిలా వంటరిగా వదిలి, అందరూ ఎక్కడికి కెళ్లారు? ఎవరి పనులమీద వాళ్ళు వెళ్ళిపోయారా? ఏకాకిగా ఈ మనిషిని-వదిలి వెళ్లిపోయారా? పైకి అడగలేక-మనసులోని జాలిని అణుచుకోలేక, వుక్కిరి బిక్కిరి అవుతున్నాడు ప్రసాద్ చుట్టూ దిక్కులు చూస్తున్నాడు డాక్టర్ మూర్తి.

"ఇల్లు చూశారా-ఎంత బావురుమంటోందో? ఈపాటికి మా సుందరం అయితే-కాఫీ తీసుకురానా? ఏం తీసుకుంటారు?-అంటూ ఎదురొచ్చి పల్కరించేది." ఆయన కంఠంలో విషాదం. వాక్యం పూర్తి చెయ్యలేనట్లు-రెండు అరిచేతుల్లో తల వుంచుకొని కళ్లు మూసుకున్నారు.

"అంతా...." ఆగిపోయాడు డాక్టర్ మూర్తి.

"మా అల్లుడొస్తున్నాడు. ఏర్‌పోర్టు కెళ్లారు."

"పిల్లలుకూడా వస్తున్నారా?" అడిగాడు ప్రసాద్, ఏదో అడగాలని.

"అమ్మాయి తీసుకురమ్మని చెప్పింది. పిల్లల్తోపాటు ఒక మూడు నెలలు వుంటుంది నాకు సాయంగా! ఈ యింట్లో ఒక్కడివీ వుండలేనమ్మా.... అన్నాను-"

"అదే మంచిదండి. కొన్నాళ్ళు మీతో ఎవరన్నా వుండాలి."

"మా అల్లుడు చాలా మంచివాడు. ఎమర్జన్సీ అని - వారం రోజుల్లో-ఫ్లయిట్‌కి ఏర్పాటు చేశాడు. ఎక్కడా టికెట్స్ లేవుట...."

"ఏం చేస్తూంటారు?" అడిగాడు.

"యమ్.వి.యస్సీ చేసి-రిసెర్చి చేశాడండి-"పౌల్ట్రీ"లో ఏదో ఒక సెక్షనులో రిసెర్చి చీఫ్‌ట-చాలా నిదానస్తుడు. మా సుందరానికి అల్లుడంటే ఎంతో ఆపేక్షండి. అదే ఉంటే-ఈపాటికి ఎంత హడావుడి చేసేదో. నన్ను యిలా కూచోనిచ్చేది కాదు-" ఆయన తడికళ్ళను తుడుచుకునే ప్రయత్నం చెయ్యలేదు-జ్ఞాపకాలలోకి వెళ్ళిపోయారు.

"పిల్లలు చదువుకుంటున్నారా?"

"ఆడపిల్లకి తొమ్మిదేళ్ళు-మొగపిల్లవాడికి ఆరేళ్ళు. ఇద్దరూ చాలా తెలివిగా ఉంటారు. మా అమ్మాయీ-అల్లుడూ యిద్దరూ పిల్లలకి తెలుగు నేర్పారు. పట్టుబట్టి "చందమామ"లు చదివిస్తూంటారు-మాతృభాష మర్చిపోకూడదని."

సాయిప్రసాద్ ఆయన మాటలు వింటూనే మనసులో గుణించుకుంటున్నాడు. పంకజం-పదేళ్ళు ఆగిగాని పెళ్ళి చేసుకోలేదన్నమాట. ఇంచుమించు ఆనందరావుకూడా పదేళ్ళుదాటాక చేసుకున్నాడు-ఈ యిద్దరికీ అపాత సంఘటన మరుగునపడటానికి ఒకదశ పట్టిందన్నమాట.

"అమ్మాయికూడా వుద్యోగం చేస్తున్నారా?"

"మొదట్లో చేసేది. పిల్లలు కలిగాక, యిల్లు-పిల్లలూ చాలనుకుంది. "ఎంత సంపాయించి ఏం లాభం? అంతా బేబీసిట్టర్స్‌కి, పెట్రోలుకీ అయిపోతుంది. దానిబదులు నేను యింట్లోవుండి-పిల్లలూ-ఆయన భోజనం చూసుకుంటే తృప్తి" అంటుంది. ఆయన కంఠంలో కూతురిపట్ల వాత్సల్యం. ఆ అమ్మాయి తీసుకున్న నిర్ణయం సరి అయినది అన్న ఆమోద ముద్ర ధ్వనిస్తూ వుంది.

"అమ్మాయి-యిక్కడినుంచి హయ్యర్ స్టడీస్‌కి - స్టేట్సు వెళ్ళారా?"

"మా సుందరానికి తన ముగ్గురు పిల్లలూ-ప్రత్యేకంగా వుండాలని సరదా. పెద్దవాడిని సి.ఎ.చదివించింది. రెండోవాడిని డాక్టరు చేసింది. మా అమ్మాయిని వెటర్నరీ డాక్టరుగా చదివించింది. ఆ రోజుల్లో ఆడపిల్లలు ఈకోర్సు చదవటం చాలా అరుదు. మద్రాసులోవుంచి చదివించింది. ఇది తెలుగువాళ్ళలో రెండోపిల్లండి-మొదటమ్మాయి ముక్తేశ్వర్‌లోవుద్యోగం చేస్తున్నదిట-మనమ్మాయికి అందరికంటే పెద్దడిగ్రీ ఉండాలని-యమ్.వి.యస్సీ.కి స్టేట్సు పంపింది." ఆయన జ్ఞాపకాల్లో-గత స్మృతులలో కొట్టు మిట్టాడుతున్నాడు. వయసువచ్చి, వుద్యోగ విరమణచేసి, భార్య గతించాక-మొగవాడు ఎంత నిస్సహాయంగా అయిపోతాడో-ప్రత్యక్షంగా చూస్తున్నారు యీ యిద్దరూ ఆయన్ని వోదార్చలేరు. ఆయన చెప్పేమాటలు వినటం తప్ప అంతకుమించిన సానుభూతి ఏమీ వుండదు. అదే ఆయనకి తాము యివ్వగల వోదార్పు-అనుకున్నాడు ప్రసాద్.

"మా వాళ్ళంతా – మా సుందరాన్ని ఆక్షేపించేవారు. పెట్టిపోతల్లో అది ఎప్పుడూ లోపం చేసేదికాదు. మా వాళ్ళని అందర్నీ పండగలకి పిల్చేది-చీరెలు పెట్టేది-వాళ్ళ పిల్లల పెళ్ళిళ్ళకు బాగా డబ్బిచ్చేది-పిల్లల చదువుల విషయంలో-మా సంసార విషయాల్లో మహానిక్కచ్చిగా వుండేది. అందరూ మాయింటి కొచ్చేవాళ్ళు తప్ప-అది ఒక్కరోజునకూడా ఎక్కడా వుండేది కాదు-ఇప్పుడు-ఇప్పుడు షేము ఎవ్వరం లేనిచోటుకి వెళ్ళిపోయింది-" ఆయన కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

"మా అమ్మగారు చెప్పారు. చాలా ఉత్తమురాలు అని. ఒకరి జోలికి వచ్చేవారు కారుట. తమ యిల్లూ-తమ పిల్లలూ తప్ప"

"అసలు దానికివున్న మనోబలం నాకు లేదండి. పిల్లలు చిన్న వాళ్ళు, చదువులు యిన్నివుండి కూడా, అది నన్ను జర్మనీ వెళ్ళమని ప్రోత్సహించింది. పిల్లల్ని పెట్టుకుని-ఒంటరిగావుండి చదువులు చెప్పించింది. మా పంకజానికి బోన్ టి.బి. వచ్చి, ఆర్నెలు పక్క మీదవున్నా అది నాకు రాయలేదు.రాస్తే ఎక్కడ ఖంగారు పడిపోతానో అని. అటువంటి మనిషి-నాకు ధైర్యం చెప్పేవ్యక్తి-యిలా ఒంటరిగా వదిలి వెళ్ళిపోయింది.నన్నెవరికి అప్పజెప్పింది? నేను ఎలా బతకను?" తనలో తను మాట్లాడుకుంటున్నాడు ఆయన. సాయిప్రసాద్, డాక్టర్ వంక చూశాడు-అర్థవంతంగా. సుందరమ్మగారు భర్తను-ఎలా వాస్త వాలకి దూరంగా వుంచిందో చూశారా అన్నట్లు! ఆయన తిరు వివాహపు తొలిరోజుల గురించి-పిల్లల పుట్టుక గురించి నలభై ఏళ్ళు వెనక్కి వెళ్ళి చెప్పుకుంటూ పోతున్నారు. వీరిద్దరూ-ప్రశ్నలు వెయ్యకుండా వింటున్నారు. ఈ లోపల బయట కారు ఆగిన చప్పుడు-మనుషుల కంఠాలు-పిల్లల గొంతులు.

పోర్టికోలో ఆగిన రెండు కార్లలోంచి పిల్లలు, పెద్దలు దిగు తున్నారు. ఎర్రగా పొడవుగావున్న మధ్య వయస్కుడు-గబగబా లోపలికొచ్చాడు-"డాడీ" అంటూ-బయటవారైన తాము ఈ విషాద వాతావరణం మధ్య వుంటే బాగుండదని-యిద్దరూ లేచారు. ఇద్దరూ కారు ఎక్కుతుంటే- నిప్పులు కురిపిస్తూ-వాళ్ళవంక చూస్తున్నది రావుగారి రెండో కోడలు మాధవి.

"మనం ఎందుకొచ్చాం?" అడిగాడు కారుస్టార్ట్ చేస్తూ డాక్టర్ మూర్తి.

"ఎందుకొచ్చినా-ఎట్లా వచ్చినా పంకజం విషయం రావుగారికి ఏమీ తెలియదు-అనుమానం కూడాలేదు. అది స్పష్టమైంది."అన్నాడు ప్రసాద్.

"అంచేత-రాబీ గురించి ఆయనకి చెప్పే ప్రసక్తిలేదంటారు."

"కరక్ట్." అన్నాడు ప్రసాద్ మూడు అక్షరాల్లో.

"ఏమైతే అది అవుతుంది. అని వూరుకుంటే-ఎలా వుంటుంది" సలహా అడిగాడు డాక్టర్ మూర్తి.

"మాధవిగారి కళ్ళు చూశారుగా."

"అమ్మ బాబోయ్ మనలని భస్మీ పటలం చేసేట్లు చూస్తోంది."

"సో. ఆవిడ యీ పన్నెండురోజులు గడిచేదాకా ఎదురు చూస్తూ వుంటుందన్నమాట."

"ఆవిడ మాట ఎలాఉన్నా ఆ చంద్రహారం నా లాకర్‌లోంచి త్రాచుపాములా బుసలుకొడ్తోంది. ఆ నగని వదిలించుకుంటేగాని నాకు పీస్ ఆఫ్ మైండ్ ఉండదండి. నా నర్సింగ్‌హోమ్‌లోంచి బాగుపడి వెళ్ళిన వాళ్ళూ ఉన్నారు-అప్పుడప్పుడు ఇలా ప్రాణం లేకుండా నిష్క్రమించిన సందర్భాలూ వున్నాయి. కేసు ఫేలయి-పేషంటుని రక్షించలేనపుడు-ఒక రోజల్లా బాధపడటం, మనసు డిస్టర్బ్ అవటం మాకూ సంభవిస్తూ వుంటుంది. కాని ఇలా-కేసు ముగిశాక కూడా-రోజుల తరబడి నన్ను అశాంతిలో ముంచుతూ ఉంటం ఇప్పుడే జరిగింది. ఆవిడ పోవటం కంటే యీ చంద్రహారం పెద్ద విషయం అయికూచుంది." అన్నాడు డాక్టర్.

"మీ దృష్టిలో చంద్రహారం ఒక నగ మాత్రమే. కాని డబ్బుగా మారిస్తే-అది పాతిక యిరవై వేలు వుంటుంది."

"అయితే?"

"డబ్బుండీ,-బాబు-అన్ని అనర్థాలకీ డబ్బే మూలం. అదే ఒక పూసలదండయితే-ఆ మాధవి గారింత గొడవ చేసేదిలేదు."

"ఆ మాధవిగారు ఒక్కరే ఎందుకు చెస్తారు? వెనక వీళ్లంతా వుండి ఆవిడని ముందుకు తోస్తున్నారేమో?"అన్నాడు డాక్టర్ మూర్తి.

"అయివుండచ్చు. ఏది ఎట్లా అయినా-మీ నర్సింగ్‌హోమ్ మీద-దొంగతనం పడకూడదు. అలా అని పంకజంగారి జీవితంలో జరిగిన ఆ తప్పిదాన్ని తిరగ తోడనూకూడదు. ఇది సాధించటం ఎలా? అదే పెద్ద సమస్య."

"పోనీ-దొంగకే తాళం చెవులు ఇస్తే?"

"అంటే ఎలిజబెత్‌కి చంద్రహారం ఇచ్చేసి వారికి వొప్పచెప్పమంటారా?" అడిగాడు సాయిప్రసాద్.

"నా వుద్దేశం అదికాదు. పంకజంగారినే అడిగితే? నగ మీకు అప్పజెపుతాం...."

సడన్ బ్రేక్‌వేసి డ్రైవ్ చేస్తున్న కారుని-ఆపాడు సాయిప్రసాద్. అలా ఆపేసి-అయిదునిముషాలపాటు మాట్లాడకుండా కూచుండిపోయాడు. అతను అలా ఎందుకు నిశ్శబ్దంగా అయిపోయాడో డాక్టర్‌మూర్తికి అర్థం కావటంలేదు.

"మీరెందుకంత సైలెంటుగా అయారు?"

"నడినెత్తిన మేకు కొట్టినట్లు, సరిఅయిన మార్గం చెప్పారు. ఇంతదాకా నాకెందుకు తట్టలేదు?-అని నా మొద్దుబుర్రని నేనే కోప్పడుతున్నాను." అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

మూర్తి కళ్ళలో తృప్తి కనిపించింది.

"పంకజంగారిని కలుసుకుని-ఆవిడతో యీ చిక్కు గురించి మాట్లాడగలరా?" అడిగాడు ప్రసాద్.

"అమ్మ, బాబోయ్. నేనా-నాకు పేషంట్లతో మాట్లాడటం తప్ప-మామూలు మనుషుల్తో మాట్లాడటం చేతకాదు. అందులోనూ-పంకజం

గారి జీవితం గురించి ఇంత తెలిసిన నేను, అసలు మాట్లాడలేను. ఆవిడ కళ్ళలోకి చూసే ధైర్యంకూడా నాకు లేదు."

"మరెట్లా?"

"అన్నిటికీ-మీరే శరణ్యం. అందుకేగదూ. ఆరోజు మీ దగ్గరకు పరుగెత్తు కొచ్చింది."

"ఆమెతో నాకు పరిచయంలేదు-కనీసం డాక్టరుగా మీరు నాలుగైదు మాటలన్నా మాట్లాడివుంటారు. ముఖపరిచయం వుందికదా...."

"మీరు చెప్పినవన్నీ నిజమే. నాకు డాక్టరుగా బెడ్‌సైడ్ మా నర్సుతప్ప-సోషల్‌గా మాట్లాడటం చేతకాదు. అసలు ఎలా అడగాలి, ఏమని చెప్పాలి అనికూడా తెలియదు."

"నేను ఎంక్వైరీ చెయ్యలేదూ-మరియమ్మ నాకు తెలుసా? ఆనందరావు ముక్కూమొహం ఎరగనే?"

"అదే నేనూ చెప్పేది-మీరు ముఖ పరిచయం లేనివాళ్ళతోకూడా పరిచయం చేసుకు మాట్లాడగలరు. వారిని మీ మాటల్లోకి లాక్కొచ్చి అసలు విషయం రాబట్టగలరు." అన్నాడు డాక్టర్‌మూర్తి.

"ఏమని అడగను? ఇక్కడ మరియమ్మని అడిగినట్లు రూపాయి నోట్లు ఆడించి-ఆశపెట్టే పరిస్థితికాదు. ఆనందరావుగారిలాగా- ఇద్దరు మొగవాళ్ళ మధ్య 'ఫ్రాంక్'గా నడిచే సంభాషణాకాదు. పంకజంగారు చదువుకున్నారు. గౌరవం ప్రతిష్టాగల కుటుంబంనుంచి వచ్చారు. అన్నిటికంటే ఆమె గృహిణి....ఆమెతో యీ విషయం ఎలా కదపను? అసలు అడిగేందుకు ఏముంది?" అన్నాడు సాయిప్రసాద్. అతను కారుస్టార్టు చెయ్యలేదు: అలాగే కూచుని ఆలోచిస్తున్నాడు.

"చంద్రహారం గురించి అడుగుతేనో?"

"ఏమని అడగమంటారు? అసలు ఆవిడతో మాట్లాడే అవకాశం ఎలా 'క్రియేట్' చేస్తారు?" అడిగాడు ప్రసాద్.

"ఇంటికెళ్ళి అడుగుతేనో?"

"మాధవిగారు-పంకజం భర్త-అన్నలు,రావుగారు,బంధువులు, పిల్లలు-ఇందరి మధ్యా ఆవిడతో ఒక్కముక్క మాట్లాడే అవకాశం వుంటుందా?"

"ఉండదు" అన్నాడు మూర్తి.

"మరి?"

"మా నర్సింగ్‌హోమ్‌కి రమ్మనమందాం."

"ఫోన్ చేసి, పంకజంగార్కి నేను సాయిప్రసాద్‌ని,మీతో పరిచయం లేని కొత్తవాడిని. హాస్పటల్‌కి రండి మాట్లాడుకుందాం-అని ఫోన్ చెయ్యనా? ఇది భారతదేశమండీ బాబూ! ఈ చెంపా ఆ చెంపా వాయిస్తారు. పరాయిమొగాడు గౌరవనీయురాలైన ఒక గృహిణికి ఇలా ఫోన్ చేస్తే."

"అదీ నిజమే. ఆమె భర్తగారికి....."

ఫక్కున నవ్వాడు సాయిప్రసాద్. ఇది ఎంత తెలివి తక్కువ 'సజెషనో' అన్నట్లు ఆ క్షణాన కాస్త కినుక వచ్చినా, డాక్టర్ మూర్తికి తను అన్నమాట ఎంత అనుచితమైనదో బోధపడింది-నోరు మూసుకుని వూరుకున్నాడు.

"పంకజంగారి సలహా అడిగితే-యీ సమస్య కొంతవరకూ విడతీయవచ్చు-కాని-"

"కాని?"

"ఆవిడ స్వభావం ఎలాంటిదో మీకు తెలుసా?"

"అంటే?"

"ఇప్పుడు ఆనందరావుగారే వున్నారనుకోండి. ఆయనకి గతంలో చేసిన పొరబాటు వొప్పుకునే-మనో ధైర్యం వుంది. నేను వెళ్ళిన అయిదునిముషాల్లోనే సంభాషణ సవ్యమైన ధోరణిలోకి వచ్చేసింది."

"పంకజంగారితో అల్లా మాట్లాడటానికి వీలుకాదు అని మీ ఉద్దేశ్యంకదూ...." అడిగాడ డాక్టర్

అవును-అన్నట్లు తలవూపాడు ప్రసాద్.

"మీ గురువుగార్ని మర్చిపోతున్నట్లున్నారు. మానవ స్వభావాన్ని తరిచిచూసినపుడు, కొన్ని పరిస్థితుల్లో స్త్రీలే ఎక్కువ 'ఆనెస్ట్'గా వుంటారని-ఆయన రాసినట్లు జ్ఞాపకం."

"నిజమే-అంతేకాదు. గడిచిన కాలంలోని ప్రేమలూ-అనుభవాలూ స్త్రీలు మొగవాళ్లకంటే ధైర్యంగా వొప్పుకుంటారు అనికూడా ఒకచోట మామ్ అంటాడు. అయితే సుఖంగా, హాయిగా జరిగిపోతున్న జీవితం, భర్తా-పిల్లలూ చల్లగావున్న యీ సంసారంలో గతజీవితాన్ని తవ్వి-నిప్పులుపోసుకునే ఆడవాళ్ళు వుంటారంటారా?" అడిగాడు సాయిప్రసాద్.

"ఉండరు. కాని యీ విషయం పైకి మీరు చెప్పరుగా?"

"చెప్పనని ఆవిడకు నమ్మకం ఏమిటి? నేను బ్లాకుమెయిల్ చేస్తానేమోనని భయపడదా?"

"అలా చేసే వారయితే యీపాటికే చేసి వుండేవాళ్ళంగా?" అడిగాడు డాక్టర్ మూర్తి.

"అదీ ఒక పాయింటే. ఆనందరావుమీద సుందరమ్మగారికిగల ప్రభావంలో వెయ్యోవంతు యీ పంకజంగారిమీద ఉన్నట్లయితే, ఆవిడ భయపడదు. నా వుద్దేశంలో పంకంజంగార్కి చాలా ఆత్మశక్తీ—నిగ్రహం వుండి వుండాలని అనిపిస్తోంది."

"ఎందువల్ల-ఎలా చెప్ప గలుగుతున్నారు?"

"మన యీ సత్యశోధనకి అసలు కారణం అయిన చంద్ర హారాన్ని బట్టి, పంకజం మామూలు సగటు స్త్రీ అయి వుంటే-చంద్ర హారం గురించి మిమ్మల్ని నిలదీసి వుండేది." అన్నాడు ప్రసాద్.

"తీగె తీస్తే డొంక కదుల్తుందని భయపడిందేమో!"

"ఆ అవకాశం లేదు-ఎలిజబెత్‌ని- ఒకటికి పదిసార్లు అడిగాను. చాలాక్లోజ్‌గా క్వశ్చన్ చేశాను.పంకజం రాబీనిచూడలేదు.చూసే అవకాశంలేదు అని చెప్పింది. పంకజమే కాదు, రావుగారి బంధువులెవరూ యీ పిల్లవాడిని చూడలేదు. వాడు వరండాలో భయపడి నక్కి నిల్చున్నాడని చెప్పింది-"

"అవును-ఎన్నిసార్లు అడిగినా ఆ మాటే చెప్పింది."

"ఇంకో విషయం. పంకజం రాబీని గుర్తించే అవకాశంలేదు"

"ఎందుకు లేదు? కన్న తల్లికదా! ఆ మాటకొస్తే సుందరమ్మ గారికంటే పంకజానికే 'యిన్‌స్టినేక్టివ్'గా తన రక్తాన్ని గుర్తించే అవకాశంవుంది." అన్నాడు డాక్టర్ మూర్తి.

"అది నిజమే. కాని పంకజం పిల్లవాడిని ఒక్కసారి కూడా చూడలేదుట సిజేరియన్ చేశారుట. మత్తు యిచ్చారుట." మరియమ్మ మాటలు జ్ఞాపకం చేసుకుంటూ అన్నాడు ప్రసాద్.

"పిల్లవాడిని చూపించకుండా వుంటం చాలా అన్యాయం-" అన్నాడు డాక్టర్ మూర్తి.

"అది వొదిలెయ్యండి-హాస్పటల్‌వారూ- తల్లీ కలిసి, పంకజం కళ్ళలో పసివాడి రూపం పడకుండా జాగ్రత్తపడ్డారు. ఆ అమ్మాయి యించుమించు నిద్రమాత్రలతోనే పడివుండేదిట. అంచేత పంకజం, రాబీని గుర్తించటం అసంభవం. కాబట్టి తీగె కదిల్చే సమస్యలేదు.

షో, పంకజానికి నగమీద ఆశలేకపోవచ్చు. అదీ కాకపోతే మాధవి ఎలాగూ గొడవ చేస్తోంది గదా, అని ఏడ్చే దాని మొగుడొస్తే నా మొగుడూ వస్తాడని వూరుకోవచ్చు."

"అటువంటి- దూరదృష్టే వుంటే- పంకజం చాలా లోతైన మనిషి అయివుండాలి. లేకపోతే అమాయకురాలైనా అయివుండాలి-" అన్నాడు మూర్తి.

"అమాయకురాలైతే-ఒక్కత్తీ స్టేట్సు ఎలా వెళ్ళివుంటుంది?" ప్రశ్నించాడు ప్రసాద్.

"కొందరు లౌకిక విషయాల్లో-చాలాఅమాయకంగా వుంటారు. చదువూ-జీవితగమ్యం-వీటిల్లో చాలా తెలివైనవారై వుంటారు. ఆ సంగతి మీకు తెలియదా?"

"తెలుసనుకోండి. స్త్రీలకి సహజంగా నగలమీద మోజువుంటుంది అందులోనూ తల్లి చంద్రహారం అన్నపుడు ఎలా వూరుకుంటుంది అన్న ప్రశ్న." ప్రసాద్ యోచిస్తున్న కంఠంతో అన్నాడు మెల్లిగా.

"రావుగారికిమల్లేనే తల్లిమీద,ఆమె జ్ఞాపకంమీద గౌరవమేమో" మాధవిగారంత గండా గోడీగా అల్లరిపడటం ఎందుకని వూరుకున్నారేమో!" ఆలోచన సప్లయ్ చేశాడు డాక్టర్ మూర్తి.

"ఆ మాత్రం సెన్సిటివ్ అయితే-మనం మాట్లాడవచ్చు- కాని ఎలా? వంటరిగా ఒక గృహిణిని కలుసుకు మాట్లాడటం ఎలా సాధ్యం?"

"నేను ఫోన్ చేసి చెప్పనా?"

"ఏమని?"

"ఒకసారి- మా నర్సింగ్‌హోమ్‌కి రండి-అని ఫోన్ చేసాను."

"వాళ్ళాయన్ని వెంటబెట్టుకొస్తేనో! సహజంగా- 'మీరు రండి, అంటే-భర్త పక్కన వున్నపుడు, యిద్దరికీ కలిపి ఆ పిలుపు అని అర్థం వస్తుందే!" అన్నాడు ప్రసాద్.

"మరి ఎలా?"

"నాకు బోధపడకుండావుంది. పంకజంగారిని వంటరిగా కలుసుకుంటే-కొంత సర్దుబాటు చెయ్యవచ్చునేమోనని ఆశగా వుంది. కాని ఆ మాధవి వేటకుక్క లా పసికట్టి-తనూ వస్తే-మనం చేసేదేముంది-?"

"ఈ లోపల ఏ పిల్లలకేనా వంట్లో బాగుండకపోతే!" ఆశగా వుంది డాక్టర్ కంఠం.

ప్రసాద్ పకపక నవ్వాడు.

"దేనికి నవ్వుతున్నారు?" అడిగాడాయన వుడుక్కుంటూ.

"ప్రాక్టీసు మొదలుపెట్టిన కొత్తలో-డాక్టర్లు రోగుల జబ్బుల కై ప్రార్థిస్తారుట. ప్రాక్టీసు పుంజుకున్నాక రోగులు, డాక్టర్లకోసం ప్రార్థన చేస్తారు. మీరు మళ్ళీ పంకజంగారి పిల్లలకి-వంట్లో...." ఆగిపోయాడు నవ్వుతూనే-ప్రసాద్.

"ఒక పని చేస్తాను. పంకజంగారికి ఫోన్ చేస్తాను."

"ఏమని?" అడిగాడు కుతూహలంతో ప్రసాద్.

"మీ అమ్మగారు, పోయే ముందు...."

"మీరు ఆ సమయంలో అక్కడలేరు. ఆ విషయం మర్చిపోతున్నారు-"

"అదీ నిజమే-క్రితంరోజు రాత్రి నాతో కొన్ని విషయాలు చెప్పారు.. అని...."

"భర్తగారు వెంటరాకుండా- వొక్కరే రండి అని కూడా చెప్పగలుగుతారా?"

"ప్రయత్నిస్తాను"

"భర్తగారే కాదు. యింట్లో మరెవ్వరినీ తీసుకు రావద్దని చెప్పండి"

"కాస్త యిబ్బందే-అంత స్పష్టంగా మన యీ సమాజంలో ఎలా చెప్పటం?"

"చెప్పండి. మీ అమ్మగారికి మనసులో పోతానన్న అధైర్యం వుండి....యిలా ఏదో కథచెప్పి నర్సింగ్‌హోమ్‌కి వంటరిగా రప్పించే ప్రయత్నం చెయ్యండి "

"చేస్తాను." అన్నాడు డాక్టర్ దృఢంగా.

"ఇంతా అనుకుంటున్నాముగాని, తీరా ఆమె వచ్చేప్పటికి నాకు నోట్లోంచి మాటరాకపోవచ్చు" అన్నాడు ప్రసాద్.

"మీరే యిలా అంటే ఎలా?"

"మరియమ్మ-అన్ని విధాల మనకంటే కింద స్థాయిలో వుంది కాబట్టి-డబ్బు వాసన చూపితే వాగుతుంది అన్న ధైర్యంతో ముందు కెళ్లాను. ఈమె చదువుకున్నారు. మనకంటే పై స్థాయిలో వున్నారు. పైగా గృహిణి. ఎలా మాట్లాడాలా, అన్నది నాకు పెద్ద సమస్యగానే వుంది. అసలు మాట్లాడే అవకాశం యిస్తారో లేదో-చూద్దాం.ఇచ్చినా-సంభాషణ ఎలా మొదలుపెట్టాలి- ఇది చాలా సున్నితమైన విషయం. మీరు ఫోన్ చెయ్యండి. చేసి నాకు చెప్పండి."

"రాత్రే చేస్తాను."

"వొద్దు."

"ఏం?"

"ఈ రోజే భర్తా పిల్లలూ వచ్చారు. వాళ్ళతో గడపాలని ఆమె

వుత్సాహపడుతుంటారు. ఇవాళ కాదు. పన్నెండోరోజు లోపల మాధవి గారు-బాంబు పేల్చేముందు కలుసుకుంటే చాలు."

"ఎల్లుండి చెయ్యనా?" అడిగాడు మూర్తి.

"అలాగే?" అన్నాడు ప్రసాద్. కాని అతనికి ఏదోదుడుగ్గావుంది. గౌరవనీయురాలైన ఒక గృహిణి ముందు-ఆమె గత జీవితంలోని తప్పిదాన్ని-అందులోనూ కొడుకు బ్రతికివున్నాడు అని చెపితే-ఆమె యీడ్చి చెంపదెబ్బ యిస్తుందేమోనన్న భయం. అలా అని యీ సమస్యని యిక్కడితో వదలలేకుండానూ వున్నాడు.

"చాలా సర్వసాధారణం అనుకున్న విషయాలు, ప్రాణాంతకం అవుతూంటాయి." డాక్టర్ మూర్తి తత్వ విచారణలో పడ్డాడు. సాయంత్రం నాలుగున్నర ప్రాంతాల. ఎండవేడి-బాగా తగ్గిపోయింది-అనుకోకుండా చుట్టుముట్టిన మబ్బులవల్ల! ఈలాంటి సమయాల్లో-కాస్త వేసుకుంటే బాగుండును అనిపించింది-కాని రాబోయే అతిథి స్త్రీ. గౌరవనీయమైన కుటుంబంలోంచి వచ్చింది. మర్యాదస్తురాలు. అంచేత అతను వేడి వేడి టీతో సరిపెట్టుకున్నాడు.

"ఈ ఉపోద్ఘాతం అంతా దేనికండీ స్వామీ? నవ్వుతూ అడిగాడు సాయి ప్రసాద్. మధ్యాహ్నం మూడు గంటలవేళ డాక్టర్ మూర్తి ఫోన్ చేశాడు. పగటి నిద్రలోంచి లేవటం అంటే మహా తిక్కగా వుంటుంది ప్రసాద్‌కి. మూర్తి ఫోనూ- అందులోనూ అతిథి వస్తున్నారు-అనేప్పటికి నిద్రమత్తు వదిలిపోయి. అరగంట ముందుగా వచ్చేశాడు మూర్తి యింటికి.

డాక్టర్ మూర్తి యిల్లు. అధునికంగా, సిరి గుమ్మరిస్తూ వుంది. పొడవాటి ఫోమ్ రబ్బరు సోఫాలు-మధ్యలో_ముఖాలు ప్రతిబింబించేటట్లు నున్నగా తళతళలాడుతున్న- సన్ మైకా- టీపాయి. అది ఎత్తు తక్కువగా-పత్రికలు పుస్తకాలు పెట్టుకునేందుకు అనువుగా-దీర్ఘ చతురస్త్రంగా వుంది. పక్కగోడలోకి అమర్చిన_అద్దాల బీరువాలో

పైరెండు అరల్లో పుస్తకాలు-క్రింద రెండు అరల్లో - చిన్నచిన్న బొమ్మలు. అవి ఇండియన్‌వి కావని-ఫారెన్ నుంచి తెచ్చినవనీ తెలుస్తోంది. సాయిప్రసాద్, మూర్తి యింటికి ఎప్పుడూరాలేదు-అతని కుటుంబంతో కూడా పరిచయంలేదు. నిజానికి వీరిద్దరిదీ క్లబ్ స్నేహం తప్ప కుటుంభం స్నేహంకాదు. సుందరమ్మగారి మరణంతో తరువాత సంఘటనతో యీ పదిరోజుల్లో-ఒకరికొకరు సన్నిహితంగా వచ్చారు.

టీకప్పు చేతులో పుచ్చుకుని,సోఫాలోంచి లేచి,సాయిప్రసాద్ పుస్తకాల రాక్ దగ్గరకెళ్ళాడు.గాంధీజీ శతజయంతి సందర్భంగా వెలువడిన-బాపూకంప్లీటు వర్క్సు-వరసగా పేర్చబడి వున్నాయి. రెండో అరలో సోమర్‌సెట్‌మామ్ ఎ జె క్రానిక్ వీటిమధ్య ఆర్థర్ హైలీ ఫైనల్ డయాగ్నెసెస్. ఇవి వున్నాయి. సాయిప్రసాద్‌కి ఆ పుస్తకాలు సెలక్షను చూస్తే నవ్వొచ్చింది. రచయిత వైద్యుడైతేగాని, వైద్యానికి సంబంధించిన సాహిత్యం అయితే గాని యితను చదవడు కాబోలు-అనుకున్నాడు.

"ఆమె ఎన్నింటి కొస్తానన్నారు?" అడిగాడు టీ కప్పులోంచి ఆఖరు గుక్క తాగి,

"అయిదింటికి."

"ఎలా వొప్పించారు?" కుతూహలంగా అడిగాడు ప్రసాద్.

"ముందే చెప్పానుకదూ. మనం క్లిష్టమైనవి అనుకున్నవి-తేలిగ్గా సానుకూలబడతాయి. తేలిక అనుకున్నవి. వురిలా బిగుసుకుంటాయని-"

"అంటే ఆవిడ వెంటనే వొప్పుకున్నారన్నమాట."

"ఫోన్ చేశాను. అదృష్టవశాత్తు-పంకజంగారే తీసుకున్నారు 'మ్మయ్యా' అనుకుని-విషయం నెమ్మదిగా చెప్పాను."

"తరువాత?"

"ఆవిడ మొదట్లో రావటానికి వొప్పుకోలేదు."

"ఏం?"

"నర్సింగ్ హోమ్‌కైతే రాలేనన్నారు. అక్కడి జ్ఞాపకాలు యింకా పచ్చిగావున్నాయి. ఆ గేట్లో నేను అడుగుపెట్టలేనన్నారు" అన్నాడు మూర్తి జాలితో నిండిన కంఠంతో.

"సహజంకదా! ఎంతో పెద్దవాళ్ళయినా మృత్యువు అన్నది-విషాదాన్ని మోసుకొస్తుంది. ఆవిడ అలా అనుకోటంలో ఆశ్చర్యం లేదు."

"అందుకే, అలాగైతే యింటికిరండి-అన్నాను వెంటనే వొప్పేసుకున్నారు."

"ఎందుకు ఏమిటి? అని ప్రశ్నలు అడగలేదా?"

"లేదు. మీ అమ్మగారు పోయేనాటికి క్రితంరాత్రి కొన్ని సంగతులు చెప్పారు అన్నాను చాలా నెమ్మదిగా."

"ఆవిడ అవునూ అనలేదు.కాదు అనలేదు_విషయాలు ఏమిటీ అని ప్రశ్నించలేదు. వస్తాను అన్నారు. అంతే."

"మరి భర్తో....?"

"అదే ఎలా చెప్పాలో తెలీక మధనపడుతున్నపుడు ఇది-మా అమ్మకీ నాకూ సంబంధించిందంటున్నారు. అంచేత మా ఆయనకి దీంట్లో సంబంధం వుండదు. ఆయనరారు-.అంది_చాలా దృఢంగా."

"రిమార్కబుల్."

"అంత సూటిగా-ధైర్యంగా చెప్పింది ఆవిడ. 'అమ్మయ్య' అనుకుని ఫోన్ చేసేశాను వెంటనే మీకు నా పని అయిపోయింది.

ఆమె వచ్చాక ఒకపావుగంట కూర్చొని వెళ్ళిపోతాను." అన్నాడు మూర్తి.

"అదేం?"

"టు యీజ్ కంపెనీ త్రీ ఈజ్ ఎ క్రవుడ్-మీరు మాట్లాడితే బావుంటుంది. నా ఎదురుగుండా ఆవిడ గత జీవితంగురించి చెప్పడం బావుండదు."

"ఇది మీ యిల్లుకదా!"

"ఫరవాలేదు. మా ఆవిడని సినిమాలో దించేసి, నేను నర్సింగ్ హోమ్‌కి వెళ్తాను-అక్కడేవుంటాను - ఏం కావాల్సివచ్చినా ఫోన్ చెయ్యండి."

"నాకా? నాకేం కావాలి. ఆవిడే భయపడి ఫోన్ చెయ్యాలి గాని."

"ఉహూ. అలాంటి ఫస్సీసైపుగా అనిపించలేదు. ఆడవాళ్ళు అంత త్వరగా ఫోన్ పెట్టెయ్యటం-చాలా అరుదు. ఆవిడే సరేనండి అంటూ ఫోన్ క్లిక్‌మనిపించింది. దాన్నిబట్టి అనుకున్నా చాలా సీరియస్ అని."

"అనుకుని, నన్ను యిలా వంటరిగా వదిలివెళ్ళిపోవాలనుకుంటున్నారా?" అల్లరి మిశితమైన సీరియస్‌నెస్‌తో అడిగాడు సాయి ప్రసాద్.

"మాధవిగారైతే-వొదిలిపెట్టి వెళ్ళివుండేవాడినికాదు. మీరు చాలా 'డెలికేట్' విషయం ఎత్తబోతున్నారు. మూడో మనిషి-అందునా డాక్టర్ని వుంచటం మంచిదికాదని వెళ్తున్నాను."

"ఓ. కె." అన్నాడు ప్రసాద్.

బయట కారు ఆగిన శబ్దం డ్రయివరు లేదు. ఆమే డ్రైవ్

చేసుకుంటూ వచ్చింది. మామూలుగా చామన ఛాయలోవుంది. సుందరమ్మగారంత తెలుపుకాదు. ఆవిడను చూస్తే-మాస్టర్ డిగ్రీ వున్న మనిషి అనిగాని, అమెరికాలో పదేళ్ళుగా వుంటున్నదని గాని అనుకోరు. వాలుజడ. మామూలు నూలుచీరె. చేతికి ఒక గాజు మెళ్ళో సన్నగొలుసు. పొడవుగా-సన్నగావుంది. రోడ్డుమీద నడుస్తుంటే గాని, నలుగురిలో వున్నపుడుగాని ప్రత్యేకంగా కనిపించని విగ్రహం. సుందరమ్మగారు పచ్చని రంగని-మనిషి అందగత్తె అని అరవై ఏళ్ళు వచ్చినా చక్కగా వుండే వారిని విని వున్నాడు ప్రసాద్. బహుశా ఈ పంకజానికి, తండ్రి పోలికవచ్చిందేమో! అనుకున్నాడు మనసులో ఆవిడ కారు తలుపువేసి, డోర్‌లాక్ చెయ్యలేదు. ఆ నడకలో ఒక దృఢత్వం; వేసే అడుగులో విశ్వాసం-కనిపించాయి ప్రసాద్‌కి-కారు శబ్దం విని-గుమ్మంముందు కెళ్ళిన డాక్టర్‌మూర్తి-"రండి"-రండి" అంటూ లోనికి ఆహ్వానించాడు.

"ఈమెకి ఎన్నేళ్ళుంటాయి-లోలోన అంచనా వేసుకుంటు న్నాడుప్రసాద్. ఆనందరావు-సుందరమ్మల కధనం బట్టి చూస్తే-ముప్ఫై అయిదు పైనవుండాలి. కాని మనిషి అలాలేదు. ఇంకా లేతగానే వుంది-ముప్ఫై ఏళ్ళ స్త్రీలా వుంది.

"వీరు నాఫ్రెండు. సాయిప్రసాద్-వీరు పంకజం-సుందరమ్మ గారి కూతురు" అంటూ ఇద్దర్నీ పరిచయం చేశాడు డాక్టర్‌మూర్తి.

"మీ మదర్‌తో పరిచయం లేదుగానిచాలా రిమార్కబుల్ పర్సన్ అని విన్నాను. అయామ్‌సారీ...." అన్నాడు ప్రసాద్, సానుభూతి చెపుతూ.

అవును. మా మదర్, రిమార్కబుల్ పర్సన్ అని పోయేప్పుడు కూడా ప్రూవ్ చేసుకుంది. నిజం చెప్పాలంటే- అమ్మ పోయింది-

ఇక అమ్మలేదు-అన్నశూన్యం గురించి బాధపడుతున్నాను తప్ప, ఆమె మరణం గురించికాదు" అంది పంకజం.

సాయిప్రసాద్ కళ్ళలో ప్రశ్నలు కనిపించినాయి కాబోలు పంకజం మళ్ళీ చెప్పింది. "మరణం అన్నది తప్పదు. అది 'యినెవిటబుల్' బాధపడి-తీసుకుని పోయేకంటే-యిలా మాట్లాడుతూ హాయిగా వెళ్ళిపోడం మంచిదికదా. ప్రేమాస్పదులందరికీ అటువంటి 'ఎండ్' రావాలనే మనం కోరుకోవాలి." అంది పంకజం.

సాయిప్రసాద్ సర్దుకుని కూచున్నాడు-ఈ పంకజం మామూలు అందరి ఆడవాళ్ళలాంటిదికాదు. మృత్యువులో ఉన్న హుందాతనాన్ని-గౌరవాన్ని విడమరిచి చెపుతోంది. మృత్యువుఅంటే-రోగం, బాధకాదు-అందులోకూడా ఒక డిగ్నిటీ వుంది. అందరూ అలా సునాయాసంగా పోవాలని అంటున్నది. అది సాధ్యమా? సాధ్యంకాక పోయినా-కోరుకోటం తప్పుకాదుకదా!

"అమ్మ-మీతో ఏదో చెప్పిందన్నారు? ఏంచెప్పింది?" అని పంకజం అడుగుతూ వుంటే లోపలినుంచి-టీ బిస్కట్లూ వచ్చాయి. వాటిని టేబుల్‌మీదవుంచమని నౌకరుకి సౌంజ్ఞచేసి. బిస్కెట్లు ప్లేటు అందించాడు డాక్టర్ మూర్తి.

టీ తాగుతూవుంటే-టెలిఫోన్ మ్రోగింది. డాక్టర్‌మూర్తి ఫోన్ అందుకొని-అర్జంటుగా ఏదో మాట్లాడుతున్నాడు. అవతలవాళ్ళు ఆదుర్దా పడుతున్నట్లు-ఆతని మాటలవల్ల తెలుస్తూవుంది. ఇది నిజమైనకాలా? లేక మూర్తి ముందే-ఏర్పాటు చేసుకున్న కాలై వుంటుందా?-అన్న సందేహం కలిగింది ప్రసాద్‌కి.

"ఎమర్జెన్సీ కేసువచ్చింది. వెంటనే-నర్సింహోమ్ చేరుకోవాలి" టీ పూర్తిగా తాగకుండా లేచాడు మూర్తి.

"మీరు మరోలా అనుకోకండి. అమ్మగారి ఆఖరుమాటలు ఈయన చెపుతారు. ఎక్స్యూజ్ మీ" అంటూ హడావిడిగా వెళ్ళాడు మూర్తి.

సాయిప్రసాద్‌కి-టీ మింగుడుపడలేదు. గొంతులో గరగరమంటున్నట్లుంది. ఈ డాక్టర్ హాయిగా తప్పుకున్నాడు. తను యీ అపరిచిత యువతితో-అతి సున్నితమైన-ప్రమాదకరమైన విషయాలు మాట్లాడాలా? ఎలా? ఎట్లా సంభాషణ ప్రారంభించాలి.

"మీ ఆయన- పౌల్ట్రీలో స్పెషలైజ్ చేశారుట?" అడిగాడు సంభాషణ పొడిగించాలని.

"ట్రాపికల్ కంట్రీసులో-ఎగ్‌కి వుండే రెసిస్టెన్సు గురించి స్పెషలైజ్ చేశారు."

"అంటే? అది ప్రత్యేక విభాగమా?"

"మన దేశంలో- పితికిన గుమ్మపాలు నుంచి-మాసం దాకా అన్ని పదార్థాల్లో-టి.బి బాక్టీరియా ఎక్కువగా వుంటుంది. పచ్చిగుడ్డు-గుమ్మ పాలు మనం ఎంతో ఆరోగ్యం అనుకుంటాం. వీటంత జబ్బు అయినవి యివ్వేగాని మరొకటిలేవు. వాటిని ఎగ్‌లో లోకలైజ్ చేసి, ఎలిమినేట్ చేసే ఎక్స్‌పరిమెంటులో యీయనకి చాలా పేరువుంది." అంది పంకజం. ఆమె మాటల్లో భేషిజంగాని-భర్త గొప్పవాడన్న గర్వంగాని లేదు.

"మీరు వెటర్నరీ సైన్సు చేశారుట. స్త్రీలు ఆ బ్రాంచి ఎన్నుకోటం చాలా తక్కువ కదూ?"

"యుమీన్ పశువుల డాక్టర్ అనేనా....? ఆ రోజుల్లో నన్ను ఆడపశువుల డాక్టరు అని పిల్చి ఏడిపించేవారు. మా అమ్మ నన్ను ప్రత్యేకమైన కోర్సు తీసుకోమంది. తీసుకున్నాను."

"మీ యిష్టప్రకారం కాదా?" అడిగారుప్రసాద్.

పంకజం తలఎత్తి సూటిగా సాయిప్రసాద్ కళ్ళలోకి చూసింది. ఆమె కళ్ళలో సంకోచంలేదు, బెదురూలేదు. క్షణం పాటు అల్లారెప్ప వాల్చకుండా చూసి, "ఈ ప్రశ్నలన్నీ ఎందుకు అడుగుతున్నారు? ఈ ఖబుర్లకోసం నన్ను పిల్చారనుకోను." అంది నెమ్మదిగా."

"లేదు, మీ అమ్మగారి ప్రభావం మీ మీద ఎంతవుందో తెలుసుకోవాలని.... మరో వ్యక్తి మీద కంటే...."

"ఎవరా మరో వ్యక్తి?"

"ఆనందరావు?" అన్నాడు వత్తి పలుకుతూ సాయిప్రసాద్.

పంకజం కదలలేదు. నిశ్చలంగా అలా రెండు నిముషాలు కూచుంది, సాయిప్రసాద్ కూడా నిశ్శబ్దంగా వుండిపోయాడు. తను అన్న ఆ పేరు ఆమె హృదయంలోని జ్ఞాపక పొరలలోకి లోతుగా పోనివ్వమన్నట్లుగా. ఆ పేరు ఆమెలో ఎంత లోతుకెళ్ళింది? ఎక్కడ గుచ్చుకుంది. అని చూస్తున్నాడు పరిశీలనగా- అయితే పంకజం ముఖంలో మార్పులేదు. మామూలుగానే వుంది.

"ఆ వ్యక్తి ఎవరో నాకు తెలియదు- అని అబద్ధం ఆడను. ఆడే అవసరంలేదు. మీకు ఎలా పరిచయం? ముందా విషయం చెప్పండి" అడిగింది పంకజం.

ఆమె యింత సూటిగా అడిగేస్తుందని సాయిప్రసాద్ అనుకోలేదు ఆఖరికి ఆనందరావు గూడా ఎలిజబెత్ విషయం-ఎత్తితేగాని అసలు విషయం చెప్పలేదు, అట్లాంటిది-ఒకస్త్రీ-తన గత జీవితంలోని దుర్ఘటనకి కారకుడైన వ్యక్తి గురించి ఎలా యింత నిర్భయంగా ఎలా అడగగలుగుతోంది?

"మీ దగ్గరకొన్ని విషయాలు సూటిగా చెపుతాను. మీరు 'ఫ్రాంకు'గా వున్నట్లే-నేనూ వుంటాను. మీ అమ్మగారి మెళ్ళో చంద్రహారం పోయిందన్న విషయం మీకు తెలుసా?"

"తెలుసు? మా చిన్న వదిన మాధవి గొడవ జేస్తూవుందని కూడా తెలుసు," అంది పంకజం.

"మీకు ఆ నగ మీద యింటరెస్టులేదా? మీ అమ్మగారి చంద్రహారం గదా?"

"లేదు అనను కాని, మా చిన్న వదిన అనుకున్నట్లు ఆ ఎలిజబెత్ దొంగతనం చేసింది అంటే నమ్మలేకుండా వున్నాను. ఒకవేళ చేసినా- ఆ అమ్మాయి చేసినసేవకి యింతకి పదిరెట్లు యిచ్చినా మా ఋణం తీరదు." అంది పంకజం.

"అలా అని వదులుకుంటారా?"

"నిజం చెప్పమన్నారా? నాకు మా అమ్మ నగల మీద యింటరెస్టులేదు. మా అమ్మాయికి తెలుగు నేర్పించానుగాని బంగారం మీద వ్యామోహం నేర్పలేదు. అంతగా వస్తే-మిగతా నగలు మా వొదినలిద్దర్నీ పంచుకోమంటాను. అంతేగాని ఒక ఆడదాన్ని, పాపం, బీదదాన్ని పోలీసుల కప్పగిస్తే వూరుకోను."

"ఏం చేస్తారు?" అడిగాడు సాయిప్రసాద్.

"ఇంకా నిర్ణయించుకోలేదు."

"ఒకవేళ మీ అమ్మగారు ఆనగ ఎలిజబెత్‌కి యిచ్చారే అనుకుందాం."

"ఎందుకిచ్చిందో- ఆ కారణం తెలిస్తేగాని మా చిన్న వదిన వూరు కోదు."

"ఇందులో-మీ అన్నయ్యలూ పెద్ద వదినగారి ప్రమేయం లేదా?"

"ఈ వివరాలన్నీ ఎందుకు అడుగుతున్నారు?" మళ్ళీ ప్రశ్నించింది పంకజం.

"ఇందులో-మీ పాత్రా వుంది కాబట్టి...." ఆగాడు ప్రసాద్.

"నేనా? నాకివ్వలేదుగా."

"మీకు-కాదు. మీకు సంబంధించిన మరో వ్యక్తికి-మీ అమ్మగారు కావాలనే యిచ్చారనుకోండి."

"ఎవరూ ఆనందరావు కా?"

"కాదు. ఎలిజబెత్-తమ్ముడు రాబీకి."

"ఆ పిల్లవాడికీ నాకూ సంబంధం ఏమిటి? మీరు 'రిడిల్స్'లో మాట్లాడుతున్నారు."

"ఉంది. ఆనందరావుగారికి-మీకూ వున్న సంబంధానికి ఫలితం- ఆ రాబీ." అన్నాడు సాయిప్రసాద్.

ఈసారి పంకజం మొహంలో ఆశ్చర్యం- ఒకరకమైన విభ్రమం- అంతదాకా స్పష్టంగా వున్న ఆ కళ్ళలో- కను గుడ్లపైన సన్నని పొరవంటిది- చోటు చేసుకుంది. ఆమె ఆలా శూన్యంలోకి చూస్తూ కూచుండి పోయింది.

"అయామ్‌సారి. ఈ విషయాలుపైకి చెప్పాలని నేను అనుకోలేదు. కాని ఎలిజబెత్ దొంగకాదు. ఆ చంద్రహారం మీ అమ్మగారు రాబీని గుర్తించి కావాలనే వాడిమెళ్ళో వేశారుట." అన్నాడు అతి నెమ్మదిగా. ఈ మాటలు ఆమె చెవుల్లోకి వెళ్ళినాయా లేదా అన్నది అతనికి అవగతం కాలేదు. ఈ మాటలు అన్న తరువాత నిశ్శబ్దంగా వుండటంకూడా అతనికి సాధ్యంకాలేదు. "ఈ విషయాలు నాకూ డాక్టరుగారికి తప్ప ఎవరికీ తెలియవు."

"ఎలిజబెత్‌కి?" అడిగింది పంకజం.

"ఎలిజబెత్‌కి-రాబీకి మీకు సంబంధం వుందని తెలియదు."

"మీకెట్లా తెలిసింది?"

"మీ అమ్మగారు రాబీకి చంద్రహారం యివ్వటానికి వెనుక బలవత్తరమైన కారణం వుండి వుంటుందనిపించింది."

"పూర్ మదర్- పూర్-" అంది పంకజం జాలా జాలిగా.

సాయిప్రసాద్ కి ఆశ్చర్యంగా వుంది. పంకజం తల్లిని తలుచుకు జాలి పడుతుందా. "దేనికి?" అడిగాడు.

" మా అమ్మ ఆ పిల్లవాడు పోయాడని అబద్ధం చెప్పింది."

"మీ అమ్మగారు అబద్ధం చెప్పలేదు. అక్కడి ఆయా ఆమెని మోసగించింది- అంతే తప్ప మీ అమ్మగారు అబద్ధం ఆడలేదు".

"చాలా థాంక్సండి- నాకు చాలా తృప్తిగా వుంది."

"దేనికి?"

"మా అమ్మమీద నాకు విపరీతమైన గౌరవం. ఎడ్మిరేషను. ఆమె అబద్ధం చెప్పింది. అనేప్పటికి ఒక్కసారి వుసూరుమంది. నా ఆదర్శమూర్తి కింద పడి పోయిందన్న బాధ కలిగింది. ఎందుకంటే- నేను యీ విషయంలో-నా జీవితభాగస్వామితో అబద్ధం చెప్పి- వైవాహిక జీవితం ప్రారంభించను-అని మా అమ్మకు మాట యిచ్చాను. అలాగే చేశాను."

ఇప్పుడు వులిక్కి పడటం సాయిప్రసాద్ వంతయింది. అతని అంచనాలూ-భయాలూ. సంప్రదాయపు సంకెళ్ళు-అన్నీ తల్లకిందులై పోతున్నాయి. నాలిక మెలిపడినట్లవుతోంది.

"మీ వారికీ విషయం తెలుసా?"
పంకజం ఆశ్చర్యంగా చూసింది.

"మీకెందుకంత ఆశ్చర్యంగావుంది! మే మిద్దరం స్టేట్సులో

చదువుకున్నాం. అక్కడ పెళ్ళిళ్ళు-విడాకులు- పిల్లలూ సర్వసామాన్యం. నా జీవితంలో 'ఎఫైర్' వుంది. కాని ఆ జరిగిన దానికి నేను విలువయివ్వటంలేదు. అని చెప్పాను. అతనూ యివ్వలేదు." అంది పంకజం.

సాయిప్రసాద్‌కి యింక అడగాల్సినవీ- తెలుసుకోవలసినవీ ఏమీ లేదనిపించింది. ఈ సమస్యని తాము చాలా పెద్దదిగా వూహించుకుని, నానా హైరానా పడ్డారు. మొదట్లోనే పంకజాన్ని సంప్రదించి వుంటే చిక్కుముడి విడిపోయి వుండేది.

"ఇప్పుడేం చేస్తారు?" అడిగాడు సాయిప్రసాద్.

"చేసేందుకు ఏముంది? నా భర్తా పిల్లలూ నా జీవితం యిప్పటిదాకా ఎలా గడిచిందో అలాగే గడుస్తుంది" అంది పంకజం.

"అయితే- అయితే—" ఆగిపోయాడు సాయిప్రసాద్.

పంకజం జాలిగా చూసి నవ్వింది. "ఈ మాటనిన్నాక నేను విరుచుకు పడిపోతానని.... లేక పెద్దపెట్టున ఏడుస్తానని మీరు అనుకుంటే...."

"ఛీ, ఛీ అదేంలేదు" ఖంగారుగా సర్దుకున్నాడు.

"ఆ పిల్లవాడు బ్రతికి వుంటం కాస్త ఆశ్చర్యంగానే వుంది. ముక్కు మొఖం ఎరగని ఆ ప్రాణిమీద నాకు ప్రేమవుందని అబద్ధం చెప్పను. కడుపుతీపి, నవమాసాలు మొయ్యటం యివన్నీ బూటకం-"

"మీరు మోశారుగా!"

"మోశాను- వేరు దారిలేక! క్షణ క్షణం అసహ్యంచుకుంటూ భయంతో పిచ్చిదాన్నయి మోశాను. ఆ టైములో మా అమ్మే నాకు అండగా నిలవకపోతే- ఏమైపోయేదాన్నో...." వాళ్ళు గగుర్పొడిచినట్టుగా- కదిలింది పంకజం.

"మీ నాన్నగారికి తెలియదుకదూ?"

పంకజం మొఖంలో ఆదుర్దా. ఒక రకమైన భయం. ఆ హాల్లోకి వచ్చినప్పటినుంచీ కనపడని భీతి ఆ కళ్ళలో చోటు చేసుకుంది.

"ఆ పిల్లవాడి విషయం- మా నాన్నగారికి తెలుసా?" అడిగింది ఆదుర్దాగా.

"తెలియదు. నాకూ డాక్టరుగారికి, మీకూ తప్ప ఎవరికీ తెలియదు. ఆనందరావు తన గురించి చెప్పవద్దన్నారు...."

"ఎందుకని?" అడిగింది కుతూహలంగా.

"సాఫీగా వెడుతున్న మీ జీవితంలో కలతలు రాకూడదని...." అన్నాడు ప్రసాదు.

"మా ఇంట్లో యింకెవ్వరికీ తెలియదా?"

"తెలియదు"

"మరి మా మాధవి....?"

"ఆవిడ ఎలిజబెత్ దొంగదనే నిర్ణయానికి ఎప్పుడో వచ్చారు-"

"పూర్ మాధవి- పూర్ థింగ్"

"మీ మాటలు వింటుంటే ఆశ్చర్యంగా వుంది. మీకు మీ చిన్న వదినమీద కూడా సానుభూతి వుందా?" అడిగాడు.

"మీరు మా అన్నలని చూశారా?" అడిగింది.

"లేదు. ఆ రోజున హాల్లో వుండి వుండవచ్చు. కాని ఫలానా అని తెలియదు." అన్నాడు సాయిప్రసాదు.

"మనిషికి పట్టుదలా.... కోపం ఎప్పుడొస్తుందంటారు?" అడిగింది. పంకజం.

ఇదేదో సైకాలజీ టెస్టులా వుందే అనుకున్నాడు ప్రసాదు.

"మన జీవితాలు సరిదిద్దుకోడం.... పాడు చేసుకోటం చాలా వరకు మనమీదనే ఆధారపడి వుంటుంది. అది చేతగాక ఇతరులమీద నెపం తోస్తూంటాం. మాఅమ్మ నాకు నేర్పిన మొదటిపాఠం యిదండీ! ఆ రోజుల్లో నేను పిచ్చిదానిలా ఏడుస్తూ కూచున్నప్పుడు, మా అమ్మ రోజూ గీతోపదేశంలాగా నా చెవులో నూరిపోస్తూవుండేది. నీ జీవితం చెడిపోలేదు. నువ్వు పడిపోలేదు- నేను నీ పక్కన వుండి చెయ్యి అందిస్తాను. నీకేం భయంలేదు...." అని. నా జీవితం నేను ఇలా ఫలవంతం చేసుకున్నపుడు.... మా చిన్న వదినకు అంత అసంతృప్తి ఆక్రోశం ఎందుకు వస్తున్నదో బోధపడకుండావుంది...."

"మీ అమ్మగార్కి- ఆవిడకు పడేది కాదా?"

"మా అమ్మని మీరు చూడలేదు కదూ! ఒకసారి మా అమ్మతో పరిచయం అయితే తేలిగ్గా మర్చిపోలేరు."

"అవునట- ఈ విషయం మరో వ్యక్తి కూడా చెప్పాడు-" అన్నాడు సాయిప్రసాదు.

ఆ వ్యక్తి ఎవరూ అని పంకజం అడగలేదు.

"మా అమ్మకు ఎవరితోనూ పేచీలేదు- వుండేదికాదు. తామరాకుమీద నీటిబొట్టులాగా వుంటం చేతనవును. అలా అని తనవాళ్ళని పట్టించుకోదు, అనుకోకండి. మా పెద్దన్నయ్యకు తను వెతికి పెళ్ళి చేసింది. చిన్నన్న- కావాలని మాధవిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. అయినా వాళ్ళకి పడదు.-"

"ఏ విషయాల్లో-"

"అన్నిట్లోనూ! వ్యతిరేక స్వభావాలు ఆకర్షణకు లోనవుతాయి- అంటారు. ఆ ఆకర్షణ, దాంపత్యం అనేప్పటికి, కొన్నిసార్లు రణరంగం తప్ప, సంసారంకాదు."

"మీ అమ్మగారి చంద్రహారం గురించి మీ చిన్న వదినగారు అంత పట్టుదల ఎందుకు చూపుతున్నారంటారు? మరి మీ పెద్దవదిన గారూ....'

"దాని వెనక చాలా కధ వుంది. నిజానికి చంద్రహారంమీద సెంటిమెంటల్ ఎటాచ్‌మెంటు కూడా లేదు. అది అయినా నేను సంతోషించేదాన్ని."

"నామీద జెలసీ— ఆక్రోశం"

"మీ మీదనా? దేనికి?"

"ఆవిడ కలలుగన్న జీవితం.... నాకు దొరికింది."

"అంటే! మీవారిని ఆవిడ ప్రేమించారా?"

పంకజం పక్కున నవ్వింది. "మీరేమిటండీ- అన్నీ ప్రేమకి ముడిపెడతారు. ప్రేమ అంటే_ ఏమిటి? ఒక్క చూపులో_ మరో మనిషి మీద ప్రేమకలుగుతుందా? లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అన్నది- వుత్త హంబక్- ప్రేమ ఎదుగుతుంది. రోజు రోజుకి ఎదిగి పటిష్టమవుతుంది తప్ప! తొలివీక్షణంలోని ప్రేమనిలవదు—"

పంకజం తన స్వానుభవం చెపుతోందా?

"సి. ఎ. కంటే డాక్టరు గొప్ప- రెండు చేతులా సంపాయిస్తాడు కార్లూ- యిళ్ళూ ప్రజంట్లూ యివన్నీ కలలుగని- మా రెండో అన్నయ్యని ప్రేమించింది మాధవి. కాని మా అమ్మకి మనసులో తెలుసు ఆనాడే. మా పెద్దన్నయ్య చాలా సౌమ్యుడు. పైకి వదినమాటలు విననట్లు కనపడినా- ఆవిడ చెప్పినవన్నీ వింటాడు-- సాయంత్రం అయ్యేప్పటికి యింటికొచ్చేస్తాడు...." చెప్పటం ఆపి- "మిమ్మల్ని విసిగిస్తున్నానా?" అడిగింది పంకజం.

"లేదు. చిత్రం ఏమిటంటే- మీ అమ్మగార్ని నేను కంటితో చూడలేదు. కాని ఒక్కొక్క-కోణం నుంచి ఆమె వ్యక్తిత్వం గురించి వింటూవుంటే- అరె-రె ఇటువంటి వ్యక్తిని కలుసుకునే మహదవకాశం ఎందుకు పోగొట్టుకున్నాను?.... అని బాధకలుగుతోంది." అన్నాడు ప్రసాదు.

"మా రెండో అన్నయ్య ఆదర్శవాది. వాడికి స్టూడెంటు మువ్మెంటులో ఇంటరెస్ట్. పూర్తిగా "లెఫ్ట్" కాదుగాని- డబ్బు అన్ని అనర్థాలకీ మూలం అని వాడి ఫిలాసఫీ- అట్లాంటివాడిని మా వదిన పెళ్ళి చేసుకుని వప్పులో కాళేసింది."

"ఏం?"

"ఏవుంది. మావాడు యమ్. బి. బి. యస్ చదివి, ఎల్లోపతీ మందులు విషంతో సమానం అని, హోమియోపతి మందులు వాడ్తాడు. మా అమ్మకి ఇది చాలా నిరుత్సాహం కలిగించిన విషయం. కాని, ఆవిడ తట్టుకుంది. ఫరవాలేదు వీడికి ఎందులో నమ్మకంవుంటే, ఆ వైద్యమే చెయ్యమనండి- అని"

"మీ వొదినగారు వొప్పుకోలేదా?"

"ఏ వైద్యం అయినా బాగా డబ్బొస్తే వూరుకునేది- వీడేమో సంచీలో మందు పొట్లాలు పెట్టుకుని మురికివాడలకీ, పల్లెటూళ్ళకీ వెళ్ళి మందులు యిస్తుంటాడు. అది కూడా డబ్బుపుచ్చుకోడు."

"అందుకని మాధవిగారికి అసంతృప్తి అన్నమాట."

"మా అన్నయ్య కాస్త మొండి- కారు ఎక్కడు. సైకిల్‌మీదగాని వెళ్ళడు. ఖద్దరు కట్టుకుంటాడు. క్లబ్‌లకీ వాడికీ చుక్కెదురు, మా వదిన పూర్తిగా వీడికి వ్యతిరేకం...."

"పోనీ, విడిపోవచ్చుగా...."

"అంత తెగింపు యీ దేశంలో స్త్రీలకి యింకా రాలేదండి.

తన్నుకుంటూ- సాధించుకుంటూ- కలిసి బ్రతుకుతారు. మా వదినకు వుద్యోగం వుంది. తనకారు తనకి వుంది- అత్తమామల "సెక్యూరిటీ" వుంది. చికాకు పడుతూనే అలా వుండిపోయింది."

"ఇవన్నీ మీ అమ్మగార్కి- తెలుసా?"

"ఎంతమాత్రం తెలియవు. ఎవరికీ చెప్పలేక వూరుకునేది. వాడికేమో ఆదర్శాలు- యీవిడకేమో దర్జాలు."

"చంద్రహారంకీ-ఆమె జీవితంలోని అసంతృప్తికీ నాకెక్కడా సంబంధం కనిపించటంలేదు" అన్నాడు సాయిప్రసాద్.

"మీరు మానవ నైజాన్ని బాగా తరిచి చూసినపుడు వాళ్ళు చేసే ప్రతి పనికీ-వెనక కారణాలు కనిపిస్తాయండీ-సైకాలజీ రీత్యా చూస్తే- ఇది పూర్తి నిజం అని వొప్పుకోవాలి."

"ఎట్లా?"

"మా చిన్నవదిన గురించి-మిమ్మల్ని విసిగించేటంత-దీర్ఘమైన విషయాలు చెప్పాలి. మా వదినను మీరు చూశారు. ఆమె డబాయింపు విన్నారు, అవునా?"

"చూశాను-మంచి స్మార్టుగా వున్నారు."

"అది ఆవిడ ప్లస్ పాయింట్. మడత నలక్కుండా యిస్త్రీ చీరెలు, షోకేసులో బొమ్మలా కట్టుకోటం తన ప్రత్యేకత అనుకుంటుంది...."

మాధవి స్మార్టుగా వుంటుందని ఈ పంకజానికి జెలసీ కాదు కదా అనే ఆలోచన మెదిలింది సాయిప్రసాద్‌లో.

"స్మార్టుగా-అందంగా వుండే స్త్రీలు పురుషుల మధ్య రాణిస్తారు గాని-తోటి స్త్రీల మధ్య కాదు. ఇది స్త్రీల కాలేజీల్లోనే పని చెయ్యాలని అనుకునేవారు నేర్చుకోవలసిన తొలిపాఠం." అంది పంకజం.

సాయిప్రసాద్ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"మా మాధవికి-కాలేజీలో ఒక్క ఫ్రెండు కూడాలేదు.ఈవిడ ఫిలిమ్‌స్టార్‌లా-తన కారు తాను డ్రయివ్ చేసుకుంటూ కాలేజీకి వెళ్తుంది. పిల్లలంతా యీ మేడమ్ ఫాషన్సుని అనుకరిస్తారు. అది మొదట్లో బాగానే వుంటుందిగాని, మిగతా లెక్చరర్స్‌కి- యీవిడ 'మోడల్'లాగా- కాలేజీకి వస్తుందని కోపం! అంచేత మా చిన్న వదినకు కాలేజీలో ఒక్క ఫ్రెండులేదు.లిఫ్టుయిస్తే ఎక్కుతారు గాని-స్నేహితురాలు అని దగ్గరకు రారు-"

"పూర్ థింగ్-"

"అదే, నేను అనేది. మా చిన్నవదిన పైకి అంత డబా యిస్తుందిగాని-మానసికంగా తను వంటరి మనిషి. ఆమె హృదయానికి దగ్గరగా ఎవరూ రాలేదు. ఆఖరికి మా చిన్నన్నకూడా."

"ఆమె రానివ్వరేమో!"

"అయివుండవచ్చు. మా అమ్మకూడా చాలా సార్లు అంటూ వుండేది.వాడేమో బీదా బిక్కీ అంటూ రోడ్లవెంట తిరుగుతాడు.ఇదేమో క్లబ్‌లూ పార్టీలూ అంటూ తిరుగుతుంది.ఆ చిన్నపిల్ల సంగతి ఇద్దరూ పట్టించుకోరు అని. మా వదిన తనలోని వంటరితనాన్ని అసంతృప్తినీ మర్చిపోయేందుకు క్లబ్‌లకి వెళ్తూండేది. కాని అక్కడకూడా ఆమెకి సరిఅయిన ఆదరణ లభించేది కాదనుకుంటా-"

"ఎందుచేత?"

"ఈ దేశంలోనే కాదండి-ఏ దేశంలోనైనా-ఆఖరికి అమెరికాలో కూడా-వంటరి మొగాడికి వున్న- ఆదరణ వంటరిగా వచ్చిన స్త్రీకి వుండదు....క్లబ్‌కి వంటరిగా వెళ్ళితను యింకా అన్‌పాపులర్ అవుతున్నానని గ్రహించుకోలేక పోతూండేది. మా మాధవి జీవితంలో ఒక స్థితి వచ్చేప్పటికి-ఆమె అందాన్ని మెచ్చుకునేవారు తప్ప- వారు కూడా

పురుషులు తప్ప- హృదయానికి దగ్గరగా వచ్చిన స్త్రీలు-ఒకరుకూడా లేకపోయారు."

"కాని ఆడవాళ్ళకి ఆడ స్నేహితులు అరుదుగా వుంటారంటారు?"

"అలా ఆడస్నేహితులులేని స్త్రీకి-అసంతృప్తితో-ఏకాంతంగా జీవితం గడపాల్సి వస్తుంది. అసలు భర్తతో స్నేహం చేసుకోలేని స్త్రీని చూసి జాలిపడాలి."

"మీరు కొత్తమాట వాడుతున్నారు. మనదేశంలో భార్యా భర్త మధ్య స్నేహం అనేది వుండదు."

"మీరు సూక్ష్మంగా పరిశీలించి వుండరు. మా అమ్మకూ నాన్నకీ మధ్య చాలా లోతైన స్నేహం వుంది. దీన్ని అర్థం చేసుకోటం అనండి. పరస్పర అవగాహన అనండి, ప్రేమ అనండి. మీరు ఏ పేరుతో పిలిచినా-ఒక విషయం గురించి యిద్దరూ అన్నిసార్లూ ఒకే అభిప్రాయానికిరాకపోయినా-అభిప్రాయ భేదం వచ్చింది కదా అని రోజులు వారాలూ-యుద్ధం ప్రకటించుకోరు- బిగదీసుకుపోరు...."

"మీరు?" అడిగాడు సాయిప్రసాద్ కాస్త చనువుగానే.

"మేము సమస్య వచ్చినపుడు బాగా వాదించుకుంటాం. గొంతులు చించుకుంటాం. కాని వెంటనే మళ్ళీ మాట్లాడుకుంటాం. ఇది మా అమ్మ నేర్పిన తొలిపాఠం."

"మరి మీ వదినగారికి ఎందుకు నేర్పలేదు"

"చెప్పానుగదా! మా మాధవి ఎవరు చెప్పినా వినదు. ఇతరుల అభిప్రాయం వినటం చిన్నతనం అనుకుంటుంది. ఆవిడ భాషలో- ప్రతి విషయంలో తనకి ఇతరులమీద 'విడ్జి' వుండాలనుకుంటుంది_ఆ స్వభావం తనని ఎంత 'అన్ పాపులర్' చేస్తుందో గ్రహించుకోలేని అమాయకురాలు." అంది పంకజం.

"మీరు ఇంత విశదంగా–మీ మాధవిగారి స్వభావాన్ని ఎనలైజ్ చేస్తున్నారుకదా–ఆవిడతోనే ఎందుకు చెప్పలేదు."

"అవకాశం యివ్వదు. తన మాట, తన ఆలోచనా విధానం, యివే రైటు అనుకుంటుంది. అందం, తెలివి, చాకచక్యం– యివి తన సొత్తు అనుకుంటుంది."

"ఇలా చాలామంది ఆడవాళ్ళు అనుకుంటారండి–" అన్నాడు సాయిప్రసాద్.

"ఎవరికివారు అనుకోవచ్చు. కాని అది పైకి ఎదుటివారిముందు ప్రదర్శించాలని అనుకున్నపుడే, సమస్యలు ఆరంభమయేది. ఇప్పుడు చూడండి–అనవసరంగా– మా మాధవి మీ ముందు తేలికయింది. మిమ్మల్నీ డాక్టరుగార్నీ నిలవనివ్వటంలేదని మా యింట్లో అందరికీ తెలుసు. కాని అడ్డుపెట్టేందుకు–యిలా చెయ్యకు–అని వారించేందుకు మేము ఎవరం ప్రయత్నించలేదు...." అంది పంకజం.

"ఎందుకని? మాకూ ఆశ్చర్యంగానే వుంది. ఆ చంద్రహారం మీద మీకు మోజులేదా? డబ్బంటే లక్ష్యంలేదా? లేక, మాధవిగార్ని చూస్తే భయమా?"

"చంద్రహారం మా అమ్మకంటే విలువైందికాదు. ఆమె పోయాక– ఆ నగల గురించి మాకెవరికీ పెద్దపట్టింపులు లేవు. అసలు మా అమ్మ వంటిమీద పెట్టుకున్న ఆ హారాన్ని నేను వేసుకోలేను, వేసుకోను. నా కూతురికి పెట్టను. ఆ హారం వంక చూసిన ప్రతిసారీ మా అమ్మ నాకు జ్ఞాపకం వస్తుంది. ఇక డబ్బంటారా– మాకు అవసరాలకు సరిపోను డబ్బుంది. ఈ హారాన్ని డబ్బు రూపంలోకి మార్చి దాన్ని ఖర్చుచేసుకోటం మరీ క్రూరంగా అనిపిస్తుంది. అంతే, ఆ నగకి సెంటిమెంటల్ వాల్యూ తప్ప మరేం విలువలేదని అర్థం చెప్పుకోవాలి. అలాంటి సెంటిమెంటే ముఖ్యం. అనుకున్నపుడు–మా అమ్మ తాలూకు ఏ వస్తువైనా దాచుకోవచ్చుగా.ఇక్కడ డబ్బుకంటే పట్టుదల ఆ 'నప్స'పట్ల అకారణమైన ద్వేషం....యివే ఎక్కువ."

"దేనికి?"

"మా అమ్మకి ఆఖరి పదిహేనురోజుల్లో చాలా దగ్గిరగా వచ్చిన వ్యక్తి ఎలిజబెత్. ఆ పిల్లగురించి మా అమ్మ అంత పొగడటం- మా మాధవి భరించలేగు "

"మీకో?.

"నేను అమ్మకు జబ్బుచేసిన వెంటనే రాలేదు. అదీగాక యీ జీవన ప్రయాణంలో-ప్రేమలని కూడా ఆయా పరిస్థితులని బట్టి పంచు కుంటూ వెళ్ళాలి అని మా అమ్మ చెప్పింది నాకు. ఒక కాలంలో- ఆ మాటలు నా హృదయాన్ని గట్టిగా పట్టుకుని వుండకపోతే యీ పాటికి పిచ్చిదాన్ని అయిపోయి వుండేదాన్ని."

"ఎప్పుడు? రామాపురం అప్పుడా?"

"అవును" అన్నట్లు తలవూపి-కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయింది ఆమె. సాయిప్రసాద్‌కి ఈ పంకజాన్ని చూస్తే విచిత్రంగా వుంది. ఒక రకమైన గౌరవమూ కలుగుతోంది.పంకజం- చుట్టూ వున్న స్త్రీలలాగా-అనవసరమైన సిగ్గుని గాని-భేషజం కాని ప్రదర్శించటంలేదు. అసలు తను స్త్రీని అన్న విషయం విస్మరించి అతి సహజంగా మాట్లాడగలగటం- ఎంత గొప్ప విషయం! టైము చూసుకున్నాడు. ఆరయింది. గంటనుంచీ ఈమె- పరాయి మొగ వాడైన తనతో-అతి ప్రమాదకరమైన విషయాలు మాట్లాడుతోంది. ఆ మాటల్లో సంకోచంలేదు. తడబాటులేదు. మూడో వ్యక్తిని గురించి మాట్లాడుతున్నట్లు చెప్పుకుపోతున్నది. ఇంతటి డిటాచ్‌మెంట్ ఒక స్త్రీకి ఎలా కలిగింది? ఈమె 'గిల్టీ'కాంప్లెక్స్ లేకుండా ఎలా ఉండ గలిగింది? బయట పోర్టికోలో దీపం ఎవరో వేసినట్లున్నారు. కిటికీలో లోంచి వెల్తురు చొచ్చుకొచ్చింది గదిలోకి. సాయిప్రసాద్ లేచి స్విచ్

వేశాడు. గది అంతా-దీపకాంతి పరచుకుని-దేదీప్యమానంగా వుంది. ఆ వెల్తురులో ఆమె ముఖం ఎలా వుందో చూడాలని- కళ్ళెత్తి చూశాడు. ఆమె కళ్ళలో-సంకోచంలేదు. అవమానకరమైన బాధలేదు- మామూలుగా ఉంది-చుట్టూ నిశ్శబ్దం-ఇంట్లో ఎవరూ లేనట్లున్నారు. డాక్టర్ మూర్తి ఇంటికొచ్చి-భార్యని సినిమాకు తీసుకెళ్ళిపోయాడా? పనివాళ్ళు కూడా లేరా- తామిద్దరం ఇలా వంటరిగా ఈ ఇంట్లో ఉన్నపుడు ఎవరన్నా చూస్తే....

"మా యింటికి ఫోన్ చేస్తాను. ఎక్స్క్యూజ్ మి." అంటూ సోఫాలోంచి లేచి-పంకజం డయల్ తిప్పింది. అవతల కంఠం బహుశా భర్తది కాబోలు. "ఇంకో గంట ఆగివస్తాను. చాలా యింటరెస్టింగ్ డిస్కషన్‌లో ఉన్నాను, డాడీ దగ్గర కూచుని ఆయనకి కంపెనీ ఇవ్వండి." అంటూ ఫోన్ పెట్టేసింది.

కొంపదీసి ఈ విషయాలన్నీ భర్తకి చెప్పేస్తుందా? సాయిప్రసాద్‌కి దుడుకుగా వుంది. మనసులోని సందేహాన్ని అణుచుకోలేక "ఈ విషయం- మీ వారికి చెపుతారా?" అడిగాడు కాస్త ఖంగారుగానే.

పంకజం నవ్వింది. చెపుతాననూ అనలేదు-చెప్పనూ అనలేదు.

"ఇంతకీ యీ పరిశోధన మీదా-డాక్టరుగారిదా? యిందులో మీ పాత్రేమిటి?" అడిగింది సాయిప్రసాద్‌ని.

"మాధవిగారు ఆ నర్సుని పోలీసులకి అప్పగిస్తామని-మీ మదర్ బాడీ యింట్లో వుండగానే మమ్మల్ని బెదిరించారు, ఆరోజు మమ్మల్ని మేడమీదకి పిలిచి మీరు అక్కడే వున్నారు బహుశా మర్చిపోయారేమో...."

"జ్ఞాపకంలేదు. ఆనాడు చాలామంది తెలిసినవీ, తెలియనివీ ముఖాలు చాలా చూశాను. మీకు అప్పటికే చంద్రహారం సంగతి తెలుసా?"

"తెలుసు. నర్స్, బాడీ వెళ్ళిపోగానే, ఆ హారం డాక్టర్‌కి యిచ్చింది. దొంగతనం చేసేమనిషి అయితే ఆయన చేతికి తీసి యివ్వదుగా- అసలు ఆ హారం నర్స్‌కివ్వలేదుట. ఆ పిల్లవాడిని గుర్తించి-దగ్గరకు పిల్చి-ముఖం ముద్దుపెట్టుకుని మెళ్లో వెయ్యబోయి వాడి చేతుల్లోనే వాడిని వేసుకోమని సౌంజ చేశాచుట."

"ఇదంతా నిజమా?" అని.

"అది నిజమో అబద్ధమో తెలుసుకోటానికే నేను-మీ వ్యక్తిగత జీవితం గురించి యిన్ని విషయాలు తెలుసుకోవలసి వచ్చింది. నా అయ్ ఫీల్ ఏ షేమ్.చాలా సిగ్గుగా

"ఎందుకు?"

"మొదట్లో-మీ అమ్మగారి గురించి అనుమానించాను-"

"ఛ ఛ...." అంది పంకజం విసుగ్గా.

"అది తప్పు అని రెండోరోజుకే తేలిపోయింది. ఆ తరువాత మీరు కావాలని యీ బాధ్యతనుంచి పారిపోయారనుకున్నాను."

"ఇప్పుడు-?"

"అవసరం అయితే ఆ బాధ్యత మోయగల-ధైర్యం, నైతికశక్తి మీకువున్నాయి."

"కాని, ఆ బరువుని నేను మొయ్యను. మొయ్యదలచుకోలేదు-" అంది పంకజం ఖచ్చితంగా.

సాయిప్రసాద్ వులిక్కిపడ్డాడు. ఒకరకంగా ఆనందరావూ

యింత స్పష్టంగా చెప్పేశాడు తనకి బాధ్యత అక్కరలేదని- ఈ పంకజం యింకా గట్టిగా చెపుతోంది. ఆనంగరావుకి కాళ్ళులేవు. భార్యకి యీ విషయాలు తెలియవు. ఈ పంకజానికి అటువంటి పరిస్థితికాదు. భర్తకి చెప్పి-ఆ బాధ్యత స్వీకరించగల శక్తివుంది. రాజీని పంపేందుకు, ఎస్తేరమ్మ తయారుగా వుందనికాదు. అసలు యీ విషయం యింత దృఢంగా ఎందుకు చెబుతున్నది. "ఇంతదూరం వచ్చాక-ఎందుకు? అని నేను అడగవచ్చనుకుంటా. తగిన కారణం వుండకపోతే మీరు అలా అనరు." అన్నాడు సాయిప్రసాద్.

"ఇరవై ఏళ్ళక్రితం-ఈ అనుభవం నుంచి బయటపడిన క్రొత్తలో మా అమ్మకి మాటయిచ్చాను-అయిదేళ్ళపాటు యీ జరిగిన విషయాలగురించి-తలుచుకోను,అతనిని చూడను అని మాటయిచ్చాను. ఆ తరువాత కాలేజీలో జేరేముందు- మా అమ్మ యీ ప్రస్తావన జన్మలో తేకూడదని-మా దార్లు వేరు అయిపోయాయని చెప్పింది. అమ్మ లేకపోయినా, నేను ఆవిడమాటను మీరను.ఆ ఇచ్చినమాటను వెనక్కి తీసుకోలేను." అంది నిబ్బరంగా పంకజం.

సాయిప్రసాద్‌కి ఈమెని చూస్తే కొత్తరకమైన గౌరవం కలుగుతూవుంది. ఒక మనిషి బాధ్యత తీసుకునే శక్తి కలిగివుండా-మాటపైన నిలబడుతున్నది. కాని....రాజీపట్ల యీమెకి బాధ్యతలేదా? ఈ లోకంలోకి తీసుకొచ్చిన ఆ నిర్భాగ్యునిపట్ల యీమెహృదయంలో కొద్దిపాటి స్పందనకూడాలేదా? తేరిపారచూస్తున్నాడు ఆమెవంక.

"లోకంలో ఎందరో అనాధలున్నారు మీరు చెప్పారు కాబట్టి-వున్నాడు అనుకుంటున్నాను.ఇరవైఏళ్ళుగా లేనిస్పందన-నేను కళ్ళతో కూడా చూడని ఒకప్రాణి గురించి,యీ క్షణంలో ఎలావస్తుంది? రాదు. నేను ఆ పిల్లవాడిని చూడాలని అనుకోవటంలేదు-చూడాలన్న కుతూహలమూలేదు." అంది పంకజం.

"విచిత్రం" అన్నాడు సాయిప్రసాద్.

"ఎక్కడో యిరవై ఏళ్ళు పెరిగిన ఆ ప్రాణిని కొత్త వాతావరణంలో, కొత్త పరిసరాల్లో తీసుకొచ్చిపెట్టి-అందరికీ సమస్యలు కలిగించటం తెలివితక్కువ.... అందుకని...."

"అందుకని...." ప్రశ్నించాడు ప్రసాద్.

"ఆ చంద్రహారం నా చేతికి యివ్వండి," అంది సూటిగా.

సాయిప్రసాద్‌కి 'అమ్మయ్య-' అనిపించింది. డాక్టర్ మూర్తి పక్కన వుండిఉంటే ఎగిరి గంతేసి వుండేవాడు. త్రాచుపాములాంటి ఆ నగని ఇచ్చేసి చేతులు దులుపుకుని వుండేవాడు. కాని, ఆ చంద్ర హారం యీమె చేతికి యిచ్చేస్తే.... ఏం జరుగుతుంది? ఎలిజబెత్ మీద దొంగతనం పడదు. బాగానే వుంది. మరి సుందరమ్మగారి ఆఖరి కోర్కెని మన్నించటం మాటో? ప్రసాద్ తనలో తను మధన పడు తున్నాడు. అతను నిశ్శబ్దంగా వుండిపోటం గమనించినట్లు పంకజం చిన్నగా నవ్వింది.

"మీకు సంశయంగా వుందా?"

"అదేంలేదు. చంద్రహారం మీ అమ్మగారిది. అంటే మీది.... అది డాక్టరుగారి లాకర్‌లో వుంది." అన్నాడు ప్రసాద్.

"అయితే ఆయనకి ఫోన్ చేసి తీసుకురమ్మనండి-" అంది. పంకజం విషయం తేల్చేస్తున్నట్లు.

సాయిప్రసాద్‌కి మరోమార్గం కనిపించలేదు. డాక్టర్‌కి చంద్ర హారం తెమ్మని ఫోన్ చేసి-అసంతృప్తిగా కూచుండిపోయాడు. అతనికి ఏదో అసహనంగా, అసంతృప్తిగా వుంది-ఈ చంద్రహారం ఈమె తీసుకెళ్ళిపోయి, ఇంట్లో అప్పగిస్తుంది. కాని-కాని-కాలు యీడ్చు కుంటూ-అక్కడ వెనక తలదాచుకున్న అమాయకుడు ఆ రాబీ మొఖం.

పదేపదే జ్ఞాపకం వస్తున్నది. తను కొండని తవ్వి ఎలకనిబట్టాడు. ఆ చంద్రహారం-సుందరమ్మగారు కావాలని ఇచ్చింది అన్నది నిరూపించ టానికి-కారు తీసుకుని అయిదురోజులు తిరిగాడు-అడ్డమైన మరియమ్మలో మాట్లాడాడు. చివరికి 'రాజీ మీ కొడుకు' అని గౌరవనీయురాలైన స-చదువుకున్న ఒక స్త్రీతో చెపితే-ఆవిడ పెద్ద పెద్ద ఆదర్శాలు వర్ణించి-చివరికి 'ఆ గొలుసు నాకిచ్చెయ్యండి'-అని అడుగుతోంది. ఏం మనుషులు-సాంబశివరావుకి-మరియమ్మకి-యీ పంకజానికి-అంతస్తుల్లో తేడాగాని-నైజం అంతా ఒకటేనా? అయివుండదే.

"మీరు ఇంకా వుంటారా?" అడిగాడు సాయిప్రసాద్ ఏదో ఒకటి మాట్లాడాలని. అతని మనసంతా చేదుగా వుంది. వీళ్ళందరి మధ్యనుంచీ వెళ్ళిపోవాలి. హాయిగా పెండుగ్లాసుల బీరు తాగాలి. అప్పటికిగాని మనసుకి శాంతి దొరకదు. ఈ డాక్టర్ వస్తే బాగుండును చంద్రహారం అప్పజెప్పేసి-ఎవరి ఖర్మ వాళ్ళదని వెళ్ళిపోవచ్చు.

"ప్రశ్న అడిగి-ఆలోచనలో పడ్డారేమిటి?" అడిగింది పంకజం.

అతను జవాబు చెప్పలేదు.

"మా నాన్నని మాతో తీసుకెళ్ళిపోతాం. మేము వెళ్ళిపోయాక, ఆయన పరిస్థితి ఎలా వుంటుందో వూహించుకోగలను-"

"ఏం? మీ పెద్దన్నయ్య వొదినా-మాధవిగారు చాలామంది వున్నారుగా?"

"మా పెద్దన్నయ్య వదినా ఫరవాలేదు. కాని వాళ్ళనికూడా మా చిన్నవదిన వొదలదు?"

"అదేమిటి?"

"చాలా ఫాస్టు చేస్తుందిలెండి. మీరే చూస్తారుగా! అడగటం మర్చిపోయాను. ఇంతకీ ఎలిజబెత్ ఎక్కడుంది? యీ వూళ్ళోంచి పారిపోయిందని విన్నాను."

"ఎవరు చెప్పారు?"

"ఎవరు చెప్పివుంటారు-మీరు వూహించుకోలేరా?" అడిగింది పంకజం.

మాధవిగారయి వుంటారు. అయితే ఆవిడ పొరబడ్డారు. ఎలిజబెత్ పారిపోలేదు. మేమే దాచేశాము. కావాలని యీ వూరునుంచి తల్లినీ, తమ్ముడినీ తీసుకుని ఎలిజబెత్‌ని మాకు తెలిసిన చోటుకి-ఇక్కడి నుంచి దూరానికి పంపాము." అన్నాడతను కాస్త తీక్షణంగా.

"ఎందుకు పంపివుంటారోనని యోచిస్తున్నాను."

"చెపుతా వినండి-మీవదినగారు అరెస్ట్‌వారెంట్ తెస్తే-ఎలిజబెత్ తమ్ముడికి గొలుసు ఇచ్చారని చెప్పక తప్పదు. అప్పుడు ఆ పిల్లవాడు ఎవరూ అన్న ప్రశ్న వస్తుంది.... అందుకని...."

"నేనూ అదే అనుకున్నాను. మీకు 'థాంక్స్' చెప్పి అవమానపరచలేను. ఇంత 'సెన్సిటివ్'గా-'సీక్రెట్'గా ఒక విషయాన్ని మీరు ఉంచారూ అంటే-అది మీలోని ఉన్నత సంస్కారం! నేనెవరో తెలీదు-నాముక్కు మొహం తెలియదు. అయినా మీరిద్దరూ"

"మీకోసమనేకాదు-మీ కుటుంబం పేరుని బట్టి-మీ అమ్మగారి మీద గౌరవం...."

"ఆ విషయం నాకు సంతోషాన్నిస్తోంది. మానాన్న-ఆయన తరానికీ-నాతరానికి మధ్య మూడుదశలు తేడావుంది. ఈరోజు నేను మా మాధవి గురించి ఆలోచించటంలేదు ఆవిడ యాగీ చేస్తుందన్నది కూడా నాకు లెక్కలేదు. మావారి గురించి బెంగలేదు. కాని మానాన్నకి యీ విషయాలు తెలుస్తే తట్టుకోలేరు. ఆయన కళ్ళలోని నమ్మకాన్ని నేను చెల్లాచెదురు చెయ్యలేను. అందుకోసం, ముఖ్యంగా, మీకు కృతజ్ఞత చెప్పుకుంటున్నాను." అంది పంకజం. ఆమె కంఠంలో ఉద్రేకం-నిజాయితీ పుట్టిపడుతున్నాయి.

ఇలా మాట్లాడే యీమె ఆ చంద్రహారం ఎందుకు అడుగుతోంది. ఏం చేస్తుంది?

"మీరూ-డాక్టరుగారు చాలా నిశితంగా ఆలోచించారు. అంత 'సెన్సిటివ్'గా ఆలోచించే వ్యక్తులు చాలా అరుదు అందునాయింములో మీకు ఎటువంటి లాభమూలేదు. పోనీ, నాతోగాని అమ్మతోగాని పరిచయమూలేదు. ఒక అపరిచితురాలికోసం ఇంత గుంభనగా ఉంచారు. అంటే-నాకు ఏం చెప్పాలో-ఎలా చెప్పాలో మాటలు రావటంలేదు...." ఆగిపోయింది.

"సత్యాన్వేషణకోసం నిజంతెలుసుకోవటంకోసం యీపరిశోధన ఆరంభించాం. ఇందులో మీకు సంబంధం ఉంటుందని మేము మొదట్లో వూహించలేకపోయాం."

"నేను కాకపోతే-మా అమ్మ! ఆవిడపేరు బయట పడకూడదన్న తాపత్రయం మీకు ఉందిగా?" అడిగింది పంకజం.

"అది కొంతవరకూ నిజమే" అన్నాడు సాయిప్రసాద్. పంకజం తామిద్దరినీ అభినందించటం అతనికీ కొంత ఘనంగానే వుంది. కాని- ఆమె ముఖప్రీతికోసం అంటున్నదా? హృదయాంతరాళ్యమైన మనిషా యీవిడ?

"ఒక్కొక్కపుడు-'సత్యం' అన్నది చాలామందిని బాధిస్తుంది అనుకోండి. అప్పుడేం చేస్తారు? సత్యం చెప్పాలి-సత్యం జయించాలి-అంటూ సత్యహరిశ్చంద్రుడి లాగా కేకవేస్తూ కూచుంటారా?" అడిగింది పంకజం.

"మాటలకు-చేతలకూ సమన్వయం లేనపుడు-'సత్యం-సత్యం' అని గింజుకుని లాభం ఏమిటి?"

"సత్యపథాన్ని అమలుపరచలేనని మీరెందుకు సందేహిస్తున్నారు? మా అమ్మ ఆఖరికోర్కెని-నేను కార్యరూపంలో పెట్టలేనని మీకు అనుమానంకదూ-?" నెత్తిమీద కొట్టినట్లు అడిగింది.

ప్రసాద్ తడబడ్డాడు-తన మనసులోని భావసంచలనాన్ని

యీామె పుస్తకంలాగా చదివేస్తున్నది. తన వుద్దేశాల్ని సందేహిస్తున్నా నని పసికట్టింది–అతను జవాబుకి తడుముకుంటున్నాడు.

"ముక్కూ మొహం తెలియని అపరిచితులు మీరూ డాక్టరుగారూ. మీ కుటుంబం గురించి ఇంత ఆలోచించారు. మా ప్రతిష్టగురించి ఇంత అక్కర చూపారు-కాని అదే మా చిన్నవదిన–తన ప్రవర్తన వల్ల ఎంతమంది బాధపడతారు–ఎందరి మనసులని గాయపరుస్తారు–అన్నది ఒక్క క్షణంపాటు ఆలోచించి చూడలేదు. అక్కడికీ నేను అన్నాను. 'నీకెందుకు అది నీ చంద్రహారం కాదు గదా!' అని అయినా వినలేదు. పెద్ద ఘనకార్యం చేస్తున్నానని-ఒక అమాయకు రాలిమీద కత్తికట్టింది. దేనికి? ఆ నర్సు మా అమ్మకి శ్రద్ధగా సేవ చేసిందని–అమ్మ ఆ నర్సుని పొగిడిందని-యీ రెండు కారణాలవల్లే! అంటే శ్రద్ధగా సేవ చెయ్యటం కూడా తప్పు అన్నమాట.కానివ్వండి మా మాధవికి గుణపాఠం చెప్పే టైము వచ్చింది."

"ఏం చేస్తారు–" భయంగా అడిగాడు సాయిప్రసాద్.

"మీరే చూద్దురుగాని. మా అమ్మ అనుకున్నది చేసి తీర్తాను. అయితే మీ సత్యాన్వేషణంలోని కొంత భాగమే బయట కొస్తుంది.."

"అంటే?"

"ఆ పిల్లవాడి పాత్ర-అసలు వాడి ప్రమేయం యిందులో ఉండ కూడదు-"

"ఎలా?" అడిగాడు సాయిప్రసాద్.

"నర్సు దొంగకాదు అన్నది నిరూపిస్తాను. ఆ నగ ఎవరికి చెందాలో వారికి అందచేస్తాను-"

"ఎట్లా చేస్తారు?"

"అది మీరు అడక్కూడదు-నేను చెప్పను.మళ్ళీ మనం కలుసు కుంటామో లేదో.మరోసారి చెప్తున్నాను–మీరు ఎవరి పేర్లూ బయటకి

రాకుండా చాలా గుంభనగా వుంచారు. ఆ విషయం నేను జన్మలో మర్చిపోను," అంది పంకజం.

పోర్టికోలోకి కారు వస్తున్న శబ్దం. డాక్టర్ మూర్తి వస్తున్నాడు కాబోలు. ప్రసాద్ సోఫాలోంచి లేస్తూ-అన్నాడు. "మీ వదినగారు పన్నెండోరోజు దాటాక-ఒక్కగంట వూరుకోరుట-"

"కానివ్వండి.ఆవిడ చెయ్యదలచుకున్న గోల చెయ్యనివ్వండి."

"డాక్టర్‌గారికి నోటీసు పంపితే?"

"ఏమని?"

"ఆయన నర్సింగ్ హోమ్‌లో దొంగతనం జరిగిందని-"

"పంపనివ్వండి. ఆ నగ నా దగ్గర వుంటుంది కదా ఆవిడ సరదా తీరనివ్వండి." అంది పంకజం చిరునవ్వుతో.

ప్రసాద్‌కి ఈమె స్వభావం అర్థం కావటంలేదు. ఒక క్షణంలో వేదాంతం చెబుతూ మరో క్షణంలో నిర్లక్ష్యంగా మాట్లాడుతూంటుంది. ఏమిటీ మనిషి?

డాక్టర్ మూర్తి లోపలికొచ్చాడు. అతని ముఖంలో-పెద్దబరువు దిగిపోయినట్లు గొప్ప రిలీఫ్. చీకూచింత లేనివాడిలాగా లోపలి కొచ్చాడు.

"సారీ-నర్సింగ్ హోమ్‌లో ఆలస్యం అయింది-" అన్నాడు కూచుంటూ.

"మీరు కావాలనే వెళ్ళిపోయారు గదండి - మళ్ళీ క్షమార్పణ లెందుకు? ప్రసాద్‌గారు అన్ని విషయాలూ చెప్పారు." అంది పంకజం. జంకు లేకుండా - ఆమె అలా సహజంగా మాట్లాడుతుంటే, డాక్టర్ మూర్తికి ఖంగారుగా ఉంది. ప్రసాద్ చెప్పిన విషయాలని యీమె ఏ విధంగా తీసుకుంటారు? ఎలా ప్రవర్తిస్తారు?-అని సందేహిస్తూ లోపలి

కొచ్చాడు. ఆమె కళ్ళు స్వచ్ఛంగా, తెల్లగావున్నాయి-వాటిలో అతను ఎదురుచూసిన కన్నీటి పొరలు లేవు.

"చంద్రహారం తెమ్మన్నారుకదూ. అమ్మయ్య నానెత్తిమీంచి పెద్ద బరువు దించుకున్నాను" అంటూ జేబులోంచి - చంద్రహారం తీసి టేబుల్‌మీద పెట్టాడు. అది త్రాచుపాములా ఉండ చుట్టుకుని-దీపం వెలుగులో-తళ తళ మంటున్నది. నునుపుగావున్న-లామినేటెడ్ బల్ల మీద-పసిమివర్ణం చెదిరిపోయిన కిరణాల్లాగా ప్రతి ఫలిస్తున్నాయి.

పంకజం బల్లమీదవున్న చంద్రహారాన్ని కన్నార్పకుండా చూస్తున్నది-ఆమె మనసులో ఎటువంటి జ్ఞాపకాలు పరుగులు పెడు తున్నాయో? తల ఎత్తకుండానే అడిగింది.

"ఎంత ఖరీదు చేస్తుందంటావు?" అని. ఇద్దర్లో ఎవర్ని ఉద్దే శించి ప్రశ్నించిందో....

"సుమారు ఇరవై కాసు లుండచ్చు. ఈకాలపు ధరబట్టి చూస్తే ముప్ఫైవేలుదాకా వుండవచ్చు." అన్నాడు ప్రసాద్.

"అమ్మ అందుకే యిచ్చి వుంటుంది." అనుకుంది తనలో తను మాట్లాడుకుంటున్నట్లు.

"మీ వస్తువు మీకు యిచ్చేశాము. మాధవిగారు మా మీద దాడి చెయ్యకుండా మీరు చూడండి-" అన్నాడు డాక్టర్ మూర్తి.

"చెపుతాను. వినకపోతే-"

"అంటే-మీ బాధ్యత కాదంటారా?" అడిగాడు ప్రసాద్ కోపంగా.

"చూడండి. కొందరు తెగేదాకా ముడి పెడతారు. మాధవి ప్రతి విషయంలో తన ప్రమేయం కావాలనుకుంటుంది- ఈసారి అలా జరగనీయండి, కాని, మీరు యిన్వాల్వ్ అవకుండా చూడటం నాపూచీ- వెళ్ళొస్తాను. నాకు ఇద్దరు గుడ్ ఫ్రెండ్స్ దొరికారు. నేను చాలా

అదృష్టవంతురాలిని - అమ్మ తను వెళ్ళిపోతూ, నాకు మీ యిద్దరినీ యిచ్చింది. చేయెత్తి నమస్కరిస్తున్నాను. నా కృతజ్ఞతని మాటలలోకి మార్చలేను. వెళ్ళిరానా?" అంటూ చంద్రహారం బాగ్‌లో వేసుకుని లేచింది పంకజం. ఈ యిద్దరికీ-వుక్కిరి బిక్కిరిగావుంది. కళ్ళ ఎదురుగానే పంకజం-కారు స్టార్ట్ చేసింది-కారు కదిలింది-కారు గేటుదాటి వెళ్ళిపోయింది. ఇద్దరూ అచేతనంగా మాటలురానట్లు నిలబడిపోయారు.

"అమ్మయ్యా-నాకిప్పుడు హాయిగా తలంటు పోసుకున్నట్లుంది." అన్నాడు డాక్టర్ ప్రభాకరమూర్తి దానికి సాయిప్రసాద్ నుంచి బదులు రాకపోయేప్పటికి-మూర్తికేదో సందేహం కలిగినట్లయి, "ఏమిటి అలావున్నారు? ఇంతకీ పంకజంగారు ఏమన్నారు?"

"చూశారుగా-చంద్రహారం తీసుకెళ్ళారు."

"అదికాదు రాబీ విషయం."

"ఏమీ అనలేదు. అప్పుడప్పుడు నేను ఈ కాలానికి చెందిన వాడిని కాదు అనిపిస్తూ ఉంటుంది. పంకజంగారి మాటలు వింటుంటే-నాకో నూరేళ్ళు వచ్చినట్లూ-శతవృద్ధు నయినట్లూ అనిపించింది." అన్నాడు ప్రసాద్ నెమ్మదిగా.

"అదేమిటి? మీరు శతవృద్ధుల్లా ఫీలవడమా? విచిత్రంగాఉందే-నాలాంటి వాళ్ళని అంటే ఫరవాలేదుగాని. మీరు అలా అనుకోటం న్యాయం కాదు."

'పంకజంగార్ని చూస్తే అలా అనిపించింది - విచిత్రమైన మనిషి-'"

ఇంతకీ రాబీ గురించి...."

ఒక రకంగా ఆనందరావే నయం అనిపించింది. ఈవిడకు , జాలి, అన్నవి లేవేమో-అనిపించింది ఒకక్షణం.మళ్ళీకొన్ని

మాటలు విన్నప్పుడు చాలా లోతైన మనిషి అని కూడా అని పించేది-"

"తల్లి గురించి ఏమన్నారు?"

"సుందరమ్మగారి గురించి చాలా ప్రేమా-ఆరాధనవున్నాయి. విచిత్రం-ఒక స్త్రీ యిందరిపైన తన ప్రభావం కలిగివుంటం, యిన్ని జీవితాలని సరిదిద్దటం మామూలు విషయం కాదు-కానీ...." ఆగి పోయాడు ప్రసాద్.

"ఏదో చెప్పబోతున్నారు?"

"పంకజంగారి మాటల్లో-ప్రవర్తనలో ఒక అసహజత్వం కని పిస్తోంది. ఇష్టం వుండకపోయినా, కాలుజారినా, ఆఖరికి బలవంతాన లోబడినా-గర్భవాసం అనేప్పటికి స్త్రీలు-తమని మోసగించిన పురుషు డిని అసహ్యించుకుంటారు కాని-పుట్టిన బిడ్డపై ప్రేమ-మమకారం లేకుండా వుండరు. రాబీ వున్నాడు-బ్రతికే వున్నాడు, అనేప్పటికి ఆవిడ హిస్టీరికల్‌గా అవుతారనుకున్నాను. ఆఖరికి మొగవాడైన ఆనందరావులో కలిగిన సంచలనంకూడా ఈమెలో కలగలేదూ అంటే నాకే ఆశ్చర్యంగావుంది-" అన్నాడు ప్రసాద్.

"ఆవిడ-ఆనందరావు గురించి అడిగారా?"

"లేదు. అసలు గత జీవితం గురించి-ఒక్కమాట చెప్పలేదు. ఇదికూడా నాకు విచిత్రంగానేవుంది. సాధారణంగా స్త్రీలు-తొలి పరి చయం, అంటే తనని మొదటి స్పృశించిన పురుషుని గురించి మర్చి పోరు-అంటారు. తొలిప్రేమానుభవం...."

"అవి ప్రేమ కాదేమో!"

"ప్రేమయినా...ఆకర్షణ అయినా ఆనందరావు గురించి ఒక్క ప్రశ్న అడగలేదు. కనీసం అతను ఎలా ఉన్నాడు, పెళ్లి అయిందా అన్న ప్రశ్నకూడా వెయ్యలేదు-"

"మీరు చెప్పారా? కాళ్ళు పోయాయని!"

"ఉహూ-తన గురించి ఆమెవద్ద ఎత్తవద్దని, అడిగినా చెప్ప వద్దని ఆనందరావు మాట తీసుకున్నాడు."

"అలాంటప్పుడు-ఆవిడ అడిగి ప్రయోజనం వుండేదికాదుగా-"

"నిజమే. అలా అడక్క-పోవటంవల్ల నాలోని పురుషాకారం దెబ్బతిన్నదేమో! ఒకవేళ నేనుకూడా మొగవాడినన్న అహంతో ఆలో చిస్తున్నానేమో!"

"మీరు మొగవారే. మనం మొగవాళ్ళం కాక ఆడవాళ్ళమా?" నవ్వాడు డాక్టర్ మూర్తి.

"అదే తమాషా-కాని పంకజంగారు స్త్రీ దేహంలో వుండి-పురుష స్వభావంతో ఆలోచిస్తున్నారు. చాలా క్లియర్‌కట్ అయిడి యాస్ వున్నాయి. రాబీ గురించి-మాట్లాడుతూ- ఆపిల్లవాడిని 'ట్రాన్స్ ప్లాంటేషన్' చెయ్యను-చెయ్యబోను అన్నారు-"

"అదీ ఒకందుకు మంచిదే. పాపం. ఆ ఎలిజబెత్ వాళ్ళు వాడి మీద ప్రాణంపెట్టుకున్నారు. వాళ్ళ బతుకుల్లో వాడే కాంతి తీసుకొస్తు న్నాడు."

"నిజమే కాని ఆ యిద్దరి స్త్రీల గురించీ ఆలోచించి- రాబీని తీసుకెళ్ళను అంటే, నేను అర్థం చేసుకుని వుండేవాడిని అసలు ఆ పిల్లవాడు ఎలా పెరిగాడు-ఎవరి దగ్గర పెరిగాడు? అన్న ప్రశ్నలు వెయ్యలేదు. అటువంటి సందేహాలు కూడా వచ్చినట్టు లేదు ఆమెకి...." అన్నాడు సాయిప్రసాద్.

"బహుశా. ఆనందరావుగారిలాగా ఆమెకూడా తల్లికి మాట యిచ్చారేమో!"

"ఇచ్చారుట. ఇచ్చినా పిల్లవాడు ఎలా వుంటాడు? అని కూడా

అడగలేదు. చాలా రిమార్కబుల్ వుమన్ - అంతటి ఆత్మ నిగ్రహం వుండటం-నేను ఎక్కడా చూడలేదు ముఖ్యంగా స్త్రీలలో."

"మీరు- సోమర్‌సెట్ మామ్ శిష్యులైతిరి- స్త్రీలు- పురుషులు అంటూ విభజించి చూస్తున్నారే.... మీరు కూడా?"

"నిజమే. అది నా బలహీనత అయివుండచ్చు. పురుషుడి నన్న అహం-నా హృదయపు పొరల్లో అడుగున వుండి వుండచ్చు. ఏమైతే ఏం? మన సమస్యకు ఒక ముగింపు కనిపించింది. అయితే నాకేమిటో అసంతృప్తిగావుంది.... మనం ఎన్నుకున్న దారి సరి అయింది కాదనిపిస్తున్నది."

"ఎందుకు కాదు-వాళ్ళ సొమ్ము వాళ్ళకి యిచ్చేశాము. తల్లి సొమ్ములు కూతురికి చెందుతాయి. 'లా' ప్రకారం- మన సంప్రదాయ రీత్యా ఎట్లా చూసినా సుందరమ్మగారి వంటి మీద సొమ్ములు పంకజానికి-అందులో ఒక్కత్తే కూతురుకూడాను. మనం చంద్రహారం ఎవరికి చెందాలో వాళ్ళకి యిచ్చాము." అన్నాడు డాక్టర్ మూర్తి.

"చంద్రహారం-ఎవరికి చెందాలో వాళ్ళకి యిచ్చామా? సరిగ్గా ఆలోచించండి. అది ఎవరికి చెందాలి-? సుందరమ్మగారి ఆఖరి కోర్కె....ఎవరికి చెందాలనుకున్నారు?" సిసలైన లాయర్‌గా ప్రశ్నించాడు ప్రసాద్.

దానికి జవాబు లేదన్నట్లు నిశ్శబ్దంగా వుండిపోయాడు ప్రభాకర మూర్తి. అలా వుండిపోటం అతనికే యిబ్బందికరంగా వున్నట్లుంది. "ఏది ఏమైనా నా నర్సింగ్‌హోమ్ మీద దొంగతనం కట్టే ప్రమాదం తప్పింది. మా ప్రొఫెషన్‌లో ఒక్కసారి చెడ్డపేరు వచ్చిందా ఇక చచ్చినాపోదు-నేను యీ చిక్కులోంచి బయటపడ్డాను. మీరే లేక పోతే పిచ్చి పట్టిపోయి వుండేది." అన్నాడు మూర్తి.

సాయి ప్రసాద్‌కి- మానవ స్వభావం గురించి మళ్ళీ విచిత్రమైన సందేహాలొస్తున్నాయి. ఈడాక్టర్ మూర్తి. ఎంతకీ తన నర్సింగ్

హోమ్, తన ప్రతిష్టా అంటున్నాడు తప్ప- నిజం ఏమిటి? ఏది సత్యం?సుందరమ్మగారి....ఆఖరి కోర్కె-వీటిగురించి ఆలోచించడేం? ఈ సమస్యలో వీరందరూ కలసి-ఎలిజబెత్‌ని-బలి పశువుని చేస్తారా? ఎలిజబెత్ గురించి, రాబీ గురించి వీళ్ళెవరికీ ఆలోచనలు రావా....

"ఒకవేళ-ఈ దొంగతనాన్ని ఎలిజబెత్ మీద మోపుతే!" అడిగాడు సాయిప్రసాద్.

"ఎల్లా చంద్రహారం-మన దగ్గర లేదుగా?"

"లేదనుకోండి. కాని, సుందరమ్మగారు కావాలని యిచ్చింది అన్నది స్పష్టం కానపుడు ఎలిజబెత్ మీద- సందేహం వుండటం సహజంకదా!అప్పుడు నర్సుగా ఆ అమ్మాయి జీవితం ఆలోచించండి? మీరు పెట్టుకుంటారా తిరిగి?"

"ఎందుకు పెట్టుకోను?" అడిగాడు మూర్తి.

"కాని మీ పేషంట్లు ఆ అమ్మాయిని నమ్ముతారా? మాధవిగారు మిమ్మల్ని ఏమీ అనలేకపోయినా- ఎలిజబెత్ గురించి దొంగది అని అనకుండా వుంటారా?" అడిగాడు ప్రసాద్.

"నా బుర్ర గిర్రున తిరుగుతోంది. అంటే చంద్రహారం- పంకజంగారికి యిచ్చి వుండకూడదంటారా?" అడిగాడు యిబ్బందిగా మూర్తి.

"అది ఎవరికి చెందాలో వారికి చెందితే మనం చేసింది రైట్."

"మరి"

"పంకజంగారు ఏం చేస్తారో. ఎలా చేస్తారో అన్నదానిపై మన సత్యాన్వేషణ ఆధారపడివుంటుంది - అంత దాకా మనకి 'సస్పెన్సు' తప్పదు." అన్నాడు ప్రసాద్.

"పది నిముషాల క్రితం అమ్మయ్య అనుకున్నాను. మళ్ళీ మీ రంటుంటే- సందేహంగా వుంది. బంగారం మహచెడ్డది- అది చేతులో వుంటే - మనుషులు ఎలా మారిపోతారో చెప్పటం కష్టం. ఇంతకీ పంకజంగారు ఆ చంద్రహారం ఏం చేస్తారంటా?"

"అదే నేనూ వూహించలేకుండా వున్నాను. చంద్రహారం-

ఎవరికి చెందాలో వాళ్ళకి వెళ్లాలి. అదేకాదు ఎలిజబెత్ నిర్దోషి అని నిరూపణ కావాలి."

"చూడాలి. నాకూ కుతూహలంగానే వుంది. ఈ మూడూజరక్క పోతే-నేను చవటని-బుర్రలేని వాడిని-అని అందరి ముందూ వొప్పు కుంటాను" అని విసురుగా అనేసి-అలా మెట్లు మీంచే యింటికి బయలుదేరాడు సాయిప్రసాద్. వెనకనుంచి డాక్టర్ మూర్తి పిలుస్తున్నా అతను వినిపించుకునే స్థితిలోలేడు. ఏదో చిరాగ్గా-అసంతృప్తిగావుంది అతనికి.

ఆ మరునాడు మూడు గంటల వేళ రావుగారింట్లోంచి ఫోన్. అవతలవైపు నుంచి రావుగారి కంఠం. "ఈ రోజు మీరు వస్తారను కున్నాను రాలేదు."

ఎందుకు అనుకున్నారు- అని అడగాలనిపించి బలవంతాన ఆ మాటలని గొంతులోనే నొక్కుకున్నాడు.

"మాకు కావలసిన వారంతా వచ్చారు. మీరు మటుకు రాలేదు. మా కార్డు అందలేదా?" అడుగుతున్నారు ఆయన. ఆ కంఠంలో వేడు కోలు. అతి జాలికరమైన కంఠధ్వని.

సాయిప్రసాద్ సర్దుకున్నాడు. "అందలేదండి- అందుతే తప్ప కుండా వచ్చేవాడిని. సారీ...."

"పోనీ, యిప్పుడురండి. డాక్టర్ గారికి కూడా ఫోన్ చేశాను. ఆయనకి మధ్యాహ్నం వీలులేక పోయిందిట భోజనానికి రాలేరు. నాలు గింటికొస్తానన్నారు."

"నేనా....?"

"అమ్మాయి చెప్పమంది-మీ యిద్దర్నీ తప్పకుండా రమ్మనమని చెప్పమంది. ప్లీజ్-యీ వొక్కటే-నేను చేయగలపని-దాని జ్ఞాపకార్థం మీరు కనీసం టిపెన్ అన్నా తీసుకోవాలి. కాదనకండి-" బ్రతిమాలుతు న్నాడు.

సాయిప్రసాద్ కి వెళ్ళాలని లేదు. నిన్నరాత్రి అతను ఒక

నిశ్చయానికి వచ్చేశాడు. తను చెయ్యవలసింది చేశాడు ఇటు డాక్టర్ మూర్తికీ లేదు. అటు రావుగారి కుటుంబానికీ లేని అక్కర తన కెందుకు? శతకోటి అనాధల్లో- రాబీ ఒకడు. అసంఖ్యాకమైన ఆడ వాళ్ళలో-యీ ఎలిజబెత్ ఒక్కతె? తనకెందుకీ తలనెప్పి-హాయిగా క్లబ్ కెళ్ళి పేకాడుకోక!

"ప్రయత్నిస్తాను." అన్నాడు అయిష్టంగానే.

ఆ ఫోన్ పెట్టేసిన-మరుక్షణంలో – మళ్ళీ ఫోన్ మోగింది. అటువైపునుంచి డాక్టరు మూర్తి. నాలుగింటికి తనువచ్చి తీసుకెళ్తానని కూడా చెపుతున్నాడు. సాయిప్రసాద్ అయిష్టంగానే ఒప్పుకున్నాడు. తను రావుగారింటికి ఎందు కెళ్ళాలి? చనిపోయిన సుందరమ్మగారితో తనకి ముఖ పరిచయంకూడా లేదు. ఆ తరువాత కొన్ని కారణాలవల్ల-కుటుంబ సభ్యులతో పరిచయం అయింది.ఆ పరిచయం తనకి-తృప్తిని యివ్వలేదు,మానవనైజం గురించి తన అంచనాలు మళ్ళీ తప్పు అయి నాయి. ఎందు కెళ్ళాలి?

కాని, పట్టుదలగా వుండలేకపోయాడు. డాక్టర్ మూర్తి వచ్చే ప్పటికి సిద్ధంగావున్నాడు. వారిద్దరూ వెళ్ళేప్పటికి రావుగారింట్లో-పరాయి వాళ్ళు ఎవరూ లేరు: ఆవరణ చుట్టూ తడితడిగా-చిత్తడిగా వుంది. బహుశా అన్నదానం ముమ్మరంగా సాగి వుంటుంది. ముందు హాల్లో సోఫాల్లో రావుగారూ-పంకజం కూచుని ఉన్నారు. ఆ పక్క మాధవి, ఆమె పక్క మరో స్త్రీ ఉన్నారు-బహుశా పెద్ద కోడలయి ఉంటుంది. ఆరోజు కారులోంచి దిగిన-మధ్య వయస్కుడు-పంకజం భర్త.ఇంకో యిద్దరు పురుషులు. అందులో మాధవి భర్త ఎవరై వుంటారా అని కుతూహలంతో చూస్తున్నాడు-సాయిప్రసాద్.

పంకజం- అందర్నీ పరిచయం చేసింది. జిలేబి, పులిహోరా, వుల్లిపాయ పకోడీలు ప్లేట్లులో పెట్టి తీసుకొచ్చింది వంట మనిషి.

"మా అమ్మకి యిష్టమైన ఫలహారాలు, ఆమె జ్ఞాపకార్థం మీరు

తినాలి-వద్దనకూడదు" అంది. ప్లేటు ఖాళీ చేసేదాకా వూరుకోలేదు. యీ మాటలూ ఆ మాటలూ మాట్లాడుతున్నారు అందరూ. వారంతా విషాదాన్ని మర్చిపోయి మామూలు మనుష్లలో పడటానికి ప్రయత్నం చేస్తున్నారన్నది స్పష్టంగా కనిపిస్తూ వుంది.

టీ వచ్చింది, వక్కపొడి తమలపాకులూ కూడా వచ్చాయి. డాక్టర్ మూర్తి ఆకులు అలవాటులేదని ఆకులు వేసుకోలేదు. ప్రసాద్-ఒక్కొక్క ఆకుకి యీనెలుతీసి సున్నం రాస్తూ ఆలోచిస్తున్నాడు. మాధవి ముఖంలో పట్టుదల, వుత్సాహం వురకలేస్తున్నది. ఆమె ఏ క్షణాన్నయినా- చంద్రహారం విషయం ఎత్తవచ్చు. పంకజం, మాధవికి అసలు విషయం చెప్పలేదన్నమాట. ఎందుకు? డ్రామాకి తమ కళ్ళముందే- తెరఎత్తబోతున్నారన్నమాట? దీనికి సూత్రధారులు ఎవరు? పంకజమా? మాధవా? రావుగారా? ఎవరు? అతని మెదడులో ప్రశ్నలు సుళ్ళు తిరుగుతున్నాయి.

"డాక్టర్‌గారూ, చంద్రహారం దొరికిందా?" అడిగింది మాధవి.

"లేదు" అన్నాడు డాక్టర్‌మూర్తి.

"మీ నర్స్ పారిపోయిందిటగదా? పోలీసు రిపోర్ట్ యిమ్మన్నారా? ఈ యింట్లో, అందరూ వూరుకున్నా, నేను మటుకు వూరుకోను. అది మా అత్తగారిసొమ్ము- మా వస్తువు మాకు చెందాలి" అంది దృఢంగా.

ఒక్క క్షణం చుట్టూ నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడలేదు. అందరూ ప్రేక్షకుల్లా చూస్తున్నారు.

"ఒదినా- చంద్రహారం ఎలిజబెత్ దొంగిలించిందని- ఎలా చెపుతున్నావు? నువ్వు కళ్ళారా చూశావా?" అడిగింది పంకజం.

"అది- మీ అమ్మ వొంటిమీద లేదుగా. ఆరోజు నువ్వూ చూశావు." అంది మాధవి కోపంగా.

"నేనే కాదు. అందరం చూశాము. పోనీ, యింట్లో వాళ్ళని ఎవరినైనా నువ్వు అడిగావా?"

"ఏమని ఎందు కడగాలి?"

"చంద్రహారం ఏమైందని! ఎవరైనా అని.'

"ఛీ ఛీ- మనం ఎందుకు తీస్తాం?"

"అలాంటప్పుడు- ఆ నర్సు మటుకు ఎందుకు తీస్తుంది. తను మటుకు మనిషి కాదా?"

"అది పరాయిది-దొంగది."

"పరాయి మనిషి అయినంత మాత్రాన 'దొంగ' అని ఎలా చెపుతావ్....? ఎదురు సవాల్ చేస్తూ అడిగింది పంకజం.

సాయిప్రసాద్- అంతదాకా నిర్లక్ష్యంగా వింటున్నాడు ఈసంభాషణని.పంకజం విసిరిన సవాల్ తో అతనిలో వుత్సాహంపుంజుకుని, సోఫాలో నిటారుగా కూచున్నాడు. మిగతా అంతా నోరు మెదపకుండా వింటున్నారు ఈ వదినా మరదళ్ళ వాగ్యుద్ధాన్ని.

మాధవి ఓడిపోదలుచుకోలేదు."నాకీ ఆర్గ్యుమెంట్లు అనవసరం- ఆ చంద్రహారం యిక్కడికి రావాలి."

"ఎందుకని."

"మనదికాబట్టి...."

"మనది అనకు- 'నాది' అను మా అమ్మ నగలు నావి. అది ఎవరి దగ్గిర వుండాలో వాళ్ళ దగ్గరవుంది. ఇదుగో చంద్రహారం. చూశావుగా! అందరూ చూడండి. తృప్తి అయిందా?"

"నీ దగ్గర వుందా?"

"ఏం, నేను దొంగతనం చేశానంటావా?"

"అదికాదు....అదికాదు. ఆరోజు నేను ఖంగారు పడుతుంటే ఎందుకు చెప్పలేదు?" అడిగింది మాధవి.

"నువ్వు-నన్ను అడిగావా?సరిగ్గా జ్ఞాపకం తెచ్చుకో-ఒక పక్క అమ్మ బాడీ అక్కడుంటే, నీకు ఏ మాత్రం ఆమె మీద గౌరవం వున్నా, అంతా హడావుడి చేసేదానివికాదు.నాన్నను ఎలా నిలదీశావో- నేనూ చూస్తూనే వున్నాను."

"అప్పుడే ఎందుకు చెప్పలేదు?"

"ఎందుకు చెప్పాలి? నువ్వు ఏదో ముఖ్యరాలినని నిర్ణయాలు తీసుకుంటున్నావుగా! అడగని విషయం నేను ఎందుకు చెప్పాలి? కావాలనే చెప్పలేదు."

"నన్ను అందరిముందూ, ఫూల్‌ని చేశావుకదూ కావాలని!" మాధవి కంఠం వొణుకుతోంది.

"నేను కావాలని చేయలేదు. నువ్వే ముందుకు చొచ్చుకు వొచ్చావు. ఈ చంద్రహారం అమ్మ క్రితం రోజు రాత్రి మెళ్ళోంచి తీసి నాకు అప్పగించింది-"

"నీకా?" అడిగింది మాధవి.

"ఏం? నేను ఆవిడకూతుర్నికాదా. అయితే అది నాకోసం -ఇవ్వలేదు. ఆవిడ వొంటిమీద నగలకోసం మనం ఎంత హీనంగా కొట్లాడుకుంటామో అమ్మ వూహించింది...."

"నన్ను హీనం అంటున్నావా? నాకెందుకు నాకు కావలసినన్ని నగలున్నాయి."

"మరి ఈ చంద్రహారంలో నీకు భాగం వుందంటున్నావుగా?" అడిగింది పంకజం కవ్వింపుగా-

మాధవి మొహం కందగడ్డలా చేసుకుని భర్తవంక చూస్తున్నది అర్థింపుగా. అతను తల తిప్పుకున్నాడు. పంకజం పథకం కొద్ది కొద్దిగా ప్రసాద్‌కి బోధపడుతోంది.

"నాన్నకి ముందే చెప్పాను. మీకుకూడా చెపుతున్నాను. అమ్మ యీ చంద్రహారం, ఆ నర్సు-ఎలిజబెత్‌కి యిమ్మని నా చేతికి యిచ్చింది- ఇది యిన్నాళ్ళ నుంచీ నా దగ్గర వుంది-" అంది పంకజం-

ప్రసాద్ ఆమె వంక ఎడ్మిరేషన్‌తో చూస్తున్నాడు- సమస్యను ఎంత తేలిగ్గా పరిష్కరించింది. పంకజం చుట్టూవున్న వారి వునికిని మర్చిపోయి

నట్లు చెపుతోంది-" వాదినా, సాటి మనిషి మీద నేరం మోపడం చాలా తేలిక- అది నిరూపించటానికి ఆధారాలు కావాలి. నువ్వు కళ్ళతో చూడని వాటిని నమ్మకు."

"డాక్టరుగారూ, మా యింట్లో అందరిముందూ మీకు యీ చంద్రహారం యిచ్చేస్తున్నాను. అది ఎవరికి చెందాలని, మా అమ్మ యిచ్చిందో వారికి అందచెయ్యండి. ఎలిజబెత్‌కి- మా యింట్లో అందరి తరఫునా క్షమార్పణ చెప్పుకుంటున్నాను. ఆమె భయపడి వూళ్ళోంచి పారిపోయిందని విన్నాను. వెనక్కి రప్పించండి. మా అమ్మకి ఆఖరి రోజుల్లో మేము ఎవరమూ చేయనంత సేవచేసింది. దానికి ప్రతిఫలం, 'దొంగ' అన్న పేరు అంటగట్టాము. అయామ్ సారీ మీరూ ప్రసాద్‌గారూ కలిసి చంద్రహారం ఆమెకు అంద చెయ్యండి-మిగతా నగలూ సామానూ వాటి గురించి మేము మామూలు మనుషుల్లాగానే దెబ్బలాడుకోవచ్చు...." అంది పంకజం.

తాము వచ్చినపని అయిపోయింది అని పంకజం అన్యాప దేశంగా చెబుతున్నది- అన్నది ప్రసాద్‌కి అర్ధం అయింది. అతను లేచాడు. డాక్టర్ మూర్తి లేస్తుంటే 'చంద్రహారం' వున్న కాయితం పొట్లం అందించింది పంకజం.

ఈసారి అది తాచుపాములా అనిపించలేదు. సత్యశోధనలో మానవత్వంలోని మాణిక్య కాంతికి మచ్చుతునక అనిపించింది ఆ యిద్దరికీ!

! సమాప్తం